

# బాపు - నేను

రచన

యమ్.ఎస్. రాజలింగం



ప్రచురణ
ఉదయాంబికా పబ్లికేషన్స్
1-1-336/18, చిక్కడపల్లి,
హైదరాబాద్ - 20.



# బాపు

నేను క్రొత్త సిద్ధాంతాన్ని దేన్నీ ప్రతిపాదించడం లేదు. దైనందిన జీవితంలోని సమస్యలకు నిత్య సత్యాలను అనుసంధానం చేసేందుకు ప్రయత్నం చేశాను. నా తత్త్వం, నా ఆధ్యాత్మికత్వం "ఆడంబరమైన" ఆ పేరు కావాలంటే వాడండి. అది నేను చెప్పబోయే సత్యవాణిలో ఉన్నది. దానిని మీరు "గాంధియిజం" అని పిలువవద్దు. ఇందులో యే "ఇజమూ" లేదు. దీని కోసం విస్తృతమైన సాహిత్యం, ప్రచారం అక్కర లేదు.



I have nothing to teach the world
Truth and non-violence are as old as hills.

---

హరిజన్ - 36 పుటి, 28-3-1919. - ఎమ్.కె. గాంధీ.

# ఉపోద్ఘాతం

గాంధీజీ జీవితాన్ని గురించి గొప్ప గొప్పవారు పెద్ద పెద్ద గ్రంథాలు రచించారు. అవి కేంద్ర, రాష్ట్ర గ్రంథాలయాల్లోను, విశ్వవిద్యాలయ భాండాగారాల్లోను ఉన్నత విద్యాభ్యాసం చేసే విద్యార్థులకు, పరిశోధకులకు కరదీపికలుగా ఉన్నాయి.

కాని బాలబాలికలకు, విద్యార్థులకు గాంధేయ అనుభవ సూత్రాలను, ఆచరణ విధానాలను తేలికగా తెలియజెప్పే రచనలు లేవనే చెప్పవచ్చు. ఆ లోటు తీర్చుటకు చేసిన ప్రయత్నమే ఈ చిన్ని పుస్తకము.

పోలీసుల బారి నుండి తప్పించుకోడానికి మారువేషంలో వార్ధా చేరిన మీదట ఆకస్మికంగా హైదరాబాదు ప్రజానాయకుడైన స్వామి రామానందతీర్థను కలిసాను.

వారి సంభాషణ ఫలితంగా ఆనాడు ప్రపంచాన్నంతా ఉర్రూతలూగిస్తున్న గాంధీగారి అహింస, సత్యాగ్రహం ఇత్యాది సూత్రాల్లోని ఆంతర్యం అర్థం చేసుకోవాలనే జిజ్ఞాస నాలో అధికమైంది.

ఈ మధ్యకాలంలో పలు సాంఘిక, సామాజిక కార్యక్రమాల్లో జరిగిన పలు చారిత్రిక సంఘటనలు, సన్నివేశాలు పదిమందితో పంచుకొనే సందర్భంగా స్పందించి, అవి అందరికీ అందాలనే పెద్దల సూచనకు, ప్రోత్సాహానికి అక్షరరూపమే ఈ చిన్ని పుస్తకం.

ఈ యత్నంలోనే, గాంధీజీతో సేవాగ్రాం ఆశ్రమంలో దాదాపు 2 సం. వుండే అదృష్టం నాకు లభించింది. అక్కడ జరిగిన కొన్ని సంఘటనలు, అనుభవాలు దాదాపు 60 ఏండ్ల తరువాత వాటిని అక్షరబద్ధం చేయాలనే సంకల్పం నాకు కలిగింది. దాని పర్యవసానమే 'బాపు–నేను' అను ఈ చిన్ని పుస్తకం.

మొదటి అధ్యాయంలో నిజాం రాష్ట్ర ప్రభుత్వం నుంచి తప్పించుకొనుటకై మారువేషంలో వార్ధా చేరడం, అనుకోని విధంగా స్వామి రామానంద తీర్థ కలవడం, ఆయన సిఫారసుపై బజాజ్ ట్రస్టు నుండి 10 రూ. స్కాలర్‌షిప్‌కై యత్నించడం ఈ అధ్యాయంలోని ముఖ్యాంశాలు.

రెండవ అధ్యాయంలో జె.సి. కుమారప్పగారి ఆధ్వర్యంలో నడుపబడుతున్న గ్రామీణ విద్యాలయంలో విద్యార్థిగా వుండి పేపరు, నూనె యిత్యాది గ్రామ విద్యుత్ పరిశ్రమలలో తర్ఫీదు పొందడం, లాంతరు దీపాలను చూసి "యిది భావి భారతము" అని పండిత్‌జీ మురిసిపోతూ చేసిన ఉపన్యాసాలు, వెన్న నుంచి అధిక నెయ్యి ఉత్పత్తికై పరిశోధన, అఖిల భారత గోసేవా సంఘం నుంచి 20 రూ. స్కాలర్‌షిప్ పొందడం యిందు పొందుపరచబడ్డాయి.

మూడవ అధ్యాయంలో ప్రార్థనా రిజిష్టరులో నా పేరు నమోదు, సేవాగ్రాం డైరీ ఫారంలో అసిస్టెంట్ మేనేజరుగా పనిచేయడం, నేతి పరిశోధనలో విజయం, సేవాగ్రాంలో నేను అడుగుపెట్టిన విధానము యిందలి ముఖ్యఘట్టాలు.

నాల్గవ అధ్యాయంలో గాంధీజీ ఏకాదశ సూత్రాలు, వ్యక్తి సత్యాగ్రహం, వినోబాని ప్రథమ సత్యాగ్రహిగా బాపు ఎంపిక చేయడం, సాయుధ పోరాటమా? శాంతియుత పోరాటమా? అనే మీమాంస, భారతానంద్ ప్రేమతో పశుసంతతికి చేసిన సేవలు, మాన రక్షణకై పోలెండువనితలు చేయు పోరాట కార్యక్రమం అహింసయేనా అనే ప్రశ్న, పట్టాభిగారిని సుభాష్ చంద్రబోస్‌తో పోటీ చేయవద్దని చెప్పుటకై కళా వెంకట్రావుగారి నాయకత్వంలో వచ్చిన రాయబార వర్గం, వివిధ ఆశ్రమ నిర్యాణాలు, బజాజ్‌ని ఐదవ కుమారుడిగా బాపు ఎంచిన విధానం, గురు స్వరూపం, ప్యారేలాల్‌ను, నన్ను ఒక దగ్గరకు చేర్చిన నా చెడు దస్తూరి ఘట్టం, రాజేంద్రబాబుకు స్వాగతం పలికేందుకు ఆశ్రమం తరఫున వార్ధా స్టేషనుకు పోయినప్పుడు మా ప్రిన్సిపాల్ టర్నరు నన్ను చూసి తోటి మిలిటరీ వారికి ఆప్యాయతతో పరిచయము చేసిన విధానము. ఈ ఆలోచనల మూల స్వభావము యీ అధ్యాయంలో కొనసాగును. అటులే పెద్దలతో ఫోటో దిగడం సమ్మతం కాదని, క్రమశిక్షణకు విరుద్ధమని, గాంధీగారు భంగిగా పనిచేసి సఫాయి చేయువారు వేరే జెండా ఉండాలని ఆనాటి వారి భావన. ఆశ్రమంలోని అండమాన్ ఖైదీల మనస్తత్వం, నే పొందిన వేపాకు ప్రసాదం, ఆశ్రమంలో పాముని చంపవచ్చునా లేదా అనే సమస్య, కస్తూరిబా నిర్భయత, పరుచూరి శాస్త్రి ఆమరణదీక్ష యిత్యాది ఆసక్తికర విషయాలు యిందులో చోటు చేసుకున్నాయి. అలాగే గాంధీజీ మరణానంతరం దహన సంస్కారాలప్పుడు నన్ను విడిచిపెట్టమని నేను జైలు అధికారులను అడగడం, వారు తిరస్కరించడం, నేను ఉపవాసం చేయడం చివరికి

చితాభస్మ పేటిక వరంగల్ తెచ్చినపుడు శ్రద్ధాంజలి ఘటించుటకై దిన్‌షా ఇటాలియా భవనానికి పోలీసు ఎస్కార్ట్‌తో నన్ను తీసుకువెళ్ళడం వీటికి సంబంధించిన వివరాలు యిందులో వివరించబడ్డాయి.

ఐదవ అధ్యాయంలో నా ఇల్లాలు ఆశ్రమం రావడం, ఆశ్రమ మేనేజరు ఆ రాత్రి ఆశ్రమంలో వుండుట క్రమశిక్షణకు విరుద్ధమని అనడం, ఈ విషయాన్ని బాపుకు తెలియజెప్పి మనసులేని చోట పనిచేయలేనని నేను ఆశ్రమం వదలడం, ఆరవ అధ్యాయంలో ముస్తాబాదులో నిర్మాణ కార్యక్రమం మొదలు పెట్టడం, చమన్‌లాల్జీ బాపుతో సంప్రదించి అగ్నిగుండంలో దూకేవారికి ఆశీస్సులు ఎవరు ఇవ్వగలరని వ్రాయడం, జె.సి.కుమారప్ప ఆశీర్వదించడం, ఏకలవ్య దృష్టితో నిర్మాణ కార్యక్రమం విజయవంతం చేయడం, బాపు క్విట్ ఇండియా ఉద్యమ ప్రారంభం, బాపు ఆదేశాన్ని ప్రభాకర్‌జీ నాకు తెలపడం, క్విట్ ఇండియా ఉద్యమాన్ని వరంగల్‌లో నడపడం కూడా ఈ అధ్యాయంలోని ముఖ్యాంశాలు.

ఒక విధంగా చెప్పాలంటే బాపు ఏకాదశ సూత్రాలకు అర్థము వాటిని పరిస్థితులకు అన్వయింప చేసి వ్యవహరించే విధానము, నే చూసిన సంఘటనలు, పొందిన అనుభూతి ఈ గ్రంథము యొక్క సారాంశము.

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు ఈ గ్రంథము వారి అభిప్రాయసేకరణకై పంపినపుడు వారంతట వారే ఇందులోని ఇంగ్లీషు భాగాలనన్నిటిని తెలుగులోనికి అనువదించారు. ఆ అనువాదములే ఈ గ్రంథము అర్థం చేసుకొనుటకు కొంత సులభత చేకూర్చినవి. అందులకు వారికి ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుకొనుట నా విధి.

ఈ గ్రంథము యొక్క సారాంశము ఇంగ్లీషులో నున్న ఆంధ్రేతరులకు సులువగుననే సూచన వచ్చినది. ఈ విషయం డా. ఐ.వి. చలపతిరావు "త్రివేణి" సంపాదకులతో ముచ్చటించగా వారు అందులకు పూనుకొని, గ్రందము యొక్క సారాంశాన్ని ఇంగ్లీషులో రాసినారు. వారికి కూడ నా ప్రత్యేక అభినందనలు.

నేను 1940లో సేవాగ్రాం ఆశ్రమంలో చేరాను. ఇప్పటికి దాదాపు 60 సంవత్సరాలు అయినది. ప్రస్తుత నా వయస్సు (81 సంవత్సరాలు)ను బట్టి గ్రంథము త్వరగా ముగించాలనే ఆతురతవల్ల విషయాన్ని అర్థం చేసుకోవడం, అంచనా

వేయుడంతో కొన్ని పొరపాట్లు, తప్పులు చోటుచేసుకొని వుండవచ్చు. వాటికి అన్నిటికి నేనే బాధ్యుడిని అట్లు ఏవైనా వున్నా నాకు తెలియజేయవలెనని కోరుతున్నాను. అట్లే, ఈ గ్రంథమును ఒక కథ, నవలలాగా వరుస క్రమం (కంటిన్యుటీ) వుంటుందని భావించక, ప్రతి సంఘటనను తరువాయి సంఘటనలకు ముడిపెట్టక, సంఘటనలను అంతవరకే పరిమితం చేసి చదువవలెనని నా విజ్ఞప్తి.

ఎనభై దాటిన వయస్సులో రచించిన ఈ పుస్తకం గాంధీజీ సిద్ధాంతములను, అనుభవాలను అర్థం చేసికునేందుకు, వీటి పట్ల శ్రద్ధాసక్తులు పెంపొందించుటకు తద్వారా మహాత్ముడు కలలు కన్న 'రామరాజ్య' స్థాపనకు ఉడుతాభక్తి'తో ప్రతి ఒక్కరూ తోడ్పడడానికి దోహదం చేస్తుందని నా ప్రగాఢ విశ్వాసం !

ఒక్క మాటలో చెప్పాలంటే ఈ చిన్ని పుస్తకం చదివి అర్థం చేసుకొని అవగతం చేసుకుంటే మహాత్ముడిని నాడు–నేడు – మరెప్పటికీ అర్థం చేసికొన్నట్లేనని నా దృఢ విశ్వాసం !



# కృతజ్ఞతలు

నా అనుభవాలు గ్రంథరూపం దాల్చాలని ఆకాంక్షిస్తూ, పదేపదే గుర్తుచేస్తూ నా ప్రయత్నం మొదలుపెట్టడానికి ప్రోత్సాహాన్ని అందించిన పెద్దలు, మిత్రులు అయిన కీ.శే. కె.ఎస్.ఆచార్యులు, అధ్యక్షులు, అకాడమీ ఆఫ్ గాంధియన్ స్టడీస్, కీ.శే. కె.ఎస్. రాధాకృష్ణ, అధ్యక్షులు, గాంధీ పీస్ సెంటర్, కీ.శే. డా॥ పి. తిరుమలరావు, కీ.శే. డా॥ యం.వి.ఆర్. ఆచార్యులు, కీ.శే. ఎస్.పి. వీరభద్రయ్య ప్రముఖ స్వాతంత్ర సమరయోధులు, కీ.శే. ఐ.బి.నాగేశ్వరరావు, ట్రేడ్ యూనియన్ నాయకులు, డా.జి.ఉపేంద్రరావు, ఉమ్మెత్తల కేశవరావు, వెల్దుర్తి మాణిక్యరావు, 'జనధర్మ' సంపాదకులు శ్రీ ఎం.ఎస్. ఆచారిగార్లను ఈ సందర్భంగా స్మరించుకోవడం నా కర్తవ్యం.

నా ఈ చిన్ని పుస్తకముపై ప్రత్యేకంగా సమయము కేటాయించి, తగు సూచనలు, అభిప్రాయముల నొసంగిన జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా॥ సి.నారాయణరెడ్డి, శ్రీ పోత్తూరి వెంకటేశ్వరరావు, అధ్యక్షులు, ఆంధ్ర ప్రదేశ్ ప్రెస్ అకాడమీ, కృష్ణాపత్రిక సంపాదకులు శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు, శ్రీ కె.వి.రమణాచారి, ఐ.ఏ.ఎస్., కమిషనర్ ఖాదీబోర్డు, స్వా.స.సంఘం (ఆం.ప్ర.) ఉపాధ్యక్షులు శ్రీ జి.నారాయణరావు, ఐ.ఏ.ఎస్.(రిటైర్డ్), సహాయ కార్యదర్శి శ్రీ అడుసుమల్లి కృష్ణమూర్తి, ప్రొఫెసర్ శ్రీ జి.వి.సుబ్రహ్మణ్యం, డా॥ కోదాటి నారాయణరావు, కార్యదర్శి, గాంధీ స్మారకనిధి, డా॥ శివప్రసాద్, కళా ప్రపూర్ణ డా॥ పోతుకూచి సాంబశివరావు, ప్రముఖ గ్రంథ రచయిత మరియు త్రివేణి పత్రిక సంపాదకులు శ్రీ ఐ.వి. చలపతిరావు, శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి, స్వాతంత్ర సమరయోధులు శ్రీ మాదాల వీరభద్రరావుగార్లకు నా ప్రత్యేక కృతజ్ఞతలు.

అలాగే భారత ప్రభుత్వ జాతీయ పరిశోధనాచార్యులు డా॥ రామరాజుగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

ప్రముఖ వాఙ్మయ పరిశోధకులు శ్రీ హరి ఆదిశేషు, సర్వోదయ నాయకులు, స్వాతంత్ర సమరయోధులైన శ్రీ సి.వి.చారి, శ్రీ కె.వైద్యనాథన్,

శ్రీ బోయినపల్లి వెంకట్రామారావు, శ్రీ ముడుంబై రామానుజాచారి, శ్రీ యం.ఎస్. రంగాచారి, ఓలేటి అచ్యుత రామశాస్త్రి, సీనియర్ అడ్వకేట్ శ్రీ బండారు చంద్రమౌళీశ్వరరావు, మాజీ మంత్రి శ్రీ ఎన్. యతిరాజారావు, ఫార్మర్ ఎ.పి.పి.ఎస్.సి.సభ్యులు శ్రీ బాబూరావు వర్మ, శ్రీ ఎల్.వి. రమణ, సబ్ ఎడిటర్, ఆంధ్ర ప్రభ, విజయవాడ, శ్రీ యు. ఉమా మహేశ్వరరావు, చీఫ్ సబ్ ఎడిటర్, ఆంధ్రప్రభ, హైదరాబాద్, అకాడమీ ఆఫ్ గాంధీయన్ స్టడీస్ సభ్యులైన శ్రీ జి. శివరామమూర్తి, ప్రొ. టి.శివాజీరావు, డా జి.ఆర్.ఎస్.రావు గార్లు అందించిన ప్రోత్సాహానికి కృతజ్ఞతలు.

ఈ రచనకు అహర్నిశలూ శ్రమిస్తూ నా భావాలు కాగితంపై కదలిపోయేలా చేస్తూ అనుక్షణం వెన్నంటి ఉన్న మా అల్లుడు చి. ఎస్.పి. అంబా ప్రసాద్, నా శ్రీమతి ఎమ్. లలితాదేవి, మా సోదరి శ్రీమతి ఎస్.పి.భవాని, శ్రీమతి భవాని, లెక్చరర్, అంబేత్కర్ కాలేజి తోడ్పాటు విస్మరించరానిది. శ్రీ కె.వి.శేషశాయి, శ్రీ వి. వేంకటేశ్వర రావు, తేజా గ్రాఫిక్స్‌గార్ల తోడ్పాటు ఈ పుస్తక ప్రచురణలో ప్రధాన పాత్ర వహించింది.

రచయిత.

# ప్రకాశకుల విజ్ఞప్తి

తెలుగు విశ్వవిద్యాలయము, జ్యోతిష్య విభాగము అధిపతి శ్రీ సి.వి.బి. సుబ్రహ్మణ్యంగారి ఆశీస్సులతో ఉదయాంబికా పబ్లికేషన్స్ ప్రారంభించడమైనది.

మాన్యులు శ్రీ యమ్.ఎస్. రాజలింగంగారి " Border Camp Scheme and pension for Freedom Fighters of erstwhile state of Hyderabad" అనే పుస్తకం మా తొలి ప్రచురణగా పలువురి మన్ననలు పొందింది. స్వాతంత్ర్య సమరయోధులకు సంబంధించిన అనేక అంశాలను విభిన్న కోణాల నుండి స్పృశించిన ఈ గ్రంథాన్ని విలువైన సమాచారం అందించిన కరదీపిక గాను, సమాజసేవ చేయాలనుకునే వ్యక్తులకు ఉత్తమ మార్గదర్శిగాను ప్రముఖులచే ప్రశంసించబడింది.

మాకు ఆశీస్సులు అందజేసిన ప్రముఖులు జ్ఞానపీఠ అవార్డు గ్రహీతలు, రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ సలహాదారు డా. సి.నారాయణరెడ్డి, ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ శ్రీ జి.బిక్షపతి, రాష్ట్ర ప్రభుత్వ ప్రిన్సిపాల్ రెవెన్యూ సెక్రెటరీ శ్రీ మురళీకృష్ణ, I.A.S. గార్లకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

మా ఉదయాంబికా పబ్లికేషన్స్ నుండి వెలువడిన తొలి ప్రచురణకు ఇంతటి ఆదరాభిమానములు లభించే విధంగా విలువైన విషయాన్ని గ్రంథరూపంలో వ్రాసిచ్చిన మాన్యులు శ్రీ యమ్.ఎస్. రాజలింగంగారికి హృదయపూర్వక నమస్సుమాంజలులు అర్పిస్తూ, అదే ప్రోత్సాహంతో వారు తెలుగులో రచించిన "బాపు-నేను" అనే ఈ గ్రంథమును మా ద్వితీయ ముద్రణగా ప్రచురిస్తున్నాము.

ఈ గ్రంథములో వారు, ప్రభాకర్‌జీ సేవాగ్రాం ఆశ్రమవాసులుగా వున్నప్పుడు పొందిన అనుభవాలు, జరిగిన ఆసక్తికరమైన సన్నివేశాలు, సంఘటనలు పొందుపరచడమైనది.

ప్రస్తుత కాలమునకు గాంధేయమార్గమే శరణ్యమని, ఆచరణీయమని చాటిచెప్పుటలో ఈ గ్రంథము ఎంతైనా తోడ్పడుతుందని భావిస్తున్నాము. అలాగే, ఈ గ్రంథము భావితరాలకు తగు స్ఫూర్తినందిస్తుందని ఆశిస్తున్నాము.

చిట్టచివరగా వివిధ సంస్థలు, ముఖ్యంగా యూనివర్సిటీలు. అనుబంధిత విద్యాలయాలు, గ్రంథాలయాలు ఒక ప్రతినైనా లైబ్రరీలో భాగంగా చేయవలెనని మా ప్రార్థన.

ఎస్. పి. అంబా ప్రసాద్
ఎస్. పి. ఉదయలక్ష్మి.

# విషయసూచిక

# మారువేషంలో
# వార్ధా ప్రయాణం

**నిజాం కాలేజీ చదువు పూర్తి**

నా నిజాం కాలేజీ చదువు 1940 నాటికి పూర్తి అయింది. నా విద్యార్థి జీవనంలోని ఆందోళనా కార్యక్రమాలవల్ల ప్రభుత్వం నాపై కఠిన నిగరాని పెట్టింది. మా కుటుంబ పరిస్థితిని బట్టి మా నాన్నగారు నన్ను ఉద్యోగం చేయమన్నారు. పోలీసుల వల్ల నాకున్న బాధలు వారికి తెలియవు. ఏదైనా మా నాన్నగారి కోరిక ప్రకారం ఉద్యోగం చేయడం కుదరలేదు.



ప్రొద్దుటూరి వీరేశ్వరరావు

నా భవిష్యత్తు నేను నిర్ణయించుకోవాల్సివచ్చింది. నావద్ద పైసా కూడా లేని దశ అది. అందుకై, ప్రొద్దుటూరి వీరన్నగారి కుమారుడు వీరేశ్వరరావుగారికి నా కాలేజి పుస్తకాలు అరవై రూపాయలకు అమ్మివేసాను.

**పిట్టలవాని వేషం**

పోలీసులు నా వెంట పడ్డారు. వారి నుండి తప్పించుకొనుటక్కై పిట్టలవాని వేషంలో సికింద్రాబాదు వదలి వార్ధా 29.6.40 బయలు దేరాను. మొఖానికి నల్ల దస్తీ, మోకాలు వరకు చారల లుంగీ, నల్ల హాఫ్‌షర్టు, అల్యూమినియం ప్లేటు, జగ్గు, నడుముకు తోలు బెల్టు, పాత చెప్పులు వేసుకొని అద్దంలో చూసుకుంటే నేను నేనేనా అనిపించింది. ఈ వేషంలో వరంగల్లులో నేనున్న ఇల్లును, ఇల్లాలిని వదలి జి.టి. లో 30.6.40 వార్ధాలో దిగాను.

మొదటి నెలలోనే నే పుస్తకాలమ్మి తెచ్చుకొన్న అరవై రూపాయలు దాదాపు ఖర్చయి పోయింది. పప్పు పుట్నాలు, మంచినీరు త్రాగి జీవనం గడపవలసిన స్థితి వచ్చింది.

వార్ధా ప్రవేశం
స్వామీజీ కలయిక



ఏదో విధంగా వార్ధాలో నిలువద్రొక్కుకోవాలనే ఉద్దేశ్యంతో గ్రామీణ విద్యాలయంలో విద్యార్థిగా ప్రవేశించాలని అనుకొన్నాను. ఇది కొంతవరకు నిజాం ప్రభుత్వం బారినుండి నన్ను తప్పిస్తుందని భావించాను. ఈ పరిస్థితిలో అనుకోని విధంగా స్టేట్ కాంగ్రెస్ నాయకుడైన రామానందతీర్థ స్వామీజీ వార్ధాలో కలిశారు. ఆయనకు నా పరిస్థితి విన్నవించాను. నాకు ఈ క్రింది లేఖ బజాజ్ కార్యదర్శి దామోదర దాసుకు వ్రాసి యిచ్చారు. దామోదరదాసు నిజాం రాష్ట్రం నుంచి బహిష్కరించబడిన గాంధేయ కార్యకర్త.

19.8.40

Dear Damodar Das,

Mr. M.S.Rajalingam has come over to get training in paper making and other industries. He is industruous and promises to devote himself for the cause of the country. He is poor and has to depend upon others for the prosecution of studies. If a scholarship is given to him, his troubles will be saved. I recommend him for all help that is possible.

With Regards,

Yous in service,
Sd/-
(Swami Ramanada Thirtha)

19.8.40

ప్రియమైన దామోదర్ దాసుకు,

శ్రీ ఎం.ఎస్.రాజలింగం కాగితం తయారీ మరియు ఇతర పరిశ్రమలలో తర్ఫీదు పొందడానికి వచ్చారు. అతడు కష్టపడి పనిచేసేవాడు. దేశ ప్రయోజనాల కోసం అంకితమై కృషి చేస్తానని వాగ్దానం చేస్తున్నాడు. అతడు బీదవాడు. చదువు కొనసాగించాలంటే ఇతరులపై ఆధారపడవలసి వుంది. అతని కేదైనా స్కాలర్‌షిప్ ఇప్పిస్తే అతని బాధలు తీరుతాయి. వీలైనంత సహాయం చేయాలని నేను సిఫారసు చేస్తున్నాను.

అభివాదాలతో,

మీ సేవలో,

(సం.) స్వామి రామానందతీర్థ.

స్వామీజీ చేసిన ఈ సిఫారసుపై నాకు బజాజ్ ట్రస్టు నుంచి పదిరూపాయల స్కాలర్‌షిప్ దామోదర దాసువల్ల దొరికింది. ఇతను నిజాం రాష్ట్రం నుంచి రాజకీయ ఆందోళన వలన బహిష్కరింపబడిన గాంధేయ కార్యకర్త అనే విషయం గుర్తుంచుకోదగింది. గ్రామీణ విద్యాలయంలో చేరి ఈ పది రూపాయల సహాయంతో వార్ధాలో నిలదొక్కుకున్నాను.



# గ్రామీణ విద్యాలయం

## వార్థా

గ్రామీణ విద్యాలయంలో చేరిక



1934లో స్థాపించబడిన అఖిల భారత గ్రామోద్యోగ సంఘం కార్యదర్శి, గాంధీయ ఆర్థిక తత్వవేత్త జె.సి.కుమారప్ప ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న గ్రామీణ విద్యాలయంలో విద్యార్థిగా చేరాను.

జె.సి.కుమారప్పగారు భారతీయ ఆర్థిక తత్వపాఠాలు చెప్పేవారు. భాష చాలా మృదువుగా వుండేది. వాక్యాలు చిన్నచిన్నవిగా వుండేవి. అందువలన, ఇంగ్లీషులో చెప్పినా వాటిని తేలికగా అర్థం చేసుకోగలిగేవాళ్ళం.

గ్రామీణ విద్యాలయ శిక్షణ

వార్ధాలోని మగన్‌వాడి గ్రామీణ విద్యాలయంలో 1.7.40 గ్రామ పరిశ్రమల శిక్షణ ప్రారంభమైనది.

వారు ప్రతి అంశంలోను సర్వేకు ప్రాముఖ్యత నిచ్చేవారు. గ్రామ ప్రశ్నావళి (*village industries questionaire*) ని ఆయన తయారు చేశారు. ఈ సర్వే ప్రాధాన్యత దీనివల్ల తెలుస్తుంది.

వికేంద్రీకరణపై ఆయన రచనలు, ఉపన్యాసాలు మనసుకు హత్తుకుని పోయేటట్లు ఉండేవి. అందువలన, విద్యార్థులకు వికేంద్రీకరణ సిద్ధాంతంపై విశ్వాసం కలిగేది.

నిర్మాణాత్మక కార్యక్రమాలు - రాజకీయాలు

నిర్మాణ కార్యక్రమాలలో వున్నవారు రాజకీయ ఆందోళనలలోకి పోకూడదని ఆయన విశ్వసించేవారు. ఇది నాకు నచ్చేది కాదు. నిర్మాణాత్మక కార్యక్రమాలు, రాజకీయాలు వేరువేరు భాగాలు (*compartments*) గా చూడవలసిన అవసరం లేదని నా అభిమతము. ఈ వాదన ఆయనకు అంతగా నచ్చిందికాదు. ఆశయం ఒకటైనా ఈ రెండు కార్యక్రమాలు మేళవించరాదని ఆయన అభిప్రాయం.



కాంగ్రెసు వ్యక్తి సత్యాగ్రహ తీర్మానము - పండిత్‌జీ

ఇదిలా ఉండగా, 18.8.1940లో అఖిల భారత కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం వార్ధాలో జరిగింది. ఈ సమావేశానికి జవహర్‌లాల్ నెహ్రూ, పట్టాభి, అజాద్, పంత్, రాజాజీ హాజరయ్యారు. పండిత్‌జీని గ్రామీణ విద్యాలయ విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగించవలసిందిగా కోరాను. వారు అందుకు అంగీకరించారు. దానికి తగు యేర్పాట్లు చేశాం.

మామూలుగా ప్రార్థనా సమావేశం విద్యాలయం హాలులో జరిగేది. గదులలోను, హాలులోను లాంతర్లు, కిరోసిన్ నూనె దీపాలే ఉండేవి. పండిత్‌జీ రాక సందర్భంగా విద్యుద్దీపాలు ఏర్పాటు చేయబడ్డాయి. విద్యుత్ దీపాలు ఎప్పుడు ఆరిపోతాయో ననే భయంతో ప్రార్థనా హాలులో ప్రతి దూలానికి మూడు, నాలుగు లాంతర్లు తగిలించి వాటిని కొద్దిగా వెలిగించి ఉంచాము.

సాయంత్రమయింది. నేనూ, హుషంగదాబాద్ ప్రతాప్ నారాయణ్ ద్యూబే, పంజాబ్ హైదరాలీ, మద్రాసు వాసంతి పండిత్‌జీని ఆహ్వానించి విద్యాలయానికి తీసుకువచ్చాం. విద్యార్థుల సమూహమును చూచి నెహ్రూ చాలా ఆనందపడ్డారు.

విద్యుత్ కాంతిలో పండిత్‌జీ తన సహజ ఉత్సాహము, ఉల్లాసంగా చిరునవ్వుతో వేదికను అలంకరించారు. జె.సి.కుమారప్ప సమావేశానికి అధ్యక్షపదవి నలంకరించారు.

పండిత్‌జీ ఉపన్యాసంలో, ''అంతర్జాతీయంగా మన దేశం పేరు ప్రఖ్యాతులు గాంచి ఒక ఉన్నతస్థాయికి చేరాలి, అప్పుడే మనం ప్రపంచశాంతిని నెలకొల్పుటలో సముచిత పాత్ర వహించ గలుగుతాం. ఈ స్థానాన్ని మనం పొందాలంటే అన్ని రంగాలలో ముఖ్యంగా పారిశ్రామిక రంగంలో తగు శ్రద్ధ వహించి, అందుకు తగిన వాతావరణం కొరకు కృషి చేయాలి. ఎల్లకాలం ఈ లాంతర్లపై ఆధారపడలేము. దేశం ముందుకు పోతున్నది'' అని అన్నారు.

**J.C's "My Free India"**

ఇంతలో విద్యుత్ దీపాలు ఆరిపోయాయి. జె.సి. కుమారప్పగారు నూనె దీపాలను పెద్దవి చేయమన్నారు. వెంటనే, 'ఇది నా స్వతంత్ర భారతదేశం' *"My Free India"* అని అన్నారు. పండిత్‌జీ కొంత చిన్నబుచ్చుకున్నట్లనిపించింది.

**Nehru's "My Future India"**

మరికొంత సేపట్లో విద్యుత్ దీపాలు వెలిగాయి. పండిత్‌జీ పెద్ద పెట్టున నవ్వి 'ఇది భావి భారతం' *"My Future India"* అన్నారు.

ఆ రోజుతో పండిత్‌జీకి వీడ్కోలు చెప్పాం. విద్యార్థుల్లో మాత్రం యంత్ర పరిశ్రమలా? కుటీర పరిశ్రమలా? కేంద్రీకరణా? వికేంద్రీకరణా? అనే అంశాలపై మీమాంస తీవ్రంగా బయలు దేరింది. చర్చోపచర్చలు జరుగసాగాయి.

**మీమాంసకు పరిష్కార మార్గం**

ఈ మీమాంస నాలో కూడా అనేక ఆలోచనలను రేకెత్తించింది. అందువలన, ఏ విధంగానైనా గాంధీగారి వద్దకు చేరాలనే కోరిక మరింత అధికమైంది.

మామూలుగా ఇలాంటి ఘట్టాలే ఒక్కొక్కప్పుడు గొప్పగొప్ప చర్చలకు, నిర్ణయాలకు దారితీస్తాయి. అనేక ఉద్యమాలకు వెలుగుబాటగా భాసిస్తాయి.

★★★

నిర్మాణాత్మక కార్యక్రమాలు - రాజకీయాలు

నిర్మాణ కార్యక్రమాలలో వున్నవారు రాజకీయ ఆందోళనలలోకి పోకూడదని ఆయన విశ్వసించేవారు. ఇది నాకు నచ్చేది కాదు. నిర్మాణాత్మక కార్యక్రమాలు, రాజకీయాలు వేరువేరు భాగాలు (*compartments*) గా చూడవలసిన అవసరం లేదని నా అభిమతము. ఈ వాదన ఆయనకు అంతగా నచ్చిందికాదు. ఆశయం ఒకటైనా ఈ రెండు కార్యక్రమాలు మేళవించరాదని ఆయన అభిప్రాయం.



ఇదిలా ఉండగా, 18.8.1940లో అఖిల భారత కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం వార్ధాలో జరిగింది. ఈ సమావేశానికి జవహర్‌లాల్ నెహ్రూ, పట్టాభి, అజాద్, పంత్, రాజాజీ హాజరయ్యారు. పండిత్‌జీని గ్రామీణ విద్యాలయ విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగించవలసిందిగా కోరాను. వారు అందుకు అంగీకరించారు. దానికి తగు యేర్పాట్లు చేశాం.

కాంగ్రెసు వ్యక్తి సత్యాగ్రహ తీర్మానము - పండిత్‌జీ

మామూలుగా ప్రార్థనా సమావేశం విద్యాలయం హాలులో జరిగేది. గదులలోను, హాలులోను లాంతర్లు, కిరోసిన్ నూనె దీపాలే ఉండేవి. పండిత్‌జీ రాక సందర్భంగా విద్యుద్దీపాలు ఏర్పాటు చేయబడ్డాయి. విద్యుత్ దీపాలు ఎప్పుడు ఆరిపోతాయో ననే భయంతో ప్రార్థనా హాలులో ప్రతి దూలానికి మూడు, నాలుగు లాంతర్లు తగిలించి వాటిని కొద్దిగా వెలిగించి ఉంచాము.

సాయంత్రమయింది. నేనూ, హుషంగదాబాద్ ప్రతాప్ నారాయణ్ ద్వ్యాబే, పంజాబ్ హైదరాలీ, మద్రాసు వాసంతి పండిత్‌జీని ఆహ్వానించి విద్యాలయానికి తీసుకువచ్చాం. విద్యార్థుల సమూహమును చూచి నెహ్రూ చాలా ఆనందపడ్డారు.

విద్యుత్ కాంతిలో పండిత్‌జీ తన సహజ ఉత్సాహము, ఉల్లాసంగా చిరునవ్వుతో వేదికను అలంకరించారు. జె.సి.కుమారప్ప సమావేశానికి అధ్యక్షపదవి నలంకరించారు.

## సృష్టి విధానము

ప్రకృతిలో 'పని' (కృషి) అనేక అంశాలతో సాగించే ప్రయత్నాలతో కూడి ఉంటుంది. జీవిత వర్తులాన్ని పూర్తి చేయటానికి సెంటిమెంట్, సెంటిమెంట్‌తో అది సహకరిస్తుంది. ఈ జీవిత వర్తులం తెలిసికాని, తెలియకకాని, ఉద్దేశపూర్వకంగా కానీ, లేకగానీ, ఏ కాలంలోనైనా, ఏ దశలోనైనా మధ్యలో ఆగిపోతే లేదా తెగిపోతే, అటువంటి విచ్ఛిత్తి తీవ్రమైన ఫలితాలకు దారితీస్తుంది. అభివృద్ధికి మార్గంలో అటువంటి సంక్షోభ, కలిగితే, ప్రగతి ఆగిపోతుంది. చివరకు ధ్వంసం, చెత్త మిగులుతుంది. ప్రకృతి క్షమించేది కాదు, పైపెచ్చు నిర్దయా స్వభావం కలది. కాబట్టి మనం జీవితవర్తులాన్ని తగ్గించాలని యత్నించకుండా, సంక్షోభం కలగని పద్ధతిలో శాశ్వతత్వాన్ని రక్షింపదలచుకుంటే, స్వీయ ప్రయోజనం, స్వీయ సంరక్షణం అనేవి సంక్షోభాన్ని కలిగించని సహకార భావంతో ప్రకృతి సహజ ధర్మాలకు జరిగి వ్యవహరించవలసి ఉంటుంది.

## జీవన ప్రమాణం మరియు వ్యక్తిత్వ వికాసం

'జీవన ప్రమాణ'మని ప్రజలు మాట్లాడే టప్పుడు వారే భావంతో అంటున్నారో అర్థం చేసుకోవడం కూడా చాల కష్టం. ఆమాట ఎంత అర్థమైనట్లు అనిపిస్తుందో అంత అస్పష్టంగా ఉంటుంది. కాబట్టి, ఈ మాటలకు నిర్దిష్టమైన అర్థమిది అని తేల్చి చెప్పకుండా ఇష్టమొచ్చిన అర్థంలో వాడేయటం సులభంగా జరుగుతుంది. అలా వాడే ప్రతి మనిషి కూడా జీవన ప్రమాణాన్ని గురించీ, దాని స్వరూప స్వభావాలను గురించీ అతనికి తగిన ప్రత్యేక భావాలు కలిగి ఉండవచ్చు. ఒకరికి ఒక రేడియో సెట్, ఒక మోటారుకారు ఉండడం జీవన ప్రమాణంలో అత్యంత ప్రాథమిక ప్రమాణం కావచ్చు. మరొకరికి రెండు పూట్లా తిండిగడవటమే ఒక విశేషభోగంగా అనిపించవచ్చు. కాబట్టి, మన దేశ పరిస్థితులను బట్టి జీవన ప్రమాణాన్ని గురించి ఒక నిష్పాక్షికమైన అంచెగాను, అవసరం కలిగినప్పుడు తయారు చేయవచ్చు. అయితే, ఆ విధంగా అంచనా వేసే జీవన ప్రమాణానికి ఆర్థిక ప్రాతిపదికలుగాని, సాంస్కృతిక సంప్రదాయాలుగాని, సాంఘిక అవసరాలుగాని ప్రాతిపదికలు కావచ్చు. ఉన్నత ప్రమాణాలు, తక్కువ ప్రమాణాలు - అంటే అర్థం ఏమిటి? ఉన్నత ప్రమాణమంటే భౌతికంగా కోరే అవసరాలలో చాలావాటికి నిండైన సంతృప్తి కలగటం, తక్కువ ప్రమాణమంటే ప్రాపంచిక వస్తువుల వలన పరిమితమైన సంతృప్తి మాత్రమే పొందడం.

- Essential Kumarappa - Page - 3 & 7

# భారతీయ ఆర్థిక శాస్త్రంలోని పాఠ్య ప్రణాళిక
## రాజాజీకి కుమారప్ప లేఖ

ప్రపంచ ఆర్థిక శాస్త్ర అంశములకు చెందిన పాఠ్య ప్రణాళికకు, భారతీయ ఆర్థిక శాస్త్ర పాఠ్య ప్రణాళికకు ఎంతైనా వ్యత్యాసముంది. ప్రతి దేశ ఆర్థిక విధానం కొద్దో గొప్పో ఇతర దేశ ఆర్థిక విధానానికి భిన్నంగా ఉంటుందని అనుభవమే తెలుపుచున్నది.

**భారతీయ నాగరికత గ్రామీణ పరిస్థితులపై, వాటి అభివృద్ధిపై ఆధారపడి ఉంది.** దాని దృష్ట్యా ఆర్థిక రంగంలో పాఠ్య ప్రణాళిక ఈ క్రింది విధంగా వుండాలి :

### మొదటి పాఠము

ఉపాధ్యాయులు విద్యార్థులతో గ్రామాలకు వెళ్లి, గ్రామార్థిక పరిస్థితులకు సంబంధించిన వివరములను విద్యార్థులు సేకరించునట్లు చేయాలి. ఈ విధముగా ఎకనామిక్స్‌లో ప్రాక్టికల్ లెసన్స్ అనుభవ పాఠములు వారికి నేర్పాలి. ఈ సందర్భంలో ఆ గ్రామ జనాభా, స్త్రీ పురుషుల, బాలబాలికల సంఖ్య, వివిధ వృత్తులలో భృతి సంపాదించుకొనువారి సంఖ్య, వారి ఆదాయ వివరములు సేకరించాలి. అలాగే గ్రామ విస్తీర్ణత కొలిచి, ప్రతి వ్యక్తికి సగటున ఎంత భూమి వున్నది, ఏ పంటలు పండుచున్నవి, ఎరువులు ఏ విధంగా వాడుచున్నారు, వ్యవసాయ పనిముట్లు, వాటి ఉపయోగించు పద్ధతి, పంటలపై గత పది సంవత్సరములలో వారికి వచ్చిన లాభనష్టములు, పెట్టుబడి సగటున లెక్కవేసి, వ్యవసాయము లాభకరమా లేదా అనునది తేల్చాలి. అలాగే పశుసంపద, వాటిపై అయ్యే ఖర్చు, పాల ఉత్పత్తి, ఖర్చు వివరములు, ఎద్దులు, దూడలు, కోడెలు, వాటి వినియోగము, పశువులకు సరిపోవు

పోస్టర్ హ్యాండ్, వివరములు, పశువుల మేపుటకు తగు విస్తీర్ణము గల భూమి, స్వేచ్ఛగా గాలి పీల్చు ఖాళీ స్థలాల వివరములు, వ్యవసాయదారులు, వారి ఆదాయ వ్యయ ఖర్చుల లెక్కలు, వాటిని తనిఖీ చేయడం జరుగుతున్నది, లేనిది, వారికి గల తీరిక సమయమెంత, దాన్ని వారు ఏ విధముగా వెచ్చించుచున్నది విద్యార్థులు వివరములు సేకరించి, గ్రామీణాభివృద్ధికై వారి సూచనలను రూపొందించవలెను. రిపోర్టులు స్పష్టముగా, సిరాతో సరైన దస్తూరీతో వుండాలి.

## రెండవ పాఠము

పై విధముగా సమీకరింపబడిన వివరాలన్నీ క్రోడీకరించి, యితర వ్యవసాయ దేశాల ఆర్థిక సమస్యల డేటాతో పోల్చి చూడాలి. విశ్లేషణ చేయాలి. అప్పుడు మన దేశ ఆర్థిక విధానంలో అవసరమగు మార్పులు చేయాలి. ఈ విధమైన శిక్షణతోనే విద్యార్థులు మన దేశపు ఆర్థిక విషయాలు (ఎకనమిక్స్‌ను) అర్థం చేసుకోగలుగుతారు. ఈ విధమైన ప్రయత్నం ప్రతి విద్యార్థి చేసినచో ఎవరికీ నష్టం లేదు. పైగా యత్నం, పరిశోధన నూతన నిర్ణయాలకు, తద్వారా దేశాభ్యుదయానికి దారి తీసి, సర్వాంగీకారము పొందిన సిద్ధాంతాలను ధృవీకరించినట్లవుతుంది.

ఈ సందర్భములో లోగడ ఈ పరిశోధనలకు గురైన గ్రామాలకు వెళ్ల వలసిన అవసరం లేదు.

గాంధీ నవజీవన్ - 17.10.29.

సి. రాజగోపాలాచారికి వ్రాసిన లేఖ - 18.10.29

# కేంద్రాధికారం గ్రామాలకు పంపిణీ

కేంద్రీకరణను ఒక వ్యవస్థగా చూసినపుడు అది శాంతియుత వ్యవస్థ విధానంతో పొసగదు.

(హరిజన్, 18-1-42. పే -5.)

కేంద్రాధికారమంతా నేడు మహానగరాలైన ఢిల్లీ, కలకత్తా, బొంబాయిలో కేంద్రీకరించబడి ఉంది. ఈ అధికారాన్ని 7 లక్షల గ్రామాలకు పంపిణీ గావించాలని నా కోరిక.

(మహాత్మాగాంధీ - 4వ సంపుటి 1958 - పే. 614.)

అసంఖ్యాకమైన గ్రామాలను కలిగి ఉన్న ఈ వ్యవస్థలో సమూహాలు ఎల్లప్పుడూ విస్తృతమవుతాయే తప్ప ఊర్ధ్వ ముఖంగా పయనించవు. జీవితం కొనభాగపు పునాదిపై నిలబెట్టిన పిరమిడ్ వంటిదికాదు. గ్రామం కోసం సర్వం త్యాగం చేయడానికి సిద్ధపడ్డ వ్యక్తి కేంద్రంగా వున్న ఒక మహా సమూహమే జీవితం. తాము భాగస్వాములుగా వున్న ఆ మహా సమూహంలో గంభీరత్వాన్ని పంచుకుంటూ, ఎపుడూ దురుసుగా గాకుండా నమ్రతతో ప్రవర్తిస్తూ ఒకే జీవితంగా మార్పుచెందే దిశవైపుగా గ్రామాల సమూహము ఏర్పడడానికి ఆ గ్రామం సర్వం త్యాగం చేయడానికి సిద్ధపడాలి.

(1. మహాత్మాగాంధీ రచనలు - సంపుటి 5, పే - 295.)

# నెహ్రూ ఆర్థిక విధానం

భారతదేశ మంతటా సోషలిస్టు ఆర్థిక విధానము వుండవలనని నా కోరిక. కొద్దిపాటి కూర్పులు, మార్పులు, సర్దుబాట్లతో సోవియట్ రాజ్యాంగ వ్యవస్థ మనకు తగునని నేను భావిస్తాను. ఇలా అనడంలో రష్యాలోని పద్ధతులు, విధానముల నన్నింటిని పూర్తిగా వర్తింపచేయాలని నా ఉద్దేశ్యము కాదు. సోవియట్ విధానమును చాలా వరకు సరియైన ప్రజా స్వామ్యములో యిముడునట్లు చేయగలము. కాని, భారత దేశంలో సోషలిజము రాబోయే కొద్దిపాటి కాలంలో అమలుచేయ యత్నిస్తే భయంకరమైన విబేధాలకు, చెడు పరిణామాల (కాన్ఫ్లిక్ట్స్ అండ్ డిస్ట్రక్షన్స్) కు దారితీస్తుందని నా నమ్మకము.

—జవహర్ లాల్ నెహ్రూ

# చిత్రిజీ - గ్రామీణ విద్యాలయ పర్యవేక్షకుడు

గాంధేయ సూత్రాలను అంటిపెట్టుకొనివున్న సంస్థలన్నింటిలో అస్వాదవృత్తి అవలంబించడం పరిపాటి. దీనిని అవలంబించేవారు. ఉప్పు, కారం, మసాలా లేని ఆహారము తీసుకొనుట తప్పనిసరి. గ్రామీణ విద్యాలయంలో కూడా ఈ అస్వాదవృత్తి అమలు చేయాలని విద్యాలయం సూపరింటెండెంట్ చిత్రిజీ యత్నించారు. అసలు ఆ వస్తువులే కొనకూడదని, గ్రామీణ విద్యాలయ ఆవరణలోకి అటువంటివి రాకూడదని శాసించారు.

నేనప్పుడు రసోయి (వంటశాల) ఇన్‌చార్జిగా వున్నాను. ధనియాలు. జీలకర్ర, మెంతులు మసాలా క్రిందికి రావని వాదించాను. పైగా వాటిని తిరగమాత (పోపు)లో వాడటం మొదలుపెట్టాను. ఇది క్రమశిక్షణకు భంగమని, ఇంతవరకు ఎప్పుడూ యిచట ఇలా జరగలేదని ఆయన వాదించడం జరిగింది. చివరకు ఈ విషయం బాపూ వద్ద తేల్చుకుందామని అనుకొన్నాము. ఆయన దీనికి అంగీకరించారు.

నావరకు నేను మసాలా సమస్యకన్నా, బాపూ దరిచేరడానికి ఇదొక దారని భావించాను.

ఒకరోజు ఉదయం చిత్రిజీ, మేము తెల్లవారు ఝామున లేచి బాపూ వద్దకు వెళ్ళాము. బాపూజీతో చిత్రిజీ మసాలా విషయం ప్రస్తావించారు. బాపూతో ధనియాలు, జీలకర్ర మసాలా క్రిందకు రావుకదా అన్నాను. మసాలా పద నిర్వచనం బాపూజీ చేసారు. అది విన్న మీదట ఒకవేళ మీరు మసాలా క్రిందకు వస్తాయని భావిస్తే మేమంతా రెండు, మూడు నెలలలో ఈ అలవాటును మార్చుకుంటామని చెప్పాను. బాపూ నవ్వి వూరుకున్నారు. చిత్రిజీ, మేము తిరిగి విద్యాలయానికి చేరుకున్నాము. బాపూ కిచ్చిన వాగ్దానం ప్రకారం ఈ వస్తువులు వాడడం క్రమేణా మానివేశాము. ఇది బాపూజీతో మాకు జరిగిన మొదటి సన్నివేశము.

అంతేగాక జీలకర్ర, మెంతులు, ధనియాలు మానివేసిన మీదట మరొకసారి తిరిగి బాపూని చిత్రిజీ ఆధ్వర్యంలో కలిసాము. ఈ విషయం విన్న బాపూ, చిత్రిజీతో 'నీకింకేం కావాలి' అని అడుగుతూ మరోనవ్వు నవ్వారు. ఆయన ఆశీస్సులతో తిరిగి విద్యాలయానికి చేరాము.



# పౌనారు - వినోబా

## పౌనారుకు ప్రయాణం :

పౌనారులో పూజ్య వినోబా ఆశ్రమం ఉంది. నాకు అదృష్టం కలిసి వచ్చింది. ఒకరోజు నాకు గ్రామీణ విద్యాలయంలో కాగితపు పరిశ్రమలో శిక్షణ యిచ్చే క్రిష్ణమూర్తిగారు కనిపించి 'నేను వినోబాజీ ఉన్న పౌనారు గ్రామానికి పోతున్నాను, నువ్వు నాతో వస్తావా?' అని అడిగారు. సరే వస్తానన్నాను. ఇద్దరం కలసి సేవాగ్రాంలో డైరీఫారమ్ మేనేజరుగా ఉన్న పార్నీకరుజీ యింటికి వెళ్లాం. ఆయన సాదరంగా మమ్మల్ని ఆహ్వానించి పాలు యిచ్చారు. అవి తాగి ముగ్గురం పౌనారు బయలుదేరాము. పౌనారు నది ఒడ్డున కూర్చొని జొన్న రొట్టెలు తిన్నాము.

## పార్నీకరు - గోసేవ :



పార్నీకరుజీ తాను ఆశ్రమంలో గోసేవకై చేసిన కృషి అంతా చెప్పసాగారు. ఒక దశలో, నిరుత్సాహంగా గోసేవకై నేనెంత చేసినా, చేయదలచుకున్నా, నేర్చుకొనే విద్యార్థులు ఎవరూ రావడం లేదన్నారు. ఆ మాట వినగానే నాకు నేర్పుతానంటే నేను సిద్ధంగా ఉన్నానని అన్నాను. ఆయన సరేనన్నారు.

కృష్ణమూర్తిగారు అదను చూసి, మరి అతనిని ఎప్పుడు రమ్మంటావు అని అడిగారు. అతని యిష్టం అన్నారు పార్నీకర్‌జీ. నేను వెంటనే రేపు తిథి మంచిది. తారాబలం కూడా బాగుంది నేను రేపే వస్తాను అని అన్నాను. పార్నీకర్‌జీ సరే అని అన్నారు.

నేను ఈ సందర్భంలో పంచాంగం చూడలేదు. తిథుల మంచి, చెడు, తారాబలాల సంగతి నాకు తెలియదు. అవకాశం జారవిడుచుకోకూడదు అనే నా అభిలాష, వారు మనసు మార్చుకుంటారేమో అనే భయం, తిథి వార నక్షత్రాలన్నీ బాగున్నాయని చెప్పుటకు ప్రేరేపించింది. ''అవకాశం వదులుకోవద్దు'' అని పెద్దలు చెప్పిన మాట నాకు పదేపదే జ్ఞప్తికి వచ్చింది.

**వార్ధాకు తిరిగిరాక :**

ఆ తర్వాత, నేను, కృష్ణమూర్తిగారు, సేవాగ్రాంలో పార్నీకర్‌జీ వద్ద సెలవు తీసుకొని వార్ధా చేరాము. వస్తూ, వస్తూ, సేవాగ్రాం ఆశ్రమవాసిగా ఉన్న ప్రభాకర్‌జీకి, పార్నీకర్‌జీతో జరిగిన సంభాషణను వివరించాను. ఆయన సంతోషించారు. ఎంత తొందరగా వీలుంటే అంత తొందరగా రమ్మని ప్రభాకర్ జీ అన్నారు. సరే అన్నాను. కృష్ణమూర్తిగారి దయవల్ల అవకాశం వచ్చింది అన్నాను. ఆయన వారిని అభినందించారు. మురిసిపోయారు. నాకు కలిగిన ఈ అవకాశమే, నన్ను గాంధేయవాది అని యితరులకు పిలిచే అవకాశం యిచ్చింది.

**సంధిగ్ధావస్థ - కుమారప్ప :**

నా గ్రామ పరిశ్రమల కోర్సు ఆరు నెలలది. అయిదు నెలల శిక్షణ పూర్తి అయింది. ఇంకొక నెలవుంటే గాని సర్టిఫికెటు రాదు. దానికోసం ఆగితే పార్నీకర్‌జీకు యిచ్చిన మాట అబద్ధమవుతుంది. జె.సి. కుమారప్పగారిని అనుమతి అడిగి వెళ్లదామంటే, అది జరిగే పనికాదని పలువురు చెప్పినా సేవాగ్రాం బయలుదేరాను.

**వీడ్కోలు విందు - బాధాకర దృశ్యం :**

ఎంత సంతోషంగా నేను సేవాగ్రాం పోతున్నానని అనుకొన్నానో, ఆ సాయంత్రం అంత బాధ పడాల్సిన దృశ్యం చూడాల్సి వచ్చింది. నాతో ఉన్న విద్యార్థి మిత్రులు ఫతేసింగు హోటల్లో వీడ్కోలు విందు ఏర్పాటు చేశారు. ఈ హోటలు విద్యాలయాన్ని ఆనుకొని వుంది. ఫతేసింగు నావలన చాలా లాభపడ్డాడు. నన్ను అతనిగా చూసుకొనే దశ వచ్చినది. వీడ్కోలు విందులో హుషంగబాదు ప్రతాపనారాయణ డూబే, మద్రాసు వాసంతి, పంజాబు హైదరలీ నన్ను విడువలేక వెక్కి వెక్కి ఏడ్వసాగారు. ఓదార్చడం కష్టమయింది. పరాయి రాష్ట్రాల నుంచి వచ్చిన వాళ్ళం వివిధ కులాల వాళ్లం అయినా, ఏక ఆశయం,ఒకరిపై ఒకరు సమిష్టి కార్యక్రమాలలో ఆధారపడి ఉండడం మా ఐక్యతకు కారణమయింది. మనసులు పెనవేసుకొనేటట్లు చేసాయి. సేవాగ్రామానికి పోవాలనే నా స్వార్థపూరిత ఆశయం విధి మమ్ములను విడతీసింది.



# సేవాగ్రాం - గాంధీజీ

సేవాగ్రాం ప్రయాణం :

ఆ రోజు తెల్లవారు ఝామున పక్క చుట్ట తీసుకొని, పెట్టె నెత్తిమీద పెట్టుకొని సేవాగ్రాం ఆశ్రమానికి బయలుదేరాను. చలి బాధ ఎక్కువగా ఉండి, వణుకు పుడుతున్నది. కప్పుకునేందుకు నావద్ద శాలువగాని, గొంగడిగాని లేదు. అయినా, ఆశయసిద్ధికై ఈ బాధ ఓర్చుకోక తప్పదు అనుకొంటూ పార్నీకరు ఇంటికి చేరాను.

ఆశ్రమంలో చేరిక : పార్నీకర్ తల్లిగారు పండు ముదుసలి నన్ను చూసింది.



లోపలికి రమ్మంది. పెట్టె, ప్రక్కచుట్టను ఒక ప్రక్కగా పెట్టమంది. వేడి పాలు యిచ్చింది. 'మాజీ' అన్నాను. 'నీవు ఎంతవరకు చదువుకున్నావు' అన్నది. 'బి.ఎస్.సి.' అని అన్నాను. 'ఇంత చదివి, ఇంత కష్టమెందుకు ? ఉద్యోగం చేసుకోక' అంది. 'సేవాగ్రాం ఆశ్రమంలో చేరడం నేను అదృష్టంగా భావిస్తున్నాను. ఉద్యోగంతో పాటు గాంధీజీ సిద్ధాంతాల అధ్యయనానికి తావిస్తుంది' అన్నాను. కాని నా జవాబు ఆవిడకు కావలసిని తృప్తిని యిచ్చినట్లు లేదు.

మాతృ హృదయం :

పార్నీకర్‌జీ ఆశ్రమవాసి. తల్లి వారివద్దే ఉంటున్నది. పార్నీకర్‌జీకు భార్యలేదు. ఆవిడ కొడుకును చూసుకుంటూ, వండిపెడుతూ, అతని యోగక్షేమాలు చూస్తూ కాలం గడుపుతోంది. ఆ పండు ముదుసలికి ఆశ్రమంలో ఉన్నా, పిల్లల పట్ల ప్రేమ, పిల్లలు కష్టపడకూడదనే దృష్టి పోలేదు. ఒక ఆశయంపై స్థిరైన ఆసక్తి, అవగాహనయత్నం లేకపోతే ఏ ఆశ్రమంలో వున్నా, మనం మనంగానే ఉండిపోతామనిపించింది.

* * *

పాదాభివందనం :

ఈ సంభాషణ జరిగే లోగా పార్నీకర్‌జీ ఉదయం వ్యాహ్యాలికి పోయి రానే వచ్చారు. 'రాజా వచ్చావా' అని యొక నిట్టూర్పు విడిచాడు. పార్నీకరు రాకతో తల్లి పొందిన ఆనందం, ఈయన నిట్టూర్పు నాకు అర్థం కాలేదు. ఇది నన్ను అయోమయావస్థలో పడేసింది. పార్నీకరుకు పాదాభివందనం చేయబోయాను. ఆయన పాదాలు వెనుకకు తీసుకొని 'లే' అన్నారు. ఆమాట నేను ఆశీర్వచనమని భావించాను.

కుమారప్ప అభ్యంతరం - సందిగ్ధావస్థ :

పార్నీకర్‌జీ 'ఊ' అంటూ మరో నిట్టూర్పు విడిచి, నిన్ను ఆశ్రమంలో చేర్చుకొని నా శిష్యుడుగా చేసుకుందామనుకున్నాను. కాని, జె.సి. కుమారప్ప, ''you are a fire to the institution'', ''నీవు సంస్థకు నిప్పువంటి వాడి'' వని నన్ను హెచ్చరించారు. పెద్దవాళ్ళను అర్థం చేసుకోవాలి. చేర్చుకోవద్దని ఆయన చెప్పలేదు - నాకేమీ తోచడంలేదన్నారు. నేను, పార్నీకర్‌జీ యిరుకులో పడ్డాము.

కుమ్మరి గుడిసె - శరణ్యం :

నా దృష్టి దగ్గరలో వున్న కుమ్మరి గుడిసెలపై పడింది. మీకు అభ్యంతరం లేకపోతే నేను ఆ కుమ్మరి గుడిసెలలో ఉంటానన్నాను. ఆయన తల ఊపారు. కాని, కుమ్మరివారు ఉండే అవకాశం యివ్వాలి కదా! అన్నాను. ఆయన తగు ఏర్పాటు చేస్తానన్నారు.

గోసేవా ప్రారంభం :

ఆ కుమ్మరితో పార్నీకర్ జీ ఏం మాట్లాడారో నాకు తెలియదు కాని, ఆనందంతో అతను నాకు స్వాగతం పలికాడు. ఎక్కడి కక్కడే సంతోషం. అందులోనే తృప్తి, శాంతి, సుఖం, ఆనందం నాకు ఉండింది.

అతని యింట జొన్న రొట్టెలు తింటూ పార్నీకర్‌జీ వద్ద గోసేవా విద్యాభ్యాసం ప్రారంభించాను. ఈ కుమ్మరి గుడిసె నివాసం, అతని జొన్న రొట్టె నా ఆశయసిద్ధికి మరొక మెట్టయింది. గ్రామ స్వరాజ్యంలో గోమాత ప్రాముఖ్యం, భారతీయ ఆర్థిక శాస్త్రంలోని పాఠ్య ప్రణాళికలతోపాటు పార్నీకర్‌జీ శిక్షణ నన్ను మరింత ఆకర్షించింది.

ఈ విధంగా వార్ధాలోని గ్రామీణ విద్యాలయం నుంచి నాలుగు, ఐదు మైళ్ల దూరంలో నున్న సేవాగ్రాం ప్రాంగణంలోకి అడుగుపెట్టాను.



# గోశాల - గోసేవ

పార్శీకరుజీ గోసేవా ప్రాముఖ్యతను గూర్చి పాఠాలు చెప్పసాగారు. భారతీయ సంస్కృతిలో గోవు కొక ప్రత్యేక స్థానముంది. అందుకే మనం గోవును 'గోమాత' అని పిలుస్తాము. గోమాత వల్ల పొందే లాభాలన్నియూ ఈ క్రింది చిత్రంలో చూడవచ్చు.




పార్శీకర్‌జీ మొట్టమొదటసారిగా గోప్రాముఖ్యతను సూచించేందుకే పై చిత్రాన్ని గీసి చూపారు. ఆ చిత్రంలో ఉన్న అంశాలన్నింటిపై తన అభిప్రాయాన్ని, విశ్వాసాన్ని ప్రకటించారు. క్లుప్తంగా చెప్పాలంటే, పిల్లలకు, పెద్దలకు అనేక విధములుగ ఉపయుక్తపడే జంతువని ఆతడు పదేపదే నొక్కి చెప్పేవారు. అందుకే గోవు మన యింటిలో అడుగుపెట్టగానే మన కుటుంబంలో ఒక భాగమవుతున్నది. పిల్లలకు, పెద్దలకు పాలు, పొలాలకు ఎరువు, నాగలికి కోడె దూడలు, ఎడ్లు తదితర లాభాలను దాదాపు పదిహేను సంవత్సరాలు యిస్తుంది. ఈ లాభాలన్నీ మనం ధనం రూపంలోను, తదితర విధంగాను అనుభవిస్తాము. ఇలా ఎన్నో విషయాలు పార్శీకర్‌జీ చెప్పుతూ పోయేవారు.

ప్రొద్దున, మధ్యాహ్నం పాటలతో పాటు సాయంత్రం, సంధ్యా సమయాన ఆవులు, దూడెలు యింటికి వస్తున్నప్పుడు ఎంతెంత ఆనందాన్ని అనుభవించే వాళ్ళమో చెప్పలేము. ఈ గో సముదాయాంతో పాటు తోటి హరిజన మిత్రుడు ఆత్మారాం చిన్న కర్రతో ఈలలు కొట్టుతూ, పాడుతూ ఆశ్రమానికి వస్తూంటే నాకు గలిగే సంతోషం, ఆనందం చెప్పనలవిగాదు.

ఈ దృశ్యాన్ని కవులు, తత్వవేత్తలు అనేక విధాలుగా పద్యాలు, గేయాలు వ్రాశారు. పైగంబర మహమ్మదు కూడా, 'గోవులు, లేగలు ప్రేమ కోసం అడవి నుండి తిరిగి నీ యింటికి వస్తాయని' చెప్పిన మాటలో ఎంత సత్యమున్నదనిపిస్తుంది. అట్టి గోసంతతిని పశుసంరక్షణ ప్రాముఖ్యతను గుర్తించి, వీటిని గౌరవించి, సేవ చేయు ఉద్దేశ్యంతో అఖిల భారత గోసేవా సంఘాన్ని 1920లో స్థాపించారు. ఈ సంస్థకు యొక నియమావళిని తయారు చేసారు. అట్టి సంఘంతో పార్నీకర్‌జీకి సంబంధమున్నది. గోసేవా సంఘం అడుగుజాడలలో ఆశ్రమంలోని గోశాల నిర్వహించబడసాగింది. క్రమేణా పార్నీకర్‌జీ ఈ డైరీ ఫారముకు మేనేజరుగా, నేను అసిస్టెంటు మేనేజరుగా వ్యవహరించాను. పాల అమ్మకం నాతో నిర్వహించబడింది. రాజేంద్ర ప్రసాదు చేసిన విద్యావిధానం, అధిపతి ఆర్య నాయకం, గాంధీజీని సుశీలా నాయరు, జమునా లాల్ బజాజ్, అతని సతీమణి జానకి బహెన్, యిలాంటి పెద్దలంతా పాల కేంద్రం ద్వారా నాకు పరిచయమయ్యారు. ఇది కూడా నా ఆశయానికి కొంత చేయూత నిచ్చింది.



## అఖిల భారత గోసేవా సంఘం

గోరక్షక మహాసభ బెల్గాంలో 28 డిసెంబరు 1924 లో జరిగింది. శాశ్వతంగా వుండు ఒక కమిటీని గోరక్షణకై ఏర్పరచాలని అందరూ తీర్మానించారు. దీని నియమావళి 28 ఏప్రియల్ 1925లో బొంబాయిలోని మాధవ బాగ్‌లో తయారయి అంగీకరించబడింది.

పరిశోధన

# 'వెన్న నుంచి ఎక్కువ నెయ్యి'

భారతదేశములోని వ్యవసాయము, పశుసంపద, గోమాత ఆరాధనలోను పెంపుదలలోను యున్నది. నూటికి ఎనుబది మంది వ్యవసాయము చేయువారున్న ఈ దేశములో గోవుల పెంపుదల- పోషణ ఆవశ్యకత గూర్చి వేరే చెప్పనక్కర లేదు.

ఈ ప్రత్యేకతను బట్టి అఖిల భారత గోసేవా సంఘము ఏర్పడినది. ఈ సంఘ కార్యక్రమమున గాంధీజీ యొక నిర్మాణ కార్యక్రమంగా ఎంపిక చేయబడింది.

సేవాగ్రాం ఆశ్రమంలో గోశాల ఏర్పాటు చేయబడింది. పార్నేకర్‌జీ దీనికి మేనేజరుగా నియమించబడ్డారు. నెను పార్నేకర్జీ యాజమాన్యంలో అసిస్టెంట్ మేనేజరుగా పని చేశాను.



తెల్లవారు ఝామున లేచి చల్ల (మజ్జిగ) నుంచి వెన్న తీయడం, పాలు, వెన్న, నేయి అమ్మటంతో నా కర్తవ్యంలో ఒక భాగము అయినది.

అలాగే వెన్న నుంచి ఎక్కువ నేయి తీసే పరిశోధన చేయడం జరిగింది. నాకు హరిజన సోదరుడు ఆత్మారాం సాయం చేసేవాడు. ఈ పరిశోధనలో నేను కృతకృత్యుడనయ్యాను

ఈ పరిశోధనా ఫలితాలు 'రూరల్ ఇండియా'లోను, స్థానిక 'దక్కన్ క్రానికల్'లో ప్రచురించబడ్డాయి.

అఖిల భారతదేశంలో ఈ ఫలితాలు ప్రచారం అగుటయేగాక, ఈ పద్ధతి ఆచరణలోకి వచ్చింది.

పరిశోధనా ఫలితాలు ఈ క్రింది విధంగా ప్రకటించ బడినవి.

వార్ధా (సేవాగ్రాం) మార్చి 6, 1941

సేవాగ్రాంలో గోశాల గలదు. ఇది గాంధీజీ యాశ్రమముతోనే స్థాపింపబడెను. గోశాల స్థాపనకు మూడు కారణములు గలవు. ఒకటి - ఆశ్రమవాసులకు పాలు, వెన్నను సప్లయి చేయుట, రెండవది - పాలలో నుండి వెన్న చేయుటలో నూతన పరిశోధనలు చేయుట, మూడు - సేవాగ్రాం గ్రామములోని వ్యవసాయదారులకు ఉపవృత్తులను (subsidiary occupation) నేర్పుట.

## గోశాల

పశుపోషణ విషయములలో పరిశోధనలు చేయుటకును, మార్గదర్శకముగా యుండుటకును గోశాలను స్థాపించిరి. ఇది ఆశ్రమము ప్రక్కనే గలదు. ఇది వరలో ఇచ్చట పాల పరిశ్రమలో విద్యార్థులకు ట్రైనింగు నిచ్చెడివారు. ఈ మధ్య గోశాల అధ్యక్షులగు పార్నీకరు రాజలింగం గారిని వెన్నలో నుండి నెయ్యిని సులభముగా తయారు చేయుట గూర్చి పరిశోధనలు చేసి కొన్ని సులభ మార్గములను గనిపెట్టిరి.

## పరిశోధన వర్గములు

వెన్నను ఒక గిన్నెలో మరగబెట్టి సలసల కాగుచున్నప్పుడు దింపివేయవలెను. అనగా 60 డిగ్రీల వరకు కాగబెట్టి, దానిని మరొక పాత్రలోనికి పోసి, రాత్రియంతయు అట్లే ఆ పాత్ర వట్టిచోట యుంచవలెను. ఆ పాత్రకు అడుగున ఇదివరకే చిల్లిపొడిచి, ఒక పుల్ల పెట్టియుంచవలెను. ఉదయమున కన్నము కప్పిన పుల్లను లాగివేసిన నీరు మొదలగు మలిన పదార్థములు బయటకు చిల్లిగుండా వచ్చును. తరువాత నేతిని ఇంకొక పాత్రలో వేసి మరియొకసారి కాచిన సుభ్రమగు నేయి తయారగును.

## వివరములు సూచించు పట్టి

**మామూలు పద్ధతికి యగు ఖర్చు :**

| | | |
|---|---|---|
| స్టవ్‌కు ఖర్చు అగు కిరసనాయలు | - | 7 తులములు |
| మూడు పౌన్ల వెన్న నుంచి వచ్చు నెయ్యి | - | 2 పౌన్ల 10 తులములు. |
| కావలసిన కాల పరిమితి | - | 40 నిమిషములు. |

**సేవాగ్రాం నూతన పద్ధతికి అగు ఖర్చు :**

| | | |
|---|---|---|
| స్టవ్‌కు ఖర్చు అగు కిరసనాయలు | - | 4 తులములు |
| మూడు పౌన్ల వెన్న నుంచి వచ్చు నెయ్యి | - | 2 పౌన్ల 20 తులములు. |
| కావలసిన కాల పరిమితి | - | 29 నిమిషములు. |

దీనినిబట్టి గ్రహింపవలసిన విషయములు కొన్ని గలవు. వాటిలో ముఖ్యమైనది కిరసనాయలు. ఈ నూతన పద్ధతికి నాలుగు తులములు అనగా సగము మాత్రమే ఖర్చు అగును. పాత పద్ధతి ప్రకారము 75% నెయ్యి మాత్రము వచ్చును. నూతన పరిశోధనల ప్రకారము 83% నెయ్యి వచ్చుచున్నది. కాలపరిమితిని బట్టి చూచినను, నూతన పద్ధతి ప్రకారము 29 నిమిషములలో పని అంతయూ పూర్తియగును. ఈ పరిశోధన వలన గ్రామస్థులకు చాలా లాభము గలుగును. నేతిని వెన్ననుండి చౌకగా తీయుటకు అవకాశము గలదు. ఈ పరిశ్రమ గూర్చియు, పరిశోధనలను గూర్చియు త్వరలో వార్తా పత్రికలలో ప్రచురించెదరని తెలియుచున్నది. దీనికి ముఖ్య కారకులు వై.యం. పార్నీకరు గారును, వారి అసిస్టెంటు శ్రీ ఎం.రాజలింగంగారును అయి యున్నారు. శ్రీ రాజలింగంగారు నైజాము ఆంధ్రులు. నైజాము కళాశాలలో బి.ఎస్.సి. వరకు చదివి మగన్‌వాడి గ్రామోద్యగ సంఘంలో గ్రామ పరిశ్రమలలో తర్ఫీదుపొంది ఇపుడు సేవాగ్రామములోని గోశాలలో పనిచేయుచున్నారు.

(పరిశోధనా వివరములు 13 ఏప్రిల్, 1941 "డెక్కన్ క్రానికల్"లో ప్రచురించబడినది.)

# ప్రార్థన రిజిస్టరు

ఆశ్రమంలోని ప్రార్థనలకు రోజూ హాజరయి, శాంతిదూత బాపూని కండ్లారా చూస్తూ, ఆనందించాను. ప్రార్థన అనుభూతిని కూడా తనివితీరా పొందగలిగాను.

**అఖిల భారత గోసేవా సంఘం :**



ప్రభాకర్‌జీ, లోచన్‌దాస్‌జీ గోసేవ విషయంలో పార్నీకర్‌జీతోపాటు ప్రత్యేక శ్రద్ధ చూపించేవారు. గోసేవ శాఖకు మేనేజరుగా పార్నీకర్‌జీ వెన్న నుంచి ఎక్కువ నెయ్యి పరిశోధనకై తీవ్రకృషి సల్పారు. దానికి నేను గోశాల అసిస్టెంట్ మేనేజరుగా వారికి నేను తోడ్పడ్డాను. దాని ఫలితాలు స్థానిక హైదరాబాదు బులెటిన్ 'డక్కన్ క్రానికల్' లో ప్రచురించబడ్డాయి. పరిశోధనా ఫలితాలు అఖిల భారత గోసేవా సంఘానికి పంపాను.

రూరల్ ఇండియాలో ఈ ఫలితాలు కూడా ప్రచురించబడ్డాయి. ఇది చూచిన మీదట అఖిల భారత గోసేవా సంఘము వారు రూ.20/- స్కాలర్ షిప్ 10.1.41న ఇచ్చారు. ఈలోగా బజాజ్ ట్రస్టు నుంచి రూ.10/- స్కాలర్‌షిప్ అందేది. వెరసి మొత్తం నా ఆదాయం రూ.30/- అయ్యింది. ఈ మొత్తం నేను సేవాగ్రాం ఆశ్రమానికి, భోజన ఖర్చుకి జమకడుతూ పోయాను. ఖాదీ అనగానే జాజూజీ అని, బేసిక్ విద్యావిధానం అంటే ఆర్య నాయకం అనీ, గ్రామీణ పరిశ్రమలు అంటే కుమారప్ప అనీ భావించేవారు. ఈ విధంగా పనితో వ్యక్తిని గుర్తింపు (Identify) చేయడం బాపూ ప్రత్యేకత.

అలాగే నన్ను గోసేవతో ముడిపెట్టడం జరిగింది. గోసేవ అంటే రాజలింగం అనే గుర్తింపు వచ్చింది. క్రమేణా నేను సేవాగ్రాం గోసేవ శాఖ అసిస్టెంట్ మేనేజరుగా అయ్యాను. పార్నీకర్‌జీ మేనేజరుగా ఉన్నారు.

## డైరీఫాం అసిస్టెంట్ మేనేజర్ :

నేను గ్లూకోజు తయారు చేసాను. బాబు రాజేంద్ర ప్రసాద్, జమనాలాల్ బజాజ్ సతీమణి జానకీదేవి దానిని తప్పకుండా వాడేవారు. సుశీలానాయరు అప్పుడప్పుడు పాలకు వచ్చేది. ఆశ్రమ డాక్టరు శంకరన్‌కు, నాకు పాల విక్రయశాలలో దక్షిణాది స్నేహం కుదిరింది. అనేక చర్చలు జరిగేవి. మైసూరు మంత్రి దాసప్ప బాపూ వద్దకు ట్రీట్‌మెంట్‌కై వచ్చేవాడు. అతను లావు తగ్గాలని అనుకొని బాపూ సలహా అడిగాడు. ఆకుకూరలు ఉడకపెట్టుకొని, ఆ కాగిన నీరుని త్రాగమన్నారు. ఆయన బాపూను కాదనలేక రోజు ఆయన బాధ చెప్పుకునేందుకు వచ్చేవాడు. ఆ విధంగా పలువురి దృష్టిలో పడ్డాను.

సాయంత్రం పాలు, వెన్న, నేయి, గ్లూకోజు యిత్యాది పనులు 5 గంటలకల్లా పూర్తి చేసుకొనేవాడిని. బాపూ వ్యాహ్యాలి నుంచి వచ్చి ప్రార్ధనకు ఉపక్రమించేవారు. నేను అందులో పాల్గొనే వాడిని.

ప్రభాకర్‌జీ నాకై ఎదురుచూస్తూ ఉండేవారు.

నేను రాగానే ప్రభాకర్‌జీ తన ప్రక్కన కూర్చునే అవకాశం కల్గించేవారు.

ఆ ప్రార్ధనలో ఉన్నంతసేపు ఆశ్రమంలోని దివ్య సుందరమూర్తి బాపూను చూస్తూ ఉండేవాడిని. సనాతన కుటుంబం నుంచి వచ్చిన కారణంగా, ఆశ్రమాలు, గురువులు, తీర్ధ ప్రసాదాలు జ్ఞప్తికి వచ్చేవి. గురు సాంప్రదాయ విధానాలపై వచ్చిన వ్యతిరేక విమర్శలు జ్ఞప్తికి వచ్చాయి. రాజకీయంగా నేను ఆ విమర్శనలు సక్రమమో, అక్రమమో తెల్చుకోలేక పోయేవాడిని. ఏదయినా ప్రార్ధనలు, తీర్ధ ప్రసాదాలపట్ల బాపూ ఉద్దేశ్యం తెలుసుకోవాలనే ఆకాంక్ష అధికమయింది. వాటిపట్ల జిజ్ఞాస అధికమయింది. కొద్దిపాటి మౌనం, ప్రార్ధన తరువాత కొద్దిసేపు నిశ్శబ్దంగా కండ్లు మూసుకొని కూర్చోవడం, మనసుకు ఎనలేని శాంతినిచ్చేది. అందరు క్రమశిక్షణతో దీనిని పాటించారు.

ఆశ్రమం ప్రార్థన రిజిష్టరులో నాపేరు :

ఈ పరిస్థితులలో ఒక రోజు ప్రభాకర్‌జీ, ప్రార్థనా సమయంలో నీ పేరు పిలిస్తే హాజరు చెప్పమన్నారు. ఆ సాయంత్రం ఆ విధంగా నాపేరు ప్రార్థనా సమయంలో పిలువబడింది. నేను హాజరు చెప్పాను. ఆశ్రమ ప్రార్థనా రిజిష్టరులో నాపేరు నమోదు అయింది. నాపేరు సేవాగ్రాం ప్రార్థనా రిజిష్టరులో నమోదు కావడానికి ప్రభాకర్‌జీ దోహదం చేశారు.

సేవాగ్రాం ఆశ్రమంలో దరఖాస్తు పెట్టుకుని సభ్యుడయ్యే పద్ధతి లేదు. అచటి వారిలో ప్రతివారూ ఆశ్రమంలో తమకు అవకాశం వచ్చినపుడు ఏదో ఒక నిర్మాణ కార్యక్రమం చేయటం, గాంధీజీ గుర్తింపు పొందటం జరిగేది. అది వారి అదృష్టం. తరువాత ఆశ్రమ సభ్యునిగా అతను గుర్తింపు పొందేవాడు. నావరకు నాకు వెన్న నుండి అత్యధికశాతం నెయ్యి తీసే పరిశోధనా ఫలితంగానే ఆశ్రమ ప్రార్థన రిజిష్టరులో నాపేరు నమోదు చేయబడే అవకాశం వచ్చింది. బాపూజీతో పాటు సహపంక్తి భోజనం చేసే అవకాశం కలిగింది. ఇది నా అదృష్టం.



# ప్రార్థనా సమావేశం

మనస్సు స్వేచ్ఛావిహారాన్ని కోరినా ప్రార్థనా సభలకు హాజరుకండి. మనం మన మనస్సులను అవసరమైన ఒకే విషయం మీద ఏకాగ్రం చేయమని ప్రార్థిస్తాం. ఎవరు ఈ ఏకాగ్రత సాధిస్తారో వారు ఈ ప్రార్థనా సమావేశములకు హాజరవనవసరం లేదు. హాజరయినా, అవకపోయినా అటువంటి వారికి సమానమే. మనస్సును యిష్టం వచ్చినట్లుగా పోనీయకూడదు. ఈ విధంగా ప్రయత్నించినట్లయితే ఏదో ఒకరోజున అన్ని సమయాలలో భగవంతుడున్నాడనే భావన కలుగుతుంది. (భక్తకవి తులసీదాసువలె).

(ఎంపిక చేసిన లేఖలు 2 పుట - 9.)

ప్రార్థనకు రోజూ హాజరవగలమని ప్రమాణం చేసినవారు తమకి మించిపోయే పరిస్థితు లుత్పన్నమయితేనే తప్ప, ప్రార్థనకు హాజరుకావాలని నిర్ణయించుకోవాలి.

(ఎంపిక చేసిన లేఖలు 1. పుట - 4, 6.12.1926)

మనం మన జీవితంలో అనేక విషయాలు కోల్పోవచ్చు. కాని ప్రార్థనను మాత్రం వదలకూడదు. అది భగవంతునికి మనకు మధ్య సహకారాన్ని సూచిస్తుంది. ప్రార్థన మానవుని ఆత్మను పవిత్రీకరించే స్నానం అవ్వాలి.

## ప్రార్థన వల్ల ప్రయోజనము

భగవంతుని సహాయం కోసం గర్వంతో అహంభావంతో ప్రార్థించకూడదు. తనని తాను నిస్సహాయుడుగా భావించి, తప్పులు ఒప్పుకొని ప్రార్థించాలి. ప్రక్కలో పడుకున్నప్పుడు మనం ఎంత ప్రాముఖ్యం లేని వారమో ప్రతిరోజూ నేను గుర్తిస్తాను. అదే విధంగా ఎన్ని బంధాలు, ద్వేషాలు, చెడు కోరికలు మనల్ని వశం చేసుకుంటాయో తెలుస్తుంది. నా మనస్సు యొక్క విలువలేనితనానికి నాకు ఎంతో సిగ్గువేస్తూ ఉంటుంది. నా శరీరం యొక్క వేడికోలు, కోరికలు నశించి పోవాలని గమనించినప్పుడు నేను నిస్పృహకు లోనవుతాను. నా స్థితిని బట్టి ఇతరుల యొక్క స్థితిని నిర్ణయించగలను.

(మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 15, పుట - 65, 26.11.1918)

మీరు రోజూ ఏదో ఒకటి క్రమం తప్పకుండా చదువుతారా? మీరు మంచం నుండి లేవగానే ప్రార్థిస్తారా? మీరు అనుమతించి నట్లయితే నాకు తెలిసినంతవరకు ప్రార్థన ఎంతమంచి చేస్తుందో చెప్పలేను. బాధలలో దాని విలువ నీవు గుర్తిస్తావు. ప్రతిరోజూ లేచింది మొదలు ఆలోచనతో చేస్తే మంచిది. ప్రార్థన మనసుకు ఆహారం. ఆహారం కోసం శరీరం ఎట్లా వెంపర్లాడుతుందో అదే విధంగా మనస్సు (ఆత్మ) కూడా దాని ఆహారం లేకపోతే వాడిపోతుంది.

(ఎంపిక చేసిన లేఖలు 2 పుట – 19. 2.6.1919)

## ప్రార్థనలో శాంతి

ఏది ఏమైనప్పటికీ ప్రార్థనలు, తీర్థ ప్రసాదాల పట్ల బాపూ వైఖరి ఏమిటో స్పష్టంగా తెలుసుకోవాలనే ఆకాంక్ష నాలో అంతకంతకు అధికమైనది. సాయంత్రం పాలు, వెన్న, నేయి, గ్లూకోజు యిత్యాది అమ్మకం పూర్తి చేసుకొనే వాడిని. ప్రార్థనాసమావేశానికి హాజరయ్యేవాడిని. ప్రభాకర్‌జీ నాకై ఎదురుచూస్తూ వుండేవారు.

నేను రాగానే ప్రభాకర్‌జీ 'రాజన్నా, రా' అంటూ తన ప్రక్కన కూర్చో పెట్టుకొనేవారు.

ఆ ప్రార్థనలో వున్నంతసేపు ఆశ్రమంలోని, దివ్య తేజోమూర్తి బాపూను చూస్తూ వుండేవాడిని. సనాతన కుటుంబం నుంచి వచ్చిన కారణంగా, ఆశ్రమాలు, గురువులు, ప్రార్థనలు, తీర్థప్రసాదాలు తదితర సాంప్రదాయాలు జ్ఞప్తికి వచ్చేవి. గురు సాంప్రదాయ విధానాలపై వచ్చిన వ్యతిరేక విమర్శలు కూడా జ్ఞప్తికి వచ్చేవి. రాజకీయంగా నేను ఆ విమర్శలు సక్రమమో, అక్రమమో తేల్చుకోలేక పోయేవాడిని. ఏదయినా బాపూ ప్రార్థనలు, తీర్థప్రసాదాల పట్ల గల అభిప్రాయ మేమిటో తెలుసుకోవాలనే ఆకాంక్ష నాకు ఎక్కువైనది. వాటిపట్ల జిజ్ఞాస కూడా మరింత హెచ్చు అయ్యింది. ప్రార్థనానంతరం కొంతసేపు నిశ్శబ్దంగా కండ్లు మూసుకొని మౌనంగా వుండే వాళ్ళం. ప్రార్థనానంతరం ఏర్పడిన నిశ్శబ్ద వాతావరణం క్రమశిక్షణ నేర్పి మనస్సుకు ఎనలేని. శాంతిని ప్రసాదించేది.



# 4. మహాత్మాగాంధీ ఏకాదశ వ్రతములు

అహింసా సత్య, అస్తేయో, బ్రహ్మచర్య, అసంగ్రహా,
శరీరశ్రమ ఆస్వాదో సర్వత్ర భయవర్జయేత్,
సర్వధర్మ సమానత్వో, స్వదేశీ స్పర్శభావన,
హీ ఏకాదశ సేవాని, నమ్రత్వే కృత నిశ్చయేత్ .

## అహింస :

అహింసకు స్ఫూర్తినిచ్చేది ప్రేమ. ప్రేమ సూత్రం సూక్ష్మతరమైన క్రిముల నుండి ఉన్నతుడైన మానవుని కొరకు జీవులన్నీ సమానమే అనే నిశ్చయభావాన్ని ప్రబోధిస్తుంది. గొప్ప తప్పు చేసిన దోషినైనను కోపము చెందక అతని శ్రేయస్సుకోరి ప్రేమించి సేవించాలి. కాని అతని తప్పునకు అన్యాయానికి లొంగకుండా అతని దోషాన్ని మాత్రం వ్యతిరేకించి కష్టాలను సహించినప్పుడు ఆ దోషి పరివర్తన చెంది తనకు తానుగానే శిక్ష కోరుతాడు.

## సత్యం :

సత్యమే దైవము. ఏకైక వాస్తవ స్వరూపం. సత్యారాధకులు అసత్యాని కెన్నడూ లొంగకూడదు.దేశానికి మంచి జరుగగలదని విశ్వసించిననూ సత్యారాధకులు అసత్యాన్ని ధిక్కరించి, అద్వితీయమైన భక్తివిశ్వాసములతో సత్యాన్ని అనుసరించి ఆరాధించాలి.

## అస్తేయము :

అనుమతి లేకుండా యితరుల వస్తువులను, ఆస్తిని తీసికొనకపోవుట మాత్రమే చాలదు. ఒక పనికి ఉపయోగిస్తామని నమ్మించి, ఆ వస్తువును వేరే విధంగా, చెప్పిన కాలవ్యవధికి మించి ఉపయోగించుకోవటం కూడా దొంగతనమే అవుతుంది. తనకు నిజంగా అవసరం లేని వస్తువును గ్రహించడం కూడా దొంగతనమే. ఈ నియమం వెనుక ఒక సుందర సత్యం ఉన్నది. ''ప్రకృతి మనకు దైనిక జీవితావసరాలకు సరిపడినంత మాత్రమే ప్రసాదించును. అంతకు మించి ఈయదు. ఇదే సుందర సత్యం''.

## బ్రహ్మచర్యము :

బ్రహ్మచర్యాన్ని ఆచరించకుండా గతంలో చెప్పిన నియమాలను ఆదరణలో పెట్టడం అసాధ్యం. వివాహమైన భార్యాభర్తలు శరీర సంబంధమైన సుఖాసక్తతను కలిగియుండరాదు. కాని ఇరువురూ జీవితాంతం మిత్రులుగా పవిత్రమైన బంధాన్ని కలిగియుండాలి. పాపదృష్టితో కూడిన స్పర్శగాని, మాటగాని ఈ నియమానికి భంగకరమౌతాయి.

## అపరిగ్రహము :

అపరిగ్రహము అనగా స్వంతమన్నది లేకయుండుట. అవసరానికి మించి గ్రహించకూడదు. కలిగి యుండకూడదు. అనవసరమైన ఆహారపదార్థాలు, దుస్తులు, అలంకరణ సామగ్రి కలిగియుండుటవలన ఈ నియమానికి భంగం కలుగుతుంది. ఈ నియమపాలన వలన జీవితంలో నిరాడంబర తను పెంపొందించుకొనవచ్చును.

## శరీర శ్రమ :

శరీరశ్రమ వలన శరీరాన్ని పరిరక్షించుకున్నవారే తమను, సమాజాన్ని రక్షించుకోగలుగుతారు. దేహదారుఢ్యముగల యువకులు వారి వ్యక్తిగతమైన పనులన్నిటినీ వారే చేసుకోవాలి. అనివార్య పరిస్థితులలో తప్ప యితరుల సేవ నాశించకూడదు. సరియైన శక్తిగల ప్రతి ఒక్కరూ చిన్నపిల్లలకు వృద్ధులకు, రోగులకు సేవ చేయుటయే తమ కర్తవ్యమని భావించి గుర్తుంచుకోవాలి.

## జిహ్వా నిగ్రహము (అస్వాదము) :

శరీర పోషణకు, సేవచేయుటకు తగిన పరిహారముగా నుపయోగపడునంత ఆహారమును మాత్రమే ఔషధమువలె తగిన మోతాదులలో తీసికొనవలెను. ఈ నియమాన్ని అనుసరించటానికి సుగంధద్రవ్యాలు, మసాలా సరుకులతో చేసిన ఆహార పదార్థాలు, ఊరగాయలు, మాంసం, మద్యం, పొగాకు, భంగు మొదలగు వానిని వర్జింపవలెను. విందులలో పాల్గొనకుండుట ఈ నియమానికి తోడ్పడుతుంది.

## నిర్భయత్వం :

భయాని దాసుడై నంతకాలం ఎవరూ సత్యాన్ని, ప్రేమను అనుసరించలేరు. సత్యాన్వేషకుడు తల్లిదండ్రులపట్ల, కులంపట్ల, ప్రభుత్వం పట్ల, దుండగులు మొదలగు వారిపట్ల భయాన్ని విడనాడాలి. పేదరికానికీ, మరణానికీ కూడా భయపడకూడదు.

## మత సహనం :

అసత్యంలో మిశ్రితమై దోషపూరితమైన మనుష్యుల చేతను, అసంపూర్ణతతో కూడిన వారిచేతను ఈ ప్రపంచం ప్రభావితమైయున్నది. అందుచేత ఇతర మతవిశ్వాసంగల వారిపట్ల కూడా సమాన గౌరవంతో ఆదరణ చూపాలి. పరస్పరం సహకరించుకోవాలి. ఈ విధమైన సహనభావం జీవన సూత్రం అయినప్పుడు వివిధ మతాల మధ్య విభేదాలు కలహాలు ఉండనేరవు. ఈవిధంగా సకల మతాలకు చెందిన సర్వజనులు ఒకరి విశ్వాసాలను ఒకరు అవగాహన చేసుకొనటానికి కృషి చేస్తారు. వివిధ విశ్వాసాలలో వుండే లోటుపాట్లను జయించటానికి, సంపూర్ణతకు, ముందడుగు వేయటానికి ప్రార్థన చేయగలగాలి.

## స్వదేశీ :

మొదట తన పొరుగువానికి సేవచేసి, ప్రపంచానికి సేవ చేయుట అనేది స్వదేశీ సూత్రం. స్వదేశీ నియమాచరణ ప్రపంచంలో క్రమబద్ధం కలిగిస్తుంది. ఈ నియమానికి భంగం వాటిల్లితే అయోమయ పరిస్థితి ఏర్పడుతుంది. ఈ నియమాన్ని పాటించేవారు సాధ్యమైనంత వరకూ ఆ ప్రాంతంలో తయారైన వస్తువులను మాత్రమే కొంటారు. మన దేశంలో సులభంగా తయారు కానట్టియు, విదేశాల నుంచి దిగుమతి అగునట్టియు వస్తువులు కొనరు. స్వదేశీ నియమంలో స్వార్థం వుండదు. స్వార్థాన్ని కుటుంబం కోసం, కుటుంబాన్ని గ్రామం కోసం, గ్రామాన్ని దేశం కోసం, దేశాన్ని మానవత కోసం త్యాగం చేసే లక్షణం అలవడుతుంది.

## అస్పృశ్యతా నివారణ :

హిందూమతంలో అస్పృశ్యత లోతుగా వ్రేళ్ళుపాతుకున్నది. మొత్తం మీద అది ఏ మతానికైనా విరుద్ధమైనదే. దాని నిర్మూలన కూడా ఒక స్వతంత్ర నియమంగా భావించబడుతున్నది.

వృత్తి ఆధారంగా వర్ణవిభజన జరిగింది. కనుక ప్రతి వ్యక్తి తనకు వారసత్వంగా వస్తున్న వృత్తిని, మౌలిక నీతికీ, ధర్మానికి విరుద్ధంగా కాకుండా అనుసరించి, తన శక్తిని తన వృత్తిలో అభివృద్ధి చెందటానికీ, నిజమైన పరిజ్ఞానం సంపాదించటానికీ, తీరిక వేళలలో అంకిత భావంతో కృషిచేయాలి. స్మృతులలో చెప్పబడిన నాలుగు వర్ణాశ్రమ ధర్మాలు మానవజాతి సంక్షేమానికి హితకరమైనవి.



# వ్యక్తి సత్యాగ్రహం

ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. హిట్లరు ఒక దేశం తరువాత మరొక దేశం ఆక్రమించసాగాడు. బెల్జియం, పోలెండు, హాలెండు ఆధీనపరచుకున్నాడు. బ్రిటన్‌లో చర్చిల్ ప్రభుత్వానికి నాయకత్వం వహించాడు. బ్రిటను భారతీయ సైనికులను యుద్ధంలో ఉపయోగించసాగారు. ఈ యుద్ధంలో బేషరతుగా సహాయపడడానికి గాంధీజీ యిష్టపడలేదు. బ్రిటను భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటిస్తే వారి నైతిక స్థాయి పెరుగుతుందని భావించారు. గాంధీజీ అహింసా సిద్ధాంతాన్ని పాటిస్తే ప్రపంచం ఇండియా వైపు మొగ్గుతుందని వారు భావించారు. ఈ అంశాన్ని చర్చించేందుకు వార్ధాలో అ.భా.కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం 1941లో ఏర్పాటయింది. బాపూ అహింసా సూచనను, బ్రిటిషు ప్రభుత్వం అంగీకరించలేదు. అహింసా పద్ధతిపై సామూహిక పోరాటాలుగాక, వ్యక్తిగత సత్యాగ్రహం బాపూ నిశ్చయించారు. ఇందులో పాల్గొనే వారందరు నిష్ణాతులైన నిర్మాణకార్యకర్తలే. బాపూ అనుమతి లేనిదే ఎవరు సత్యాగ్రహం చేయరాదు. ఈ వ్యక్తి గత సత్యాగ్రహంలో వినోబాని ప్రథమ సత్యాగ్రహిగా గాంధీజీ ఎంపిక చేశారు. ఆయన వార్ధాకు దగ్గరలో వున్న ఒక గ్రామములో సత్యాగ్రహం చేశారు. అరెస్టు చేయబడ్డారు.

★★★

అహమ్మదాబాద్
7-6-1916.

ప్రియమైన నరహరి శంభూరావ్ భావేకి,

మీ కుమారుడు వినోబా నా దగ్గర ఉన్నాడు. మీ కుమారుడు ఇంత బాల్యంలోనే తపస్వి.

ఆ స్థితికి సంవత్సరాల తరబడి కృషిచేసినా నేను చేరుకోలేను.

ఎమ్.కె. గాంధీ.



సబర్మతి
10-2-1918.

ప్రియమైన వినోబా గారికి,

ఏ మాటలలో మిమ్ములను ప్రశంసించాలో నా కర్థం కావటం లేదు. మీ శీల సంపద, మీ ఆత్మ పరిశీలన, నన్ను ఆనందపరుస్తున్నాయి. మీ శక్తిని నేను అంచనా వేయలేను. మీ భావాలను గౌరవించి మీ పితృస్థానాన్ని అంగీకరిస్తున్నాను. నా జీవిత కాంక్షను మీరు పూర్తి చేస్తున్నారు.

తన తండ్రిని, కుమారుడు గుణగణాలతో ఉంచినపుడే ఆతండ్రి తండ్రి అవుతాడు. తన తండ్రి చేసిన దానికి అభివృద్ధి పరిచినప్పుడే కుమారుడు నిజమైన కుమారుడు అవుతాడు. తండ్రి సత్యవంతుడై దృఢ నిశ్చయుడయితే కుమారుడు అంతకంటే ఎక్కువ కావాలి. నాకు నీవు ఋణపడి లేవు. అందువలన ప్రేమకానుకగా మీరు ప్రసాదించిన దానిని స్వీకరిస్తున్నాను. ఇందుకు తగిన వాడుగా నన్ను నేను ఋజువు చేసుకుంటాను. నేను మరొక హిరణ్యకశిపుడినైతే నన్ను వ్యతిరేకించవలెను. ప్రహ్లాదుడు నాయందు ఉన్నాడు. ఆశ్రమం బయట ఉన్నా నియమాలను తూ.చ. తప్పకుండా పాటిస్తున్నానని అంటున్నావు. అది నిజమే. నాకు అటువంటి అవిశ్వాసం లేదు. మీకు చిరాయువును భగవంతుడు ప్రసాదించుగాక. భారతదేశ పునర్నిర్మాణముగా మీ శక్తులు ఉపయోగపడుగాక.

ఆశీర్వచనములతో,

ఎమ్.కె. గాంధీ.

# ద్వితీయ సంగ్రామము

### ద్వితీయ సంగ్రామము :

లార్డ్ హెలిఫెక్స్ ద్వితీయ సంగ్రామానికి రెండు సంవత్సరాల పూర్వం భారతదేశానికి వైస్‌రాయ్‌గా పనిచేశారు. అతను ఒకసారి నియంత హిట్లర్‌తో కలిసి సంభాషణలు జరిపారు. ఇంగ్లాండు, జర్మనీకి గల వివాదాల విషయం చర్చకు వచ్చింది. హిట్లరు ఇంగ్లాండుకు, జర్మనీకి గల వివాదాలు కేవలం కాలనీలకు సంబంధించిందేనని అన్నారు. ఈ అంశమే ద్వితీయ సంగ్రామానికి కారణభూతమైనది. స్వార్థ పూరితమైనది. అయినా ప్రపంచ యుద్ధనేతలు ప్రపంచశాంతికోసము, పౌర హక్కులు నిలిపేందుకోసము ఈ సంగ్రామమము జరుగుతున్నదని ప్రకటించారు.

### గాంధీజీ :

గాంధీజీ తదితర నాయకులు ఈ అభిప్రాయంతో ఏకీభవించలేదు. దీనిని ఎదిరించాలని నిశ్చయించుకున్నారు. గాంధీజీని నాయకుడుగా అంగీకరించారు. ఆయన సత్యాహింసలపై ఆధారపడిన సత్యాగ్రహ ఉద్యమాన్ని లేవదీసారు.

### సత్యాగ్రాహి పథం :

వార్ధాలో అఖిల భారత కాంగ్రెసు కార్యవర్గ సమావేశం 1941లో పూర్తి అయ్యింది. వ్యక్తి సత్యాగ్రహ తీర్మానం ఆమోదించబడింది. భారత జాతీయ కాంగ్రెసు ఆదేశానుసారం ''నేను యుద్ధాన్ని వ్యతిరేకిస్తున్నాను. ఈ యుద్ధ నిర్వహణకై ప్రభుత్వానికి ఎట్టి సహకారం యివ్వవద్దని నాతోటి వారిని కోరుతున్నాను.'' అనే శపథం ప్రతి సత్యాగ్రాహి చేయాలి.

**సత్యాగ్రహానికి అనుమతి :**

''సత్యాగ్రహించడానికి ఆ సత్యాగ్రహి ముందుగా గాంధీ మహాత్ముని అనుమతి పొందవలసి వుంటుంది.'' అని తీర్మానించబడింది. వ్యక్తి ఎంపిక కూడా వారే చేయాలి.

**పండిత్‌జీయా ప్రథమ సత్యాగ్రాహి ? :**

ఎవరు ఈ ప్రథమ సత్యాగ్రాహి ! గాంధీజీ ప్రజా విశ్వాసాన్ని, ఆదరణను చూరగొన్న పండిత్‌జీ కన్న మరెవరున్నారు? గాంధీజీ ఎంపిక తప్పక నెహ్రూ పండితునిదే అయి వుంటుంది. ప్రజాభిప్రాయం కూడా పండిత్‌జీ వైపే వున్నది.

**రాముని ఆజ్ఞ :**

ఈ విషయం బాపూను పత్రికలవారు అడిగితే, 'రాముని ఇచ్ఛ' అని మాత్రమే జవాబు వచ్చింది. ప్రభుత్వంగాని, ప్రజా బాహుళ్యంగాని ప్రథమ సత్యాగ్రాహి ఎవరని ఊహించలేని పరిస్థితి ఏర్పడింది.

ఏదైనా, పండిత్‌జీయే ప్రథమ సత్యాగ్రాహి అని భూనభోంతరాలు పలుకసాగాయి. ప్రతి ధ్వనించాయి.

కార్యవర్గ సమావేశం కాగానే పండిత్‌జీ బాపూజీ నుంచి సెలవు తీసుకొని వెళ్ళదామని వచ్చారు. ఆశ్రమవాసులు, సేవాగ్రాం ప్రజలు, బయటి ప్రజానీకంతోను ఆశ్రమం నిండిపోయింది.

బాపూజీలో ఏ స్పందన కనిపించలేదు.

**అదిగో నీ ముద్దుల కొడుకు :**

కాంగ్రెసు కార్యవర్గ సమావేశానంతరం బాపుజీ నుంచి సెలవు తీసుకోవడానికి పండిత్‌జీ సేవాగ్రాం వచ్చారు. పండిత్‌జీ రాగానే బాపు కస్తూరిబాను పిలిచారు. '' నీ ముద్దుల కొడుకు వచ్చాడు.'' అన్నారు గాంధీజీ.

పండిత్‌జీ పసిపిల్లవాడిలాగా బా వద్దకు చేరారు. అందరు పండిత్‌జీ ప్రథమ సత్యాగ్రాహి అనుకోసాగారు.

బా అతనిని తీ సుకువెళ్ళి పాయసం చేతితో చెంచాను నోటి కందించింది. తల్లి పోయినా తల్లంత ప్రేమతో పాయసం కస్తూరిబా చేతితో తినే అదృష్టం పండిత్‌జీకి కలిగింది.

కస్తూరిబా కంటిలో నీరు కమ్ముకుంది. పండిత్‌జీ ఆ కన్నీటిని చూడలేక తలవంచుకున్నారు. భారతవీరుడు, భావి భారతవిధాత స్వేచ్ఛగా కస్తూరిబా కన్నీటిని చూడలేక, తన దస్తీతో తన కండ్లు తుడుచుకున్నారు. నాయకత్వం బాధ్యతలు అటువంటివి.

**ఇది తప్పదు కదా :**

స్వాతంత్ర్యదేవి ఎంత కఠోరమైన బలిని నాయకుల నుంచి కోరుతుందో ఈ ఘట్టం చూసిన వారికి ద్యోతకమవుతుంది. స్వాతంత్ర్యం లేక పోయినా సరే, పండిత్‌జీ, కస్తూరిబా కన్నీరు చూడలేమని ప్రజలు విధిని నిందించారు.

కాని భారతమాత దాస్య శృంఖలాలను విముక్తి చేయవలసిన బాధ్యత పండిత్‌జీ, నాయకులపై వున్నది. నిండు గుండెతో, వదలలేక, వదలలేక పండిత్‌జీ, బానుంచి వచ్చి బాపూకు నమస్కరించి సెలవు తీసుకొని, విడువలేక విడువలేక విడిపోయారు.

ఈ దృశ్యాన్ని చూసే అదృష్టమో, దురదృష్టమో నాకు, ప్రభాకర్‌జీలకు లభించింది. మా బలహీన ఘడియలలో, ఈ ఘట్టం చెప్పినపుడు స్వాతంత్ర్య పోరాటంలో మాకు ఎంత స్ఫూర్తిని, ఎంత బలాన్ని యిచ్చిందో ఊహించవచ్చు.

**పండిత్‌జీ అరెస్టు కాలేదు :**

తెల్లవారే సరికి పండిత్‌జీ అరెస్టు అయి జైల్లో బ్రిటీషు రాక్షసుల చేతులలో నలుగుతున్నట్లు పలువురు ఊహించుకున్నారు. కాని పత్రికలెంత తిరుగవేసినా, ఎవరిని అడిగినా నెహ్రూ పేరు కనపడలేదు, వినపడలేదు. వినోబాజీ ప్రథమ సత్యాగ్రహిగా రాముని ఆజ్ఞ ప్రకారం బాపూ ప్రకటించారు - విధి లిఖితమిది.

**ప్రథమ సత్యాగ్రహిగా వినోబా ఎంపిక :**

వినోబా ప్రపంచ పటముపై ప్రథమ సత్యాగ్రాహిగా కన్పించారు. బాపూను 'ఇదేమిటని అంటే, 'రాముని ఆజ్ఞ' నేనేం చేయను అని జవాబు యిచ్చారు. వినోబాజీ సత్యమునకు, నీతికి ప్రతీక అన్నారు. పాశ్చాత్యుల ద్వితీయ సంగ్రామ ప్రకటనలు సత్యదూరం. కాబట్టి తెలుసుకోవలసింది ప్రపంచ యుద్ధ ఆశయాలు, విశ్లేషణ, వాటి నిజ స్వరూపము అందలి సత్యము. ఇట్టి సత్యస్వరూపమును, పాశ్చాత్యులకు అర్ధమగునట్లు చేయగల్గినది ఋషియైన వినోబాజీ మాత్రమే ! అందుకే బాపూజీ అతనిని కోరుకున్నారు. గాంధీజీ సరియైన వ్యక్తిని సరియైన కాలంలో సరియైన స్థానంలో వుంచగలిగిన మహానాయకుడు, దక్షుడు.

**ఎందుకు ఇలా జరిగింది ? :**

నీతికి అగ్రస్థానము యిచ్చి, మొదటి సత్యాగ్రహిగా వినోబాను, భారత భవిష్యత్తు, రాజ్యాంగాధినేతగా పండిట్‌జీని ద్వితీయ సత్యాగ్రహిగా గాంధీజీ నిర్ణయించారు. అది రాముని ఆజ్ఞతో – ఇట్టి ఘట్టాలను చూడగల్గిన మేము ఎంతో అదృష్టవంతులము. 'మహాత్ములు తలచుకొంటే కానిదేమిటి?'.

ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో పాశ్చాత్యదేశాలు అవలంబించిన యుద్ధనీతి నిజ స్వరూపాన్ని ప్రపంచానికి చాటి చెప్పగల మహామనిషిగా వినోబాను మహాత్ముడు చాటారు.



# కుమారప్ప హెచ్చరిక
# సత్యాగ్రహము - ఆందోళన

**వినోబా అరెస్టు - విద్యార్థుల ఆందోళన**



1940లో వార్థాలో అఖిల భారత కాంగ్రెస్ కార్యవర్గ సమావేశమైనది. అగ్రనాయకులంతా ఆ సమావేశానికి వచ్చారు. వ్యక్తి సత్యాగ్రహ తీర్మానం ఆమోదించబడింది.

ఈ తీర్మానుసారం పౌనారు ఆశ్రమ అధినేత తపస్వియైన వినోబా భావేను గాంధీజీ ప్రథమ సత్యాగ్రహిగా ఎంపిక చేసారు. గాంధీజీ ఆదేశానుసారం పౌనారు నుండి బయలుదేరి యుద్ధ వ్యతిరేక నినాదాలిస్తూ వినోబా అరెస్టు అయినారు. వార్థా జైలులో నిర్బంధించబడినారు.

ఈ విషయం తెలిసిన మీదట పౌనారు, నాల్వాడి, మగన్‌వాడి గ్రామీణ ఖాదీ కేంద్రాల్లో పనిచేస్తున్న వారంతా వారి దర్శనం చేసుకుందామని అభిలాష వ్యక్తం చేసారు. దీన్ననుసరించి మగన్‌వాడి గ్రామీణ విద్యార్థులంతా జె.సి.కుమారప్పగారిని వినోబాజీ దర్శనానికై జైలువద్దకు పోవుటకు అనుమతి కోరారు.

**జె.సి.కుమారప్ప - అనుమతి నిరాకరణ**

కుమారప్ప గారు మీరంతా నిర్మాణ కార్యకర్తలు. మీరు నిర్మాణ కార్యక్రమ సంస్థల్లో వున్నారు. సత్యాగ్రహం రాజకీయ ప్రక్రియ. అందులో మీరు పాల్గొనకూడదని వాదించారు. కాని, దీనిని విద్యార్థులు అంగీకరించలేదు.

**విద్యార్థుల తిరుగుబాటు**

విద్యార్థులంతా కుమారప్పగారిని కాదని వార్థా జైలువద్ద సమావేశమైనారు. వినోబా దర్శనానికై జైలు అధికారులను అర్థించారు. కాని లాభం లేకపోయింది. ఈలోగా నాల్‌వాడి తదితర ఖాదీ కేంద్రాల నుంచి కూడా కార్యకర్తలు రావడం, ఈ ప్రదర్శనలో భాగస్వాములు గావడం జరిగింది.

**శాంతికి భంగం - మహదేవ్ దేశాయ్, కస్తూరిబా జోక్యం**

శాంతియుత ఆందోళన దెబ్బతిని సాగింది. ఈ విషయం గాంధీజీ దృష్టికి తేబడింది. ఆయన మహదేవ్ దేశాయ్‌ను కార్యకర్తలను సర్దుబాటు చేయవలసినదిగా ఆదేశించి పంపారు. కాని, లాభం లేకపోయింది. చివరకు కస్తూరిబాను గాంధీజీ ఇదే యత్నంలో పంపారు. ఆవిడ మాతృ హృదయము, సర్దుబాటు ధోరణి అవసరమైతే ఉపవాసదీక్ష పూనుకుంటాననే ప్రకటన ఈ ఆందోళన ఆగడానికి దోహదపడినాయి.

**రాజీ కుదిరింది**

కొంత శాంతత ఏర్పడిన తరువాత జైలు అధికారులు వినోబాజీను బైటకు తీసుకురాకుండా, మెయిన్ గేటువద్దకు తీసుకువస్తామని అందరూ దర్శనం చేసుకోవచ్చని హామీ ఇచ్చారు. అలాగే జరిగింది. అందరూ తృప్తి చెందారు.

**నాకు వార్నింగ్**

అదే సాయంత్రం గ్రామీణ విద్యాలయంలో మామూలు ప్రార్థనలు జరిగాయి. కుమారప్పగారు హాజరయ్యారు. ఉదయం జరిగిన సంఘటనను ఖండించారు. ఇది క్రమశిక్షణకు విరుద్ధం అన్నారు. ఏది ఏమైనా ముందుముందు ఇలా జరగరాదని మమ్మలను హెచ్చరించారు. పదేపదే నిర్మాణ కార్యకర్తలు వేరని, రాజకీయ ఆందోళన లో పాల్గొనకూడదని స్పష్టం చేశారు.

నన్ను ఉద్దేశించి, 'ముఖ్యంగా నువ్వు ఈ విషయాన్ని గుర్తుంచుకోవాలి. నీ వల్లనే ఈ విద్యాలయ క్రమశిక్షణ దెబ్బతిన్నది. విద్యార్థులను రెచ్చగొట్టావు. జాగ్రత్త' అంటూ, 'you are a fire to the institution', 'నీవు విద్యాలయానికి నిప్పువంటి వాడివి జాగ్రత్త', అంటూ మరీ మరీ హెచ్చరిస్తూ ప్రార్థనానంతరము తన సందేశాన్ని ముగించారు.

దౌర్జన్యము, హింసకు దారితీయు ఆందోళనలు అహింస అంతర్భాగంగా ఉండజాలవు.



# సాయుధ పోరాటమా?



**విప్లవవీరుల వీరగాథలు :-** నేను దుగ్గిరాల హైస్కూలులో ఫస్టు ఫారమ్ చదువుతున్నప్పటినుంచి నన్ను ఆకర్షించినది. భగత్‌సింగు, దత్తు, సుఖదేవ్,రాజగురు, సావర్కర్ వీరగాధలు. వరంగల్లులో నా హైస్కూలు దశనుండి హైద్రాబాద్‌లో నిజాం కాలేజీ దశవరకు వారి వీరగాధల ప్రభావం నాపై చూపుతూనే వచ్చింది. గ్రామీణ విద్యాలయంలో చేరిన నాటికి రాజకీయ తీవ్రత నాలో అంతగా వుండేది కాదు. కాకపోతే విద్యార్థి రంగంలో నాయకత్వం నాకు కాలేజీలో తప్పలేదు. 1941లో వ్యక్తి సత్యాగ్రహము ప్రారంభమైనది. వినోబాజీని ప్రథమ సత్యాగ్రహిగా గాంధీజీ ఎంపిక చేసారు.

**విప్లవ ఘట్టాలు :-** బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా అనేక విప్లవాలు వ్యక్తిగతంగాను, వివిధ సంస్థల పరంగాను చెలరేగాయి. 1857లో సిపాయి తిరుగుబాటు జరిగింది. దారుణంగా పన్నులు వసూలు చేస్తున్నందుకు ఫడ్కే బ్రిటిషు అధికారులను ఎదుర్కొన్నారు. ఆయనకు యావజ్జీవ శిక్ష పడింది. 1897లో ప్లేగ్ కమిషన్‌కు చెందిన సాండర్స్‌ను కాల్చి చంపినందుకు చాపేర్కర్ సోదరులకు మరణశిక్ష విధించారు. 1908లో పంజాబీ విప్లవకారులతో సంబంధం వున్నదని అరవిందఘోష్‌ను మరి ముప్పై నలుగురిని అరెస్టు చేసారు. ఇదే చరిత్రలో అలీపూర్ కుట్రకేసుగా ప్రసిద్ధి చెందింది. వినాయక దామోదర్ సావర్కర్ విప్లవకార్యాలకై అభినవ భారత సమితి ఏర్పరచారు. 1909లో లార్డ్ మింటో దంపతులపై కొబ్బరికాయ బాంబు విసిరినందుకు ముగ్గురికి మరణశిక్ష విధించబడింది. 1912లో వైస్రాయ్ హార్డింజ్‌పై రాసబిహారీ ఘోష్ బాంబు విసిరాడు. ఇది ఢిల్లీ కుట్రకేసని పేరుగాంచింది.

**కత్తికి కత్తి :-** ''చట్టబద్ధ పోరాటాలు, ఆందోళనలు ఫలించలేదు. మన దేశ విముక్తికై సాయుధ విప్లవమే మార్గము. పాలకులు స్వాతంత్ర్యాన్ని వెండిపళ్ళెంలో పెట్టి యివ్వరని చరిత్ర రుజువు చేసింది. కత్తి భయం వుంటేనే వారు దాన్ని యిస్తారు.'' ఇలాంటి విశ్వాసాలతో విప్లవకారులు ఉరికంబాలకు ఎక్కుతున్న రోజులవి.



స్వరాజ్యము నా జన్మహక్కని తిలక్ నినాదం యిచ్చారు. హరిదయాళ్ ప్రథమ అంతర్జాతీయ విప్లవకారుడు. అతను అంతర్జాతీయంగా భారతీయుల విప్లవకూటమిని ఏర్పరిచారు. 1928లో లాలా లజపతిరాయ్‌పై సాండర్సు లాఠీ ప్రయోగం చేసాడు. వారు క్రిందపడిపోయినా నిర్దాక్షిణ్యంగా స్పృహ కోల్పోయేవరకు లాఠీ ఛార్జి చేస్తూ పోయారు. ఈకారణంగా దత్తు, భగత్‌సింగు, సుఖదేవ్, రాజగురు సాండర్సును చంప నిశ్చయించుకున్నారు. వారి లక్ష్యం నెరవేరింది. వీరందరూ ఉరితీయబడ్డారు.

**భగత్‌సింగ్ లేఖలు :** భగత్‌సింగ్ తను ఉరికంబం ఎక్కబోయే ముందు తల్లికి రాసిన లేఖ ఈక్రింది విధంగా ఉంది :

''అమ్మా, నా దేశం ఒక స్వాతంత్ర్య దేశము కాగలదని నా విశ్వాసము. కాని, ఈ తెల్ల దొరలు (వైట్ సాహెబ్స్) బదులు బ్రౌన్ దొరలు ( బ్రౌన్ సాహెబ్స్) కూర్చుంటారనే భయం నాకున్నది. సాధారణ ప్రజల బాధలు అదే విధంగా ఉంటాయి. కేవలం మాస్టర్స్ (పాలకులు) మాత్రమే మారుతారు. అది జరగకుండా వుండాలంటే సరైన విప్లవం రావాలి.''

మరొక లేఖ తనను రక్షించాదలచుకున్న జహంగీర్‌కు రాసాడు. ''నాకు బ్రతికి వుండాలనే వాంఛ వుండడం సహజం. ఆ విషయం నేను దాచిపెట్టదలచుకోలేదు. కాని, నేను జీవించి వుండడానికి ఒక షరతు వున్నది. నేను జైలులో గాని, నిర్బంధంగాగాని సజీవంగా వుండదలచుకోలేదు. భారత విప్లవానికి చిహ్నంగా నాపేరు మారింది. విప్లవ పార్టీ ఆశయాలు, త్యాగాలు నన్ను చాలా ఎత్తుకు పెంచినాయి. నేనొకవేళ బ్రతికివున్నా యింకా ఎత్తు పెరగడానికి వీలులేనంతగా నేను పెరిగిపోయాను. ఈవేళ నా బలహీనతలు ఇతరులకు తెలియవు. నేను ఉరి నుంచి కాపాడబడితే నా బలహీనతలన్నీ వెలుపలకు వస్తాయి. ఈ విప్లవ చిహ్నం పాలిపోతుంది. అది అంతరించినా అంతరించవచ్చు. కావున నవ్వుతూ ధైర్యంగా ఉరికంబానికి ఎక్కడం అన్న నా లక్ష్యం దగ్గరకు వస్తుంది. భారతదేశంలోని తల్లులు, బిడ్డలు భగత్‌సింగ్ కావాలని కోరుకుంటారు.

భగత్‌సింగ్ ఇలాంటి లేఖలతోనే విప్లవానికి నిర్వచనం చెప్పాడు. అతని పరిభాషలో కళ్ళకు కట్టే అన్యాయం ఈనాటి వ్యవస్థలో వుంది. దీనిని తప్పకుండా మార్చడమే విప్లవ అంతరార్థము.

ఈ సంశయాలు నన్ను సాయుధ విప్లవమా? శాంతియుత పోరాటమా? అనే ప్రశ్నలకు సమాధానం వెదుకుటకై ప్రోత్సహించినవి.

వీరి త్యాగాలు, వీరగాథలు గ్రామీణ విద్యాలయంలో కూడా నేను తరచూ చెబుతూ వుండేవాడిని. ఈ సాయుధ విప్లవాన్ని అర్థరహితం అనలేము కదా!

## శాంతియుత పోరాటం

సాయుధ పోరాటానికి భిన్నంగా గాంధీజీ సత్యహింసల సిద్ధాంతంపై ఆధారపడిన శాంతియుత పోరాటాన్ని ప్రభోధించసాగారు. దాని ప్రభావాన్ని ప్రజలు గుర్తించారు. 1920లో సహాయనిరాకరణ ఉద్యమం జరిగింది. 1930లో ఉప్పు సత్యాగ్రహం జరిగింది. 1941 లో వ్యక్తి సత్యాగ్రహం జరిగింది. ఈ ఉద్యమాలన్నీ క్రమేణా జాతీయ చైతన్యానికి సాక్షిగా నిలిచాయి. స్వార్థము, ద్వేషము లేని హింసాయుత విప్లవకారుల చర్యలు గాంధీగారి అహింసలో ఇముడుతాయా? ఇమడగలవా? అనే ఆలోచన అధికమయింది.

**సేవాగ్రాం వైపు దృష్టి :-** ఇందుకు గాను ఏమాత్రం వీలున్నా గాంధీజీ ఆశ్రమంలో వుండి, ఈ అంశంపై కొంత పరిశోధన చేయాలనే కోర్కె అధికమయింది. నా దృష్టి గ్రామీణ విద్యాలయం నుంచి సేవాగ్రాం వైపు మరలింది.

# హింసా? అహింసా ?

సాయుధ విప్లవకారులు దెబ్బకు దెబ్బ అనే సిద్ధాంతము విశ్వసించి అనేక త్యాగాలు చేసారు. ఈ సిద్ధాంతంలో హింస తప్పని సరి. హింసతోనే స్వాతంత్ర్య సాధన చెయ్యగలమనే విశ్వాసం తప్పని గాంధీజీ అభిప్రాయపడ్డారు.

దీనికి భిన్నంగా గాంధీజీ సత్య అహింసలపై ఆధారపడిన సత్యాగ్రహ ఉద్యమాన్ని లేవదీసారు. వారు ప్రభోధించిన అహింస నిర్వచనము ఈ క్రింది విధంగా వున్నది.

## అహింస

భౌతికమైనది కాక పారమార్థికమైన ప్రేమ దేవుని చూపుతుంది.

(హరిజన్ 23, 11, 47,- పుట 425.)

అహింస అంటే అందరి పట్ల విశ్వవ్యాప్తమైన ప్రేమ.

(యరవాడ మందిరం నుండి. 1957- పుట 10.)

అహింస అంటే అపాయము కలిగించకుండుట మాత్రమే కాదు. అపకారికి కూడా ఉపకారము చేయమని ఉద్బోధించే సకారాత్మక ప్రక్రియ అహింస. అయితే పాపి పాపాలు చేస్తుంటే చూస్తూ ఊరుకోవడం, పాపకర్ముడికి దూరంగా వుండడం సరికాదు. దానివల్ల పాపికి కష్టం, నష్టం కలిగినా సరే. అహింసలో ముఖ్యాంశం; నా కుమారుడు పాపి అయితే నేను వానిని సమర్థించను. నాకు వానిపట్ల నిజంగా ప్రేమ వుంటే అతనికి చావు మూడినా అతనికి నా సహాయము లభించదు. ఆ ప్రేమ మూలంగానే పశ్చాత్తాపుడైనవాడు అతనిని నా అక్కున చేర్చుకొని సేద దీరుస్తాను. ''దారి తప్పిన కుమారుడు'' అనే కథలో కూడా ఇదే ఉన్నది. బలవంతంగా హింసతో, అతనిని మంచివాణ్ణిగా మార్చేందుకు ప్రయత్నించను.

(యంగ్ ఇండియా 25 - 8 - 20 పుట -2)

## పశు సంరక్షణ

# భారతానంద్ - జీవకారుణ్యం

భారతానంద్ మన దేశస్థుడు కాడు. పోలెండు నివాసి. బాపూజీచే ప్రభావితుడైన విదేశీ ప్రముఖుడు. భారతీయ సంప్రదాయాలను, బాపూజీ అహింసా సిద్ధాంతాలను సంపూర్ణంగా అర్థం చేసుకొనేందుకు 'సేవాగ్రాం' కు తరలి వచ్చారు. అతను ఏ పరిస్థితులలో, ఏ సమయంలో, ఏ విధంగా బాపూజీ వలన ప్రభావితులైనారో నాకు తెలియదు.

గొప్ప ఇంజనియర్‌గా పేరుపొందిన భారతానంద్ హోదాను, పలుకుబడిని, ఉద్యోగాన్ని, సంపదను, తన దేశాన్ని, చివరకు భార్యాబిడ్డలను, సుఖసౌఖ్యాలను అన్నిటిని వదలి బాపూజీ పాదాల వద్ద తన జీవితాన్ని కానుకగా సమర్పించారు.

జె.సి. కుమారప్పగారి అధ్వర్యంలో నడుపబడుచున్న గ్రామీణ విద్యలు, ఈ కార్యక్రమములు అతనిని బాగా ఆకర్షించాయి. అచ్చటనే నడుపబడుచున్న గానుగ పరిశ్రమను అతడు చూడడం తటస్థించింది. నూనె గానుగ తిరగడంలో ఎద్దులాగే బరువును, పొందే బాధను చూచి గుండె కలచివైచినట్లైనది. తదుపరి, 'గానుగను బేరింగులు వేసి నడిపినట్లైతే, నోరులేని మూగజీవుల బాధను తగ్గించవచ్చుకదా ! ' అనే ఆలోచనతో ఈ విషయంపై శాస్త్రీయంగా పరిశోధన ప్రారంభించాడు. తత్ఫలితంగా, మోటారు టైర్లతో బండ్లు నడుపటం, బేరింగుల ద్వారా ఒరిపిడిని తగ్గించటం వంటి ఎన్నో సులభమైన పద్ధతులను ప్రవేశపెట్టారు. ఈ ఆలోచనలకు కార్యరూపం యివ్వడానికి సేవాగ్రాంలో వర్క్ షాప్‌ను నెలకొల్పారు. ఈ విధంగా, శాస్త్రీయ పద్ధతుల ద్వారా మూగజీవులైన పశువుల సంరక్షణ విషయంలో విపరీతమైన శ్రద్ధాశక్తులు కనపరచి, అందుకై అహర్నిశలు పాటుపడే భారతానంద్ గాంధీజీ ప్రేమాభిమానాలకు పాత్రుడైనారు. ఇట్లు, ఈ విధంగా భారతీయుల జీవకారుణ్య సిద్ధాంతానికి ప్రతీకగా ఆయన బాపూజీ హృదయంలో ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారు.

హింస మానసికమయినా, ముల్లుకర్రదయినా హింస హింసయే. దాని నివారణయే అహింస అని గుర్తించిన మహానుభావుడు. ప్రేమతో అతను పశుసంతతికి చేసిన సేవలు జీవకారుణ్యమే కాక అహింసలో ఒక భాగం.

★★★

# పశు సంరక్షణ

ఉదయం యథాప్రకారంగా సేవాగ్రాం గ్రామానికి నేను, సురేందర్ సఫాయి కార్యక్రమానికి పోయాము. అనుకోని విధంగా దారిప్రక్కన జనసమూహాన్ని చూడడమైనది. మేము గుంపులోకి దూసుకొనిపోయాము.

అక్కడ పశువుల వైద్యుని, ఒక ఆవును చూచాము. ఆవు ఈనలేక పోతున్నది. చాలా అవస్థలో ఉన్నదని మాత్రం మేము గుర్తించి, ఏమి సంగతి? అని అచటి పెద్ద మనుష్యులను, డాక్టరుగారిని అడిగాము. వారు ఆవు పరిస్థితి చెప్పి దూడను కోసి తీసివేస్తే కనీసం ఆవు అయినా బతుకుతుంది లేకపోతే ఆవు, దూడ రెండూ చనిపోయే ప్రమాదం ఉంది అన్నారు.

కాని, అలా చెయ్యడానికి బాపు ఏమి అంటారో అని వెనుకముందు ఆడసాగారు.

వెంటనే నేను, సురేందర్ బాపూ వద్దకు పోయాము. ఈ పరిస్థితి తెలిపాము. బాపూ దీర్ఘాలోచనలో పడ్డారు. తుదకు ''ఆవును రక్షించండి (గాయ్‌కో బచావ్), డాక్టరుని ఆయన వృత్తిధర్మం నెరవేర్చనీయండి'' అన్నారు.

డాక్టరుగారికి ఈ సంగతి చెప్పగానే అతనికి నెత్తిమీద నుంచి కొండను దించినంత అయింది. డాక్టరుగారు Amputation చేసి దూడను తీసివేశారు. తల్లిగోవు మాత్రం బ్రతికింది. గోసేవలో నాకిది యొక క్రొత్త అనుభవమయింది.

ప్రేమతో జరుగు శస్త్ర చికిత్స అహింసయే.



# ప్రేమభావంతో హింస

''ప్రేమభావం ద్వారా హింసా ప్రయోగం చేయడం ఎప్పుడైనను సాధ్యమా?''

**ఆవుదూడ పుండుతో ఉంది :** '' ఎప్పుడూ అది సాధ్యం కాదు. నేను స్వయంగా చేసిన ప్రయోగం నుంచి ఒక ఉదాహరణ చెపుతాను. ఒక ఆవుదూడ కంటిపై దుర్భరమైన పుండ్లతో బాధపడుతున్నది. అది ఆహారం తినలేక, ఊపిరి తీసుకోడానికి కష్టపడుతున్నది. నా అంతర్యంలోను నా అనుచరులతోను మూడు రోజులు వాదోపవాదాలు జరిపిన పిమ్మట, నేను దాని ప్రాణం అంతమొందించాను. ఆ దూడకు బాధానివృత్తి కావించడమే ఆ పనియొక్క ఉద్దేశం కావడం వల్ల అది కేవలం స్వార్థరహితమైన కార్యమవుతుంది; కావున అది అహింసాత్మకమైన కార్యమే అవుతుంది. అయితే కొందరు దానిని హింసాత్మకచర్య అని అన్నారు. నేను దానిని శస్త్ర ప్రయోగ చర్యగా అన్వయించాను. నా శిశువు సరిగా అట్టి సందిగ్ధ పరిస్థితిలో ఉన్నా కూడా నేను సరిగా ఆపనే చేయవచ్చునని అన్నాను. నేను ఉగ్గడించే సూత్రమేమిటంటే, అసింసాధర్మం మన జీవితానికి మూలసూత్రంగా భావించినప్పుడు తిరిగి వానిలో కొన్ని మినహాయింపులు కోరిన యెడల, అది నిరర్థకమయి పోతుంది.''

### అహింస నిర్వచనం

అహింస అంటే అందరి పట్ల విశ్వవ్యాప్తమైన ప్రేమ.

(యరవాడ మందిరం నుండి. 1957. పుట - 10)

★★★

ప్రేమలో దేవుడున్నాడు.

(దక్షిణాఫ్రికా సత్యాగ్రహం. 1950. పుట - 237)

★★★

భౌతికమైనది కాక పారమార్థికమైన ప్రేమ దేవుని చూపుతుంది.

(హరిజన్, 23-11-47, పుట - 425)

# పోలండు వనితల మానభంగం

ద్వితీయ సంగ్రామం మానవ కళ్యాణానికి, ప్రాథమిక హక్కుల రక్షణకై జరుగుతున్నదని యుద్ధనేతలు గంభీర ప్రకటనలు చేస్తూ వచ్చారు.

కాని యుద్ధాలెప్పుడు జరిగినా అశేషంగా ధననష్టం, ప్రాణనష్టంతోపాటు నిస్సహాయులు, అబలలు అయిన స్త్రీలు ఎందరో నరరూప రాక్షసుల పైశాచిక ప్రవృత్తికి బలి అవ్వటం తప్పలేదు. అట్టి నికృష్ట స్థితిలో స్త్రీలు తమ మానప్రాణాలు కోల్పోక తప్పడం లేదు. ఇటువంటి దుస్థితికి పోలండు వనితలు గురిఅయ్యారు.

మాన సంరక్షణ చేసే నాధుడు ఆనాడు పోలెండులో కన్పించలేదు. అది పోలెండువారి అసమర్ధత కావచ్చు లేక పరిస్థితుల ప్రాబల్యం కావచ్చు. ఇలాంటి క్లిష్ట దశలో గాంధీగారు సలహా తీసుకొందామని కొందరు పోలెండు వనితలు సేవాగ్రాం ఆశ్రమానికి వచ్చారు.

వారు జర్మనీ నియంత హిట్లర్ అమానుష చర్యలను, స్త్రీలపై జరుపుతున్న అఘాయిత్యాలను గూర్చి పూస గుచ్చినట్లుగా వివరించారు. అలా చెబుతున్నప్పుడు వారి కన్నీరు వరదలై పారింది. అప్పుడప్పుడు కన్నీరు తుడుచుకుంటూ, ''బాపూ, ఈ స్థితిలో మా కర్తవ్యం ఏమిటి?'' అని అడిగారు.

బాపూజీ దీర్ఘాలోచనలో పడ్డారు. కొంచెం సేపు ఆగి, భగవంతుడు మన ఆత్మ రక్షణకై కాళ్ళు, చేతులు, గోళ్ళు, బుద్ధిని, శారీరక శక్తిని యిచ్చాడు. వాటిని మనం యిలాంటి పరిస్థితులలో ఉపయోగించుకొని సద్వినియోగం చేసుకొని, మాన సంరక్షణకై యధాశక్తి ప్రయత్నించాలి. అలా చేసుకోలేకపోవటం మన బలహీనత అవుతుంది. ఈలోగా ఒక వనిత ''ఇది మీ అహింసా సిద్ధాంతానికి విరుద్ధంకాదా? '' అని ప్రశ్నించింది. దానికి సమాధానంగా, బాపూజీ యిలా అన్నారు ''పిరికితనంతో దుష్టులకు లొంగేదాని కన్నా, ఎదిరించి మనం మన సంరక్షణ చేసుకోవడంలో మరణించుట మంచిది కదా! ఇది మన కనీస ధర్మం కదా ! దీనిని పాటించకపోవటం మన పిరికితనం. ధైర్యంతో యిలాంటి దశలో చేసిన ప్రతిఘటన అహింసయే'' అవుతుందంటూ అహింసకు నిర్వచనం చెప్పారు. కాని అది బలవంతుల అహింస కాకపోవచ్చు కాని అది బలహీనుల అహింస మాత్రమే.



# ఒక వనిత సందిగ్ధావస్థ

ప్ర. దుండగులు అత్యాచారానికి తలపడ్డప్పుడు ఒక స్త్రీ ఏం చేయాలి? పరిగెత్తి పోవాలా, తిరగబడి ఘర్షణకు పూనుకోవాలా, పలాయానానికి పడవలను సిద్ధంగా ఉంచుకోవాలా, లేక ఆయుధాలతో ఆత్మరక్షణకు ఆయత్తం కావాలా?

స. ఈ ప్రశ్నకు నేనిచ్చే సమాధానం చాలా సులభమైనది. నా దృష్టిలో ప్రతిఘటనకు ఎటువంటి తయారీ అవసరంలేదు. ఉత్తమ తరగతి తయారీని ధైర్యంగా పెంపొందించుకోవాలంటే అహింసా మార్గమే ఉత్తమం. హింస పిరికితనానికి మాత్రమే ప్రతిగా మన్నింపబడుతుంది. కాబట్టి, అత్యవసర అపత్సమయంలో పారిపోవడానికి పడవను సిద్ధం చేసుకోండి. నిజానికి అహింసావాదికి అత్యవసరమనేది వుండదు. అయితే గౌరవప్రదంగా చనిపోవడానికి అతడు సిద్ధమౌతాడు. కాబట్టి, మగవాడయినా, ఆడవారయినా ఎటువంటి నిస్సహాయ స్థితిలోనైనా మృత్యువును కాదంటారు. ఎందువలనంటే నిజమైన సహాయం దేవుడి నుండి అందుతుది కాబట్టి. నేను ఆచరించే దానినే ప్రబోదిస్తాను. మరొక అంశాన్ని నేను చెప్పలేను. అటువంటి సందర్భం నాకు కలుగుతుందని, కలిగింపబడుతుందని నేననుకోవడం లేదు. స్త్రీలు దుండగుల చేతుల్లో చిక్కి అవమానింపబడేటప్పుడు ఆయుధాలు లేకుండా వారిని వారించలేరు. అట్లని వారిని ఆయుధాలు మోసుకొని తిరగమని మనం సలహా ఇవ్వనవసరం లేదు. వారే ఆ పని చేస్తారు. ఆయుధాలతో ఆడవారు వుండాలా? వద్దా? అనే దాని మీద నిరంతర చర్చ జరగడం కూడా అంత మంచిది కాదు. ప్రజలు సహజంగా స్వతంత్రంగా బ్రతకడం నేర్చుకోవాలి. నిజమైన ఎదురించడం అనేది అహింసలోనే వుంటుంది అనే మూల సత్యాన్ని జ్ఞాపకం పెట్టుకుంటే వారి ప్రవర్తనను, కార్యాచరణను దాని కనుగుణంగానే మలుచుకుంటారు. నిజానికి అనిర్దిష్టంగానైనా ప్రపంచమంతా అదే పని చేస్తున్నది. అహింసలో నుంచి పుట్టిన సాహసం గొప్పది కాదనుకోవడం చేత ప్రపంచం తనను తాను రక్షించుకోవడానికి

ఆటంబాబును కూడా ఆశ్రయిస్తుంది. హింస వలన కలిగే నిష్ప్రయోజనాన్ని గ్రహించలేని వాళ్ళు శక్తివంచన లేకుండా ఆయుధాలతో రక్షించుకోవడానికి ప్రయత్నం చేస్తారు. నేను దక్షిణాఫ్రికా నుండి తిరిగి వచ్చినప్పటి నుండి భారత దేశంలో అహింసా మార్గంలో తగినంత అవగాహనతో క్రమశిక్షణ నిరంతరంగా సాగుతోంది. దాని ఫలితాన్ని మనం చూచాం కూడా.

**ప్ర.** దుండగులకు లొంగిపోయిందానికంటే ప్రాణం తీసుకోవడం మంచిదని ఒక స్త్రీకి సలహా చెప్పగలమా?

**స.** ఈ ప్రశ్నకు ఒక స్పష్టమైన సమాధానం అవసరమే. నవఖాలికి నేను బయలుదేరే ముందు ఇటువంటి ప్రశ్నకే నేను సమాధానం చెప్పాను. ఒక స్త్రీ తనంతట తాను లొంగిపోయే దానికంటే తన ప్రాణాలను తప్పకుండా తీసుకుంటుంది. మరొక మాటలో చెప్పాలంటే నా జీవిత ప్రణాళికలో లొంగిపోవడానికి అసలు తావులేదు. కాని ఎవరైనా తన ప్రాణాలను తానే తీసుకోవాలంటే ఏ పద్ధతి నాశ్రయించాలి అను నన్ను అడిగారు. నేను తడుముకోకుండా సమాధానం చెప్పాను. ఏ విధంగా ఆత్మహత్య చేసుకోవాలో ఇతమిద్ధంగా చెప్పడం నాపని కాదు. ఏ పరిస్థితులలో ఏ విధంగా ఆత్మహత్య చేసుకోవాలో ఎవరికి వారే నిర్ణయించుకోవాలి. అయితే అలా ఆత్మ హత్యకు ఉపక్రమించే వ్యక్తికి తగినంత సాహసం, మానసిక స్థైర్యం ఉండాలని అంటారు. ఆ స్థైర్యంలో ఉన్న అంతర్గత పవిత్రత దుండగుడిని ఆ దుష్ట ప్రవర్తన నుండి దిగజార్చేంత బలంగా ఉంటుందని అంటారు. దీనిమీద ఇంతకంటె ఏమీ వాదించలేను. ఎందుకంటే అంతకంటే మరెవ్వరం ఏమీ చెప్పలేం కాబట్టి. దానికి తగినంత సాక్ష్యాధారాలు కావాలి కాని, నా దగ్గర అవి లేవు.

ఆత్మహత్యనో, దుండగులకు లొంగిపోవడాన్నో ఒకవేళ ఎన్నుకోవలసివస్తే, మొదటిది ఉత్తమమైనదని చెప్పటానికి నాకేమీ అనుమానం లేదు.

---

పల్లా – 27.1.1947 హరిజన్ - 9.2.1947 పు. 13.

(సమాజసేవా కార్యక్రమం – సంస్కరణ – ఎం.కె. గాంధీ . పు. 134)

హింసయా, భీరుత్వమా అని మీమాంస కలిగితే, హింసకే నీ ఓటు... అహింస, హింస కంటే చాలా గొప్పది. శిక్షించుట కంటే క్షమాగుణం ఎంతో ఉన్నతమైనది. శిక్షించే అధికారం లేనిచోట, 'క్షమ' ఒక విడంబన మాత్రమే.

(యంగ్ ఇండియా - 11-8-1920 పుట - 3)

అహింస, బలహీనుల చేతిలో, కొంతవరకు పనిచేస్తుందన్నది నిజమే. మేము బలహీనులమే. అది, ఒక తొడుగయితే మాత్రం సరికాదు. అంతకంటె హింస నయం. పలాయనం కంటె వీరమరణం ఉత్తమం. పశు ప్రవృత్తి నుంచి పరివర్తనశీలురమై, ఎంతో కాలానికి మానవులుగా ఎదిగాం. మనలో దైవాన్ని గుర్తించే శక్తి మన ప్రత్యేకత. గుర్తించిన దైవాన్ని అందరిలో దర్శించడానికి, జీవైక్యతను అవగతం చేసుకోవడానికి, పశుప్రవృత్తిని త్యజించి, నిద్రాణమైన అహింసను మేల్కొలపాలి. బలవంతులకే, ఇది సాధ్యం.

(హరిజన్. 2-8-1940, పుట - 126)

అహింస, భీరుత్వం, వ్యతిరేక పదాలు. మొదటిది అత్యుత్తమ సద్గుణం. రెండవది అతిహీనమైన దుర్గుణం. మొదటిది ప్రేమనుంచీ, రెండవది ద్వేషం నుంచీ ఉద్భవిస్తాయి. అహింస బాధపడుతుంది. భీరుత్వం బాధను కలుగజేస్తుంది.

(యంగ్ ఇండియా - 31-10-1929, పుట - 356)

అహింస భీరుత్వము తోడుగా చరించవు. ఆయుధ ధారికి మనసులో భయం ఉంటుంది. స్వచ్ఛమైన భయరాహిత్యం వినా, నిజమైన అహింస గగన కుసుమం.

(హరిజన్ - 15-8-1939, పుట - 201)

''తమరు అహింస-అహింస అని ఉపదేశిస్తున్నారు గదా! నేను మీ ముక్కు కోసివేసినా, మీరు అహింసావాదులుగానే ఉంటారో, ఉండరో చూడదలచుకున్నాను.''

గాంధీగారు నవ్వుతూ అన్నారు, ''ఇదేనా నీ సందేహం? ఒక్క ముక్కేం కర్మ! ఈ దేహం? ఈ శరీరమంతా నీకు అప్పగిస్తాను. ఎటువంటి సందేహం లేకుండా, నీ యిచ్ఛ వచ్చిన ప్రయోగం చేసుకో''.

ప్రేమభరితమైన గాంధీగారి మాటలు, విని ఆ కాబూలీవాడు చకితుడై పోయాడు. ఇంత నిర్భీతుడైన వ్యక్తిని వాడింతకు ముందు ఎప్పుడూ చూడలేదు. ఒక్క క్షణకాలం వాడు నిస్తబ్ధుడై నిలబడిపోయాడు. తరువాత ''మీరు సత్యము, అహింసపట్ల నిజమైన భక్తిశ్రద్ధలు కలవారని నాకు నమ్మకం కలిగింది. నన్ను క్షమించండి'' అని వెళ్ళిపోయాడు.

# చిక్కు ప్రశ్నలు

ఒక ప్రసిద్ధ కాంగ్రెసువాది ఈ క్రింది ప్రశ్నలు అడుగుతున్నారు :

''1. అహింసాదృష్టినుంచి ప్రస్తుత యుద్ధాన్ని గురించి మీ వ్యక్తిగతాభిప్రాయ మేమిటి ?

2. గత యుద్ధకాలంలో మీకు గల అభిప్రాయాలవంటిదేనా?, అందుకు భిన్నమైనదా?

3. ప్రస్తుత క్లిష్ట పరిస్థితిలో కాంగ్రెసు వైఖరి హింసా విధానం మీద ఆధారపడి ఉన్నది కదా. అహింసా విధానాన్ని అవలంబించే మీరు కాంగ్రెసుతో ఏ విధంగా సంబంధం పెట్టుకొని, సహకరించగలరు?

4. ఈ యుద్ధాన్ని నిలుపుచేయుటకుగాని, ప్రతిఘటించుటకు గాని అహింసా వాధానం ప్రకారం మీ స్పష్టమైన ప్రణాళిక ఏమిటి ?''

ఇప్పుడిక మొదటి ఉదహరించిన ప్రశ్నావళికి కొలది వాక్యాలలో ప్రత్యుత్తర మిస్తాను.

1. నా దృష్టిలో ప్రస్తుత యుద్ధం పూర్వపు యుద్ధం కంటె అత్యంత జుగుప్సాకరంగా గోచరిస్తున్నది. పూర్వ సందర్భంలో నా మనస్సు ఇప్పటంత నైరాశ్యపూరితంగా లేదు. ఈ యుద్ధంలో నాకు కలిగిన అధికతరమైన జుగుప్సాకరభావం మూలంగా గత యుద్ధంలో నేను ఇష్టపూర్వకంగా చేసినట్లు ఇప్పుడు యుద్ధభట సేకరణ కార్యకర్తగా పనిచేయలేను.

2. మొదటి ప్రశ్న యొక్క జవాబులోనే ఈ రెండవ ప్రశ్నకు జవాబు కూడా ఇమిడి ఉన్నదని తలుస్తాను.

3. హింసలోను, అహింసలోను కూడ హెచ్చు తగ్గు బేధాలున్నాయి. కాంగ్రెసు కార్యసంఘం అహింసా విధానాన్ని నిరసన భావం వల్ల విసర్జించలేదు. అహింసావిధాన గర్భితమైన తార్కిక పర్యవసానాలను కార్యసంఘం వారు పూర్తి మనస్సుతో ఆమోదించలేకపోయారు. కాంగ్రెసు సభ్యులైన వారిలో అత్యధిక సంఖ్యాకులు మన మీదకు విదేశపు దండయాత్ర వచ్చినపుడు కూడా అహింసా విధానం ప్రకారమే దేశ రక్షణ చేయవలసి ఉంటుందనే భావాన్ని అర్థం చేసుకొనగలిగినట్లు నాకు తోచలేదు. కేవలం బ్రిటీషు ప్రభుత్వాన్ని ప్రతిఘటించడానికి మొత్తం మీద అహింసాయుతమైన పోరాటాన్ని విజయవంతంగా కొనసాగించగలమనేటంతవరకు మాత్రమే వారు అలవరచుకున్నారు. ఉదాహరణకు వారు ఇంకా సాంఘిక వైషమ్య ఫలితమైన కొట్లాటలు, దుండగుల దౌర్జన్య చర్యలు తటస్థించినపుడు అహింసా విధానానుసారంగా తీసుకొనవలసిన చర్యల విషయంలో ఇంకా స్పష్టమైన మార్గాన్ని కనిపెట్టలేదు. దీనికి రుజువు మన వాస్తవికానుభవమే. అహింసా విధానం యొక్క విస్తృత ప్రయోగ విషయంలో నన్ను అనుసరింపజాలక పోయినందుకుగాను నా ఉత్తమ సహసేవకులను విడనాడిన యెడల, నేను అహింసా విధానము యొక్క అభ్యున్నతికి సహకరించినవాడిని కాను. వారు అహింసా విధానం నుంచి దూరమైతే అది బహుస్వల్ప పరిమాణంలోనే వుంటుందని, బహుస్వల్ప కాలం మాత్రమే జరుగుతుందని విశ్వసిస్తూ, నేను వారి సహచర్యాన్ని విసర్జించకుండానే వుంటాను.

4. ముందుగా తయారైన విస్పష్ట ప్రణాళిక ఏమీ నాకు లేదు. ఈ రంగం నాకూ క్రొత్తే. అయితే సాధనముల విషయంలో వ్రాయబడిన విడరాని భాగస్వామ్య పత్రంగా వర్తించగలదు. కాని నాకు అట్టి సర్వతోముఖమైన శక్తి లేదు. అహింసావిధాన మనేది బహు నెమ్మదిగా పెరిగే వృక్షం వంటిది. అది అదృశ్యంగా అయినప్పటికీ నిశ్చయంగా పెరుగుతుంది. అపార్థం పాలైనాగాని లెక్కించకుండా నేను నా నీరవమైన అంతర్వాణిని శిరసావహించి నడుచుకొనక తప్పదు.

సిమ్లాకు రైలు ప్రయాణంలో : 25-9-1939.

హరిజన్ : 30-9-1939.

# పట్టాభి - కళా

పట్టాభి గారిని అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్ష పదవికి గాంధీజీ ఎంపిక చేస్తారని తెలిసింది. ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సుభాష్ చంద్రబోస్‌ను సమర్ధించాలని నిశ్చయానికి వచ్చింది. అంతేకాక, పట్టాభి గారిని కాంగ్రెస్ అధ్యక్ష పదవికి నిలబెట్టవద్దని గాంధీగారికి విన్నవించాలని నిశ్చయించుకున్నారు.



గాంధీగారి అహింసా సిద్ధాంతానికి భాష్యకారుడిగా పేరుపొందిన వారు డా పట్టాభిగారు. వారిపట్ల అసంతృప్తిని తెలిపేందుకు ఒక రాయబారవర్గం కళా వెంకట్రావుగారి నాయకత్వంలో ఆంధ్రా నుంచి కలిసేందుకు వచ్చింది.

వారిని చూడగానే నేను, ప్రభాకర్‌జీ సంతోషంతో స్వాగతం పలికి నమస్కరించాము. కళా వెంకట్రావుగారు, వారి మిత్రులు బాపూను కలిసేందుకు టైము నిశ్చయము చేసి చెప్పారు.

బాపూతో ఏం మాట్లాడాలి? ఎవరు మాట్లాడాలి? మొదట ఏ విషయం చెప్పాలి? అనే అంశంపై రాయబారవర్గం వారు దాదాపు రెండు గంటలపైన చర్చించుకున్నారు. చిట్టచివరకు కళావారే బాపూతో మాట్లాడాలని ఏకగ్రీవంగా నిశ్చయమయింది. డా పట్టాభిగారికి కుడి భుజంవంటి వారు కళావారు. అట్టివారిని గాంధీజీ ప్రియ మిత్రులైనట్టి, స్వాతంత్ర్య సమరయోధులుగా, ప్రముఖవ్యక్తులుగా ప్రఖ్యాతులైనట్టి పట్టాభిగారిపై అసంతృప్తిని గాంధీగారి హృదయానికి హత్తుకొనేలా చెప్పగలిగే కార్యదక్షులు, అపర చాణుక్యులు కళావారు మాత్రమే నని వారందరూ భావించడమే దీనికి ముఖ్య కారణము. వారి చర్చలన్నీ ముగిసేసరికి సాయంత్రం అయింది.

అనుకొన్న విధంగా నిర్ణీత సమయంలో అసమ్మతి వర్గీయులను, కళావారిని తీసుకొని, ప్రభాకర్‌జీ బాపూతో సమావేశం ఏర్పాటు చేసారు. బాపూకు పెద్దలంతా

నమస్కరించారు. బాపూ వారినందరిని చిరునవ్వుతో పలుకరిస్తూ కూర్చోమని గౌరవించారు. వారంతా ఆశీనులైన పిమ్మట ఏమిటి సంగతి? అని ప్రశ్నించారు.

కళావారు తడబడుతూ, తటపటాయిస్తూ, 'అంత సంతోషకరమైన విషయం కాదు' అని నెమ్మదిగా పలికి, 'తమతో పట్టాభిగారి ఎన్నికల విషయమై విన్నవించడానికి వచ్చాము' అని అన్నారు.

ఆ మాటలు వింటూనే బాపూ బోసినవ్వు లొలకబోస్తూ, 'మీరు అతనికి శత్రువులా? మిత్రులా?' అని ప్రశ్నించారు.

'శత్రువుల' మంటే ఏమి ముప్పొస్తుందో, పైగా శత్రువులమంటే మాటకంత విలువ వుండకపోవచ్చునని భావించి కళావారు 'పట్టాభిగారు మాకు గౌరవనీయులు. మిత్రులకన్నా ఎన్నోరెట్లు మిన్న' అన్నారు. వెంటనే బాపూ 'అయితే మీరు మిత్రత్వంతో వారికి తగు సలహాలిచ్చి సరిదిద్దవచ్చుకదా!' అని ఎదురుప్రశ్న వేశారు.

కళావారికిగాని, రాయబారవర్గానికి గాని ఏమి బదులివ్వాలో తోచలేదు. అలాగే బాపూ ప్రయత్నిస్తామని లేవబోయారు. బాపూ వారి ముఖాలలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్న నిరాశామేఘాలను చూశారు. వెంటనే వారితో, 'మీరు చెప్పదల్చుకొన్నది సంపూర్ణంగా, క్లుప్తంగా కొద్ది సమయంలో చెప్పండి' అని అన్నారు.

బాపూ-కళావారి సంభాషణను, బాపూ చాకచక్యాన్ని గూర్చి పదేపదే చెప్పుకుంటూ నేను, ప్రభాకర్‌జీ తన్మయులమయ్యేవాళ్ళం.

జటిలసమస్యను సరళం చేయడంలో, ఎదుటివ్యక్తిని నొప్పించకుండా, తాను బాధపడకుండా తన సంభాషణా చాతుర్యంతో అందరినీ మెప్పించే విధంగా ప్రవర్తించడంలో బాపూ ఆయనకు ఆయనే సాటి. కాబట్టే, భారతజాతినంతటిని ఒకే త్రాటిపై నడిపించి జాతిపిత కాగలిగారు.

బాపూ దృష్టిలో సత్య పరిశీలన కూడా అహింసలో ఒక భాగమని, సత్యమే అహింసకు పునాదని వారు భావించేవారు. బాపు 'అభిప్రాయబేధాలుంటే శత్రుత్వం కాదని అది నిజమైతే నేను నా భార్య బద్ధ శత్రువులమై ఉండాలి' అని చెబుతూ, పట్టాభిగారు మీ స్నేహితుడే కదా ! అని నవ్వుతూ సంభాషణ ముగించారు.



అభిప్రాయ భేదం, శత్రుత్వం కాదు. నాకు అట్టి వారు మిత్రులు.

(యంగ్ ఇండియా. 17-3-'27. పుట - 82)

ప్రపంచమంతా ఎదురెత్తి వచ్చినా, మనని మనము రక్షించుకోగలిగిన సామర్థ్యమే, ''స్వరాజ్'' సాధనకు కావలసిన ప్రశిక్షణ. ఇది మొదలయితే, అన్నీ అనుసరిస్తాయి. దోషపూరితమైన, మన జీవితాలను స్వేచ్ఛగా గడుపగలగటం కూడా ఎంతో ముఖ్యం. మన తప్పులను మనమే అనుభవం మీద సరిదిద్దుకోగలము. స్వపరిపాలన, మంచి పరిపాలన కంటే మేలు. కనుకనే ''స్వరాజ్'' ను సాధిద్దాం.

(యంగ్ ఇండియా. 30-7-'31, పుట - 199)

హింస వలన స్వరాజ్ ఎప్పటికీ సిద్ధించదు. ప్రతి హక్కులను అణగద్రొక్కి, నాశనం చేస్తే వ్యక్తి స్వాతంత్ర్యం రాదు. అది కల్తీలేని అహింసవలననే సాధ్యం.

(హరిజన్. 12-11-'38. పుట - 328)

''స్వరాజ్'లో, స్వ-రక్షణ పెంపొందించుకుంటాం.

(యంగ్ ఇండియా. 22-9-'20. పుట - 1)

# చాకచక్యమైన సమాధానం

**నా డైరీ :**

'భగవంతుడు నేను తీసుకునే నిర్ణయాలకు అమలు పరచడానికి శక్తి ప్రసాదించుగాక' అనే వాక్యంతో నా సేవాగ్రాం డైరీ రాయడం ప్రారంభమయింది. అందులో నా దినచర్య పొందుపరచబడింది. అనుకోకుండా పాత పుస్తకాలు తిరుగవేస్తుంటే ఈ డైరీ దొరికింది. బాపూ దినచర్య వ్రాయమనే వారు. మా డైరీ చూసేవారు. దానిపై అభిప్రాయం చెప్పేవారు. ఆ డైరీ పోలీసులకు పట్టుపడుతుందని వ్యవధిలేక 1942లో తగులపెట్టాను.

కాని,అందలి ఒక ఘట్టం నాకు బాగా జ్ఞాపకం. దీనిని బట్టి, బాల్యదశలోని చిలిపితనానికి, వాస్తవానికి, పెద్దరికానికి ఆలోచనా విధానంలో ఎంత తేడా ఉంటుందో అంచనా వేయవచ్చు.

**తీరని అనుమానాలు :**

బాపూ ! గంగానది మున్నగు అన్ని నదులు చాలా పవిత్రమైనవి. అయినా, కొందరు తెలిసో, తెలియకో, దేహ బాహ్య వత్తిడివల్ల మలమూత్రాదులు ఈ నదులలో వదులుతూ వుంటారు కదా. ఇది పాపమా ? పుణ్యమా? తేల్చడం ఎలా? అని వ్రాశాను.

**పెద్దలు చెప్పుట :**

దీనికి జవాబుగా బాపూజీ ''బడే ఢంగ్‌సే లిఖే హై'' చాలా చాకచక్యంగా వ్రాశారు అన్నారు.

ఈ జవాబువల్ల నా ప్రశ్నకు సమాధానం నేనే తేల్చుకోవాల్సివచ్చింది. ఇదే బాపూజీ గొప్పదనం.

కొన్ని ప్రశ్నలకు ఆయన జవాబునీయక పోవడంలోనే ఆయన జవాబు నిచ్చినట్లవుతుంది. అది ఒక కళ. అందరికీ చేతకాదు.

బాపు మౌనం ఆత్మపరిశీలనకు, సత్యాన్వేషణకు తగు జిజ్ఞాస పెంచింది.



# బాపూ - మొండితనం



సేవాగ్రాం ఆశ్రమానికి ఎదురుగా ఒక పెద్ద వృక్షముండేది. ఆ వృక్షం క్రింద పంత్‌జీ అనే పోలీసు కానిస్టేబుల్ ఉదయం 8 గంటల నుండి సాయంత్రం 5 గంటల దాకా పెట్టె చరఖాతో దారం తీస్తూనే వుండేవాడు. ఒక మధ్యాహ్నం మాత్రం భోజనానికై పోయేవాడు.

అతని దగ్గరకు వచ్చిన వారందరికి చరఖాపై దారం తీసి ఖద్దరు కట్టాలని ప్రచారం చేసేవాడు. మన దేశాన్ని మనం గౌరవించాలంటే మన ఖద్దరు మనం వాడాలి. ''హమారా ఖాదీ హమ్ పెహెన్‌నా హై'' అని బల్లగుద్ది చెప్పేవాడు.

అతనికి యింత విశ్వాసం ఖాదీపై ఎలా కల్గిందో తెలియదు. అంతేకాదు. పెద్ద చదువు రాకపోయినా అంతటి దేశభక్తి, అంకితమయ్యే స్వభావం పూర్వజన్మ సుకృతమే అనుకోవాలి. స్వదేశీ-స్వదేశీ అనే పదం, ఆ మహా వటవృక్షంక్రింద జపం చేసే పంత్‌జీ ధన్యజీవి.

పంత్‌జీ విషయం బహుశా ప్రభాకర్‌జీ అనుకుంటాను బాపూకు అందజేశారు. అది తెలిసిన మీదట బాపూ వ్యాహ్యాళికి పోతూ అతను చరఖాపై నూలు తీయడం చూశారు. అతని పట్టుదలను, చరఖాపై విశ్వాసాన్ని చూచి చాలా ఆనందపడ్డారు. అతనిని మెచ్చుకున్నారు. పంత్‌జీ సహితంబాపూ తన పనిని గుర్తించినందుకు, తగు ప్రోత్సాహమిచ్చినందుకు చాలా ఆనందభరితుడయ్యాడు.

రోజులు గడిచాయి. వచ్చేవారు, పోయేవారు, ఆశ్రమవాసులు అతనిని మెచ్చుకోసాగారు. పంత్‌జీ కూడా ఆనందసాగరంలో మునిగిపోయాడు. కొంతకాలమయిన మీదట బాపూ పంత్‌జీని చూడడానికి వెళ్లారు. చరఖా తీయడంలో అతని *style*, ఊపు, మాటలు బాపూకు నచ్చాయి.

'ఈ స్వదేశీ ప్రచారం అలాగే కానీ' అన్నారు. బాపూ ముందుకు సాగారు. ఇంతలో పంత్‌జీ, 'బాపూ, నాదొక గుజారిషు(విన్నపము) వున్నది' అన్నాడు.

బాపూ, 'ఏమిటి' అన్నారు. 'నన్ను ఆశ్రమ మెంబరుగా చేర్చుకొమ్మని' పంత్‌జీ విన్నవించాడు. బాపూ అందులకు అంగీకరించలేదు. పంత్‌జీ నిరుత్సాహపడ్డాడు. బాపూపై కోపగించుకున్నాడు. కొంత ఏవగింపు కూడా కనపరచాడు.

చివరకు తనను ఆశ్రమంలో చేర్చుకొనేంతవరకు ఉపవాస దీక్ష పూనుతానన్నాడు. దీక్ష పూనాడు.

రెండువారాలు దాటిందనుకొంటాను. పంత్‌జీ మొండితనం వదలలేదు. బాపూ అంతకన్నా మొండిగా వుండిపోయారు. ఆశ్రమవాసులందరూ బాపూ పంత్‌జీ కోర్కెను మన్నించడంలో వచ్చిన నష్టమేమిటని, ఎంతోమంది తినిపోతున్నారని అనుకోసాగారు.

బాపూ మాత్రము స్వార్థపూరితమైన ఉపవాసానికి శిక్షేగాని, ఫలితంగాని ఉండదని ఒకదశలో అడిగిన వారికి జవాబు చెప్పారు. చివరకు ఆశ్రమవాసులందరూ కలిసి పంత్‌జీ దీక్షను విరమింపజేశారు.

బాపూ మొండితనానికి ఇది యొక తార్కాణము. సత్యాహింసలపై ఆధారపడి యున్నదే సత్యాగ్రహం. స్వార్థరహితమైనదే సత్యస్వరూపమైన సత్యాగ్రహం.

---

''బాపు మొండితనం విషయమై మనం ఎంత తక్కువగా చెప్పుకుంటే అంత మంచిది. ఆయన యెప్పుడూ తన పంతమే నెగ్గాలంటాడు. ఎప్పుడూ ఆయన పద్ధతి ఆయనదే. జోహాన్స్ బర్గులో నున్నప్పు డొకసారి ఆయన యింటికి వచ్చినప్పుడు నేనింకా వంటయింట్లో పనిచేస్తూ వున్నాను. అప్పటికి వంట తయారు కానందున ఆలస్యానికి కారణం అడిగినాడు. నిర్ణీత వేళకు పొయ్యిలోని నిప్పును ఆర్పివేసి ఉండవలసిందన్నాడు. అంతటితో తృప్తి చెందక పొయ్యిలో నీళ్ళుపోసి నన్ను వంటచేయకుండా ఆటంకపరచినాడు. బాపు యే పనిగాని పూర్తిచేయడంలో ఒక్క క్షణం ఆలస్యమైనా సహించడు. ఎక్కడనైనా మురికి మచ్చగాని, మాసికగాని కనపడితే ఊరుకోడు. అందుచేత ఆయన విషయంలో మనమెప్పుడూ జాగరూకులమై మెలగవలసి వుంటుంది.''

– కస్తూరిబా.

# సబర్మతి సేవాగ్రాం ఆశ్రమ స్థాపన

గాంధీజీని, గాంధేయ సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలనే అభిలాష మనకు కలిగినపుడు గాంధీజీ ఎచట ఎచట వుండి ఈ వన కార్యక్రమాలను నిర్వహించింది తెలుసుకోవాలనే కుతూహలం ఉండడం సహజం.

వసిష్ఠ, విశ్వామిత్రాది ఋషులు ప్రకృతి శోభాయమయమైన ఆశ్రమాలు నిర్మించుకొని నివసించారు. ఆధ్యాత్మికత ప్రబోధించారు. సత్యాన్వేషణకు కావలసిన తపస్సు చేసి ఆత్మోన్నతి పొందారు. ఆ ఆశ్రమాలలో తపశ్శక్తి యిమిడివుంది. రాజులు, రాజ్యాధికారం వారి ఆశీశ్శులు కాంక్షించేది. కాని వారు రాజుల, రాజ్యాధికారం సహాయం వారిని అడుగలేదు. ఒక్కోసారి ధర్మస్థాపనకై రాజులను, రారాజులను ధర్మసంస్థాపనకై, దుష్టశిక్షణకై, శిష్టరక్షణకై తగు మార్గాలు చూపించినారు.

ఈ ఆశ్రమాల భూమికతోనే కాబోలు బాపు అహమ్మదాబాదులో సబర్మతి ఆశ్రమం ఏర్పరచారు. తరువాత అనుభవాన్ని పట్టి, పట్టణములో ఉండి గ్రామ ప్రజలకు సేవ, మార్గదర్శకత్వం కష్టమని గుర్తించారు. ఈ అభిప్రాయం వచ్చినమీదుట వారు సేవాగ్రాం, గ్రామ పరిసరాలకు చేరారు. క్రమేణా తగ్గుముఖం పడుతున్న రాజకీయ, ఆర్థిక స్థోమత, నైతిక శక్తిని సవరించ ప్రయత్నించాడు. అదే గాంధీ ఆశయం. ఈ ఆశయంతో పాటు ఆత్మోన్నతికి సత్యస్వరూపమైన బ్రహ్మను గుర్తించే సాధనా కేంద్రమని ఆయన అభిప్రాయము.

★★★

# సబరమతి - సేవాగ్రాం

## సత్యాగ్రహ ఆశ్రమములు

**బాపూజీ ఏకాదశ సూత్రాలు :**

బాపూజీ తన ప్రార్ధనానంతరం, దీక్షగా పునశ్చరణ చేసే ఈ ఏకాదశ సూత్రాలలోని సత్యాన్ని గ్రహించేందుకై తన పద్ధతిలో సర్వ విధాల యత్నించారు.

ఇందుకై తగు శిక్షణ యిచ్చుటకై 25 మే 1915 అహమ్మదాబాదు వద్ద వున్న కొక్రరచలోని, ఆ తరువాత 1935 వార్ధాకు 5 మైళ్ల దూరంలో వున్న సేవాగ్రాంలో ఆశ్రమాలు నెలకొల్పారు. గ్రామాలకు ప్రాముఖ్యత ఇవ్వాలనే ఉద్దేశ్యంతో అహమ్మదాబాద్ సబరమతి ఆశ్రమం వదిలి వార్ధాకు దగ్గరలో ఉన్న సేవాగ్రాం ఆశ్రమం నెలకొల్పారు.

వీటికి సత్యాగ్రహ శిబిరాలని వారు నామకరణం చేశారు.

**ఆశ్రమ స్థాపన ఉద్దేశాలు :**

పెద్దలు రచించిన గ్రంథాలలోని అనేక అంశాలపై, దీర్ఘాలోచనలు, చర్చలు, మీమాంస జరిపి అందలి సత్యాన్ని గ్రహించే యత్నాలు ఈ ఆశ్రమంలో జరిగేవి.

ఉదాహరణగా శ్రమదానం యొక్క అంతరార్ధము, ఆచరణలోని విధానాన్ని గూర్చి జరిపిన ప్రయోగాలు ఈ ఆలోచనలకు మచ్చుగా పేర్కొనవచ్చు.

'బ్రతకాలంటే శ్రమించాలి' అనే టాల్‌స్టాయి రచన.

'తిండి కలిగితే కండ గలదోయి' అనే రష్యన్ ప్రభోదం.

'శ్రమదానం చేయక తింటే అది చౌర్యం' అనే గీతాప్రవచన అంతరార్థం.

ఈ ఆశ్రమాలలో విశదీకరించి బోధించడం జరిగేది.

దైనందిన కార్యక్రమ విధానంలో మానవసేవకై అఖిల భారత చరఖా సంఘం, అఖిల భారత గోసేవా సంఘం యిత్యాదివి నెలకొల్పబడ్డాయి. ఖాదీ ఉత్పత్తి జరిగింది. గోసంతతి పెరిగింది. పశుసంరక్షణకు ప్రాధాన్యత వచ్చింది. గ్రామ పరిశ్రమలు వృద్ధి చెందాయి.

ఈ పరిశ్రమల ద్వారా శ్రమదానం ప్రాముఖ్యత, తిండి, బట్టలాంటి వసతులు ప్రజల కందుబాటులో ఉంచబడ్డాయి. - మహాత్మాగాంధీ రచనలు సం. 1 పేజీ. 354.

# బజాజ్

## బాపు ఐదవ కుమారుడు

వ్యక్తి సత్యాగ్రహం 1941లో బాపు ప్రారంభించాడు. ఈ సత్యాగ్రహం విషయంలో కాంగ్రెసు కార్యవర్గంలో అభిప్రాయ భేదం లేకపోలేదు. కాని గాంధిజీ నాయకత్వంలో ఈ సత్యాగ్రహం జరగాలనే విషయంలో మాత్రం బేధాభిప్రాయం లేదు. కాంగ్రెసు అధిష్టానవర్గంలో పులువురు గాంధీజీతో ఏకీభవించారు.

గాంధీజీ మనకు అహింస మీద సంపూర్ణ విశ్వాసమున్న కార్యకర్తలు దొరికితే సత్యాగ్రహ పోరాటం విజయవంతమవుతుంధని ఆయన దృఢ విశ్వాసం. కొండా వెంకటప్పయ్యగారికి మార్చి 1922న వ్రాసిన లేఖలో ''30 కోట్ల మంది ప్రజలను అహింసావాదులను చేయడం కష్టమని నేను అంగీకరిస్తాను. కాని అసంభవమని నేనంగీకరించను'' అని దృఢవిశ్వాసాన్ని వెలిబుచ్చారు.

అందుకనే అహింసపై నమ్మకమున్న వినోబాజీ తోటివారిని వివిధ ప్రాంతాలనుండి ఎంపిక చేశారు.

వ్యక్తి సత్యాగ్రహాన్ని జయప్రదము చేయడానికి అందలి సత్యాన్ని ప్రపంచానికి చాటటానికి పెద్దగా జనాన్ని ప్రోగు చేయగలిగేవారు అవసరం లేదు. లక్ష్యసిద్ధి కలిగి, విశ్వాసపాత్రులైన కార్యకర్తలున్న చాలని పలుమార్లు వక్కాణించారు.

ఈ పరంపరలో బాపూజీ జమునాలాల్ బజాజ్‌ని కూడా వరుస క్రమంలో పరిగణించారు.

వ్యక్తి సత్యాగ్రహం బజాజ్ ఏరోజు చేస్తాడో చూడాలని మిత్రులు, ప్రేమికులు పదేపదే బజాజ్ ధర్మపత్ని జానకిదేవిని అడుగసాగారు. ఆవిడ బాపుకు తెలుసు. ఆయనకు ఆనతినిచ్చు రామునకే తెలుసు అని జవాబు చెబుతూపోయింది.

ఒకరోజు బజాజ్ తెల్లవారేసరికి సేవాగ్రాంలోనే సత్యాగ్రహం చేస్తారని ఆ పరిసరాలలో పాకింది.

వారి అనుయాయులు బజాజ్ సత్యాగ్రహం చూచేందుకుగాను వచ్చేవారికి ముందుగా అందరికి ధలియా (గోధుమ జావ; బెల్లంతో చేసి) విందు చేసేందుకు యత్నాలు చేసారు. అందుకుగాను రవ్వ, బెల్లం, గుండిగాలు సేవాగ్రాం ఆశ్రమానికి సాయంత్రానికల్లా చేర్చబడ్డాయి. అవన్నీ భోజనశాలకు దగ్గరగా వరుసక్రమంలో ఉన్నవి.

బాపూ సాయంత్రం భోజనానికి పోతూ ప్రక్కనున్న ప్రభాకర్‌ను ఇవన్నీ ఏమిటి? నీ పెండ్లా ? అని అడిగారు.

ప్రభాకర్ బజాజ్ సత్యాగ్రహం రేపుందని అందరు అనుకుంటున్నారు అని అన్నారు.

బాపూ నవ్వుతూ, 'నాకు నా రామునికి తెలియనిది బజాజ్‌కి ఎలా తెలిసింది' అని అన్నారు.

ఈ సంభాషణ అచటి ప్రజలకు కొంత ఆశ కలిగించింది. సహచరులు ధలియా తయారు చేయాలో, లేదో తెలియక అవస్థ పడుతున్నారు. ఇంతలో తెల్లవారింది. పోలీసులు తెల్లవారక ముందే బజాజ్‌ని అరెస్టు చేసి తీసుకుపోయారు. చివరకు జానకీదేవికి కూడా ఈవిషయం జరిగిన మీదట తెలిసింది. నిరాడంబర జీవనాన్ని గడిపే అలవాటున్న గాంధీజీ అయిదవ కుమారుడని పేర్కొనబడిన బజాజ్‌ని, గాంధీజీని ఆడంబరం ఎలా వరిస్తుంది? వరించినా దానిని తిరస్కరించకుండా ఎలా వుండగలరు. ఆయన సత్యపథంలో తగిన వ్యక్తి దొరకాలి గదా !



# సత్యాన్వేషణ

సబర్మతి సెంట్రల్ జైలు
మంగళవారం రాత్రి
16.3.1922.

జమునాలాల్ బజాజ్‌కు,

సత్యం కొరకు అన్వేషిస్తున్న నాకు అంతా సత్యంగానే కనపడుతున్నది. అది అహింసతో లేదు. అహింసయే దానిలో ఉన్నది. పదాతీతమైన హృదయం, బుద్ధి దానిని దర్శించగలవు. అవి దర్శించిననే సత్యం, కాని అహింసను గురించి వివరించడం కొంచెం కష్టం. రోగాణువుల నాశనం హింస కాని అది చేయక తప్పదు. ప్రపంచం హింస మధ్యన అహింసాత్మక జీవనం గడపాలి. అది మన స్థితి ఆవిధంగా సత్యాన్వేషణ నుండి అహింసను వేరు చేస్తున్నానను. సత్యం వలన ప్రేమ సౌకుమార్యం, నమ్రత వంటివి ఏర్పడుతవి. బ్రహ్మతత్వం జగన్మిథ్యం అనే సూకితని రోజు రోజు నేను వర్తింపచేసుకుంటున్నానన. అది మనకు సహనాన్ని బోధిస్తుంది. మనలోని కాఠిన్యాన్ని పోగొడుతుంది. మనలోని లోపాలను చిన్న చిన్న మచ్చలుగా చూపుతుంది. అహంతో శరీరముంటుంది. దాని నాశనమే మోక్షం, అది సత్యస్వరూపం. అదే బ్రహ్మ. అందువలన భగవంతునికి గల అత్యద్భుతమైన పేరు దాసానదాస.

భార్య పిల్లలు, స్నేహితులు, ఆస్తులు అన్ని సత్యం ముందు నిలువలేవు. సత్యాన్వేణతో వాటి నన్నిటిని విసర్జించవచ్చును. అప్పుడావ్యక్తి సత్యాగ్రహి కాగలడు. ఈ సిద్ధాంతాన్ని అనుసరించవలెనని ప్రయత్నిస్తున్నాను. అందుకే మీవంటి వారిని దీనిలోనికి దింపుతున్నాను. ఇది గాంధీ స్వరాజ్యఫలితం. అట్టి సత్యాగ్రహులు ఇంకా దొరకలేదు కనుక స్వరాజ్యప్రాప్తికి ఆలస్యమవుతున్నది. నీవు నా అయిదవ కుమారుడివి. నిన్ను అందుకు తగిన వాడిగా చేయాలి. అది అంత తేలిక కాదు. భగవంతుని సహాయం కాంక్షిస్తూ,

ఆశీర్వచనలతో,

బాపూ.

## భోజనశాలలో భగవన్నామస్మరణ

ఓం సహనా భవతు సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై తేజస్వినా వధీతమస్తు
మావిద్విషావహై ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

**అస్వాదవృత్తి :**

బాపూ ఏకాదశ నియమాలలో 'అస్వాదవృత్తి ఒకటి ?' బ్రహ్మచర్య పాలనకు జిహ్వ, రుచి గ్రహణ విషయాల గురించి అదుపు అవసరం. దానితో కామవాసనారాహిత్యం సుకరమవుతుంది. దీన్ని గురించి ఆనాటి మహర్షులు కూడా చెప్పలేదు. అవి ఆశ్రమ నియమాలలో దీని విషయం గూర్చి శ్రద్ధ చూపడం జరిగింది. భోజన సమయంలో పై మంత్రాన్ని ఆశ్రమవాసులు పఠించేవారు. ఆశ్రమ భోజనం రుచిగా వుండేది కాదు. కారణం బాపు అస్వాదవృత్తి పాటించడంపై వారికి గల అభిప్రాయం.

**రుచిలేని ఆహారం తినాలి :**

రుచిని తృప్తి పరచేందుకు కాకుండా ఔషధంలాగా శరీర అవసరాలు తీర్చడానికి, రుచితో పనిలేకుండా ఆహారం తినాలి. ఔషధంలా తగిన మోతాదు మరచి తక్కువగా లేక ఎక్కువగా ఆహారాన్ని తీసుకుంటే తిప్పలు తప్పవు. ప్రియమైనది ఎక్కువగ తినడం, రుచికోసం ఉప్పు వేయడం మున్నగునవి నియమ భంగమే. ఆరోగ్యదృష్ట్యా - కనీసపు జోడింపులు, తగ్గింపులు పరవాలేదు. కాని ఆ మిషతో రుచులకు బానిస కావడం డంబాచారం. రోజంతా తిండి ధోరణి పనికిరాదు. జాగరూకత వుంటే భోష ఆస్వాదన తప్పుతుంది. శరీరం కోసం మాత్రము కావలసిన తిండి నిలబడుతుంది. కనుక రుచిభోగం, స్వాదు అనుభూతిని పరిహరించాలి.

**ఆదర్శరాజ్యంలో సూర్యుడే వంటవాడు :**

ఆదర్శరాజ్యంలో సూర్యుడే వంటవాడు కావాలి. కాని ఆరోజు చాలా దూరంగా వున్నది."[2]

1. మహాత్మాగాంధీ రచనలు - సం.3, పే. 196
2. మహాత్మాగాంధీ రచనలు - సం.3, పే. 197

# చెడు దస్తూరి కూడా ఒక వరమే

## ప్యారేలాలు

**కార్యాచరణ లక్ష్యాలు :**

కార్యాచరణలో ధైర్యస్థైర్యములు, ఆత్మ విశ్వాసము ఎంతైనా అవసరము. ఈ త్రివిధ లక్షణములకు తోడు ఆత్మ పరిశీలన ఉన్నచో వ్యక్తి సాధించలేనిది యేమి యుండదు.

గాంధీజీకి మహాదేవ దేశాయి, ప్యారలాల్‌జి యిరువురు కార్యదర్శులు.

మహాదేవ దేశాయి కలము పెట్టి వ్రాసినచో దానిలో తప్పు లేదని భావించు మనస్తత్వము. అతని ఆత్మ విశ్వాసమే అతని ఆలోచనకు, వ్రాతలకు తగు రూపకల్పన ఇవ్వగల్గేది. అతను ఈ విధంగా భావించే వాడో లేదో తెలియదు. కాని వారి విషయంలో పలువురు అనుకునే మాట యిది.



ప్యారేలాల్‌జీ మాటకు, ప్రతి అక్షర సౌందర్యమునకు చాలా ప్రాముఖ్యత యిచ్చేవాడు. ఆ కారణంగా యేదైనా వ్రాయవలసి వచ్చిన ప్రతిమాట ఆచితూచి వ్రాసేవాడు. ఆ కారణంగా ఏదైనా స్టేట్‌మెంటుకాని, వ్యాసముకాని వ్రాయవలసి వస్తే సహజంగా కొంత ఆలస్యం అయ్యేది. కాని అందులో అక్షర సౌందర్యం వుండేది. విమర్శనకు తావు వుండేది కాదు.

# టర్నర్ ప్రిన్సిపాలు

**వార్ధా స్టేషను ప్రాముఖ్యత :**

బాపూజీ సేవాగ్రాంలో వుండేవారు. సేవాగ్రాం వార్ధాకు 8 మైళ్ల దూరంలో ఉంది. ప్రస్తుతానికి రైలు స్టేషను కూడా ఏర్పడింది. మద్రాసు నుండి ఢిల్లీ పోయే గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ వార్ధా స్టేషనులో ఆగేది. వార్ధా పోవడానికి, రావడానికి దక్షిణ, ఉత్తరాది వారికి అందుబాటులో వుండేది.

నేను హైద్రాబాదులో నిజాం కాలేజీలో చదువుకున్నాను. మా ప్రిన్సిపాలు టర్నరుగారు.

**ప్రిన్సిపాల్ టర్నర్ – యుద్ధంలో భాగస్వామి :**

1938లో -ద్వితీయ ప్రపంచ సంగ్రామం ఛాయలు ప్రపంచాన్ని కమ్ముకున్నాయి. మా ప్రిన్సిపాలు టర్నరు ప్రథమ ప్రపంచ యుద్ధంలో పాల్గొన్నారు. ఆ కారణంగా, ద్వితీయ సంగ్రామం ప్రారంభం కాగానే తిరిగి సర్వీసులోకి ప్రభుత్వం రప్పించుకొంది. ఆ తరువాయి ఈశాన్య సరిహద్దులలో యేదో పనిపై బ్రిటిష్ ప్రభుత్వం వారిని నియమించింది. ఈశాన్య సరిహద్దుల నుంచి దక్షిణానికి ప్రయాణం చేస్తూ వార్ధా స్టేషనులో టర్నర్‌గారిని కలిసిన సంఘటన కూడా మరువలేనిది.

**రాజేంద్ర ప్రసాద్‌కు స్వాగతం :**



అదే రోజున సేవాగ్రాం ఆశ్రమం తరఫున బాబు రాజేంద్ర ప్రసాదుగారికి స్వాగతం పలికి, వారిని నిర్మాణ కార్యకర్తల సమావేశానికి తీసుకు వెళ్లడానికి నేను వార్ధా స్టేషనుకు వెళ్ళాను.

*Raja you are here - you are here* - తెల్లవాని కేకలు :

వార్ధా స్టేషనులో రైలు ఆగేందుకు నెమ్మదిగా పోతున్నది. మా ప్రిన్సిపాలు దృష్టి నాపై ఎలా పడ్డదో పడ్డది. ''యూ, రాజ్, యు ఆర్ హియర్'' అంటూ కేక వేశారు. నేను నివ్వెర పోయాను. బ్రిటిషువారికి వ్యతిరేకంగా 1941లో యుద్ధ వ్యతిరేక నినాదాలిస్తూ వ్యక్తి సత్యాగ్రహం చేస్తున్న రోజులవి. ఒక తెల్లవాడు నాకై కేకలు వేయడం నాకు ఊహించని పరిస్థితి అయింది. రైలు ఆగగానే అమాంతం నా నడుముపై చేతులు వేసి పైకి ఎత్తి, ''హి ఈజ్ మై బాయ్'' ఇతను నా పిల్లవాడు, నా కాలేజి పిల్లవాడు అంటూ, తోటి రైలు పెట్టెలో వున్న సిపాయీలకు పరిచయం చేసి, వారందరికి ఆనందంతో విస్కీ త్రాగించి, అతను పొందిన సంతోషము నేనెన్నడు మరువలేను.

ఉపాధ్యాయ విద్యార్థి సంబంధం రాజకీయాన్ని మించింది :

తన దేశానికి వ్యతిరేకంగా పోరాడుతున్న రోజులలో కూడా ప్రిన్సిపాలుగా వున్న ఒక తెల్లదొర అతని విద్యార్థిని గుర్తించి, గౌరవించి, కౌగలించుకొని ఆనందంతో పొంగటం నేనూహించని సన్నివేశమది. ఉపాధ్యాయ విద్యార్థుల సంబంధాలకు ప్రాధాన్యతను, గౌరవాన్ని ఇచ్చిన రోజులవి. ఇదే దశలో మన వారే వుంటే ఏ విధంగా వుండేదో మనం ఊహించుకోవచ్చు.

ఇలా పొంగిపోతున్న ఆనంద ప్రవాహ వాతావరణంలో నేను ఏమి చెప్పాలో తోచలేదు.

*Soharab and Rustum* :

చివరకు, *"Sir, I have not forgotten your lesson and teaching of the poem Soharab and Rustum where you spoke of the Bag Piper of Scotland that led to the Victory of yours."*.

దీనికి అతను ఎంతగానో స్పందించాడు. *"You see, here is my boy"* చూడండి. ఇతనే నా పిల్లవాడు. అని గర్వించి, వీపు తట్టి నన్ను వదలలేక వదిలాడు.

''సార్, బాబు రాజేంద్రప్రసాదుగారిని నేను రిసీవ్ చేసుకోవాలి. నేను డ్యూటీలో వున్నాను, వారిని బాపూజీ ఆశ్రమానికి తీసుకు వెళ్ళాలి'' అన్నాను. 'అయితే వెళ్లు. గాంధీజీకి నా నమస్కారములు చెప్పు' అన్నారు.

## బ్రిటిష్ పౌరుని ప్రత్యేకత :

బ్రిటీషు వారి యుద్ధ వ్యతిరేకతకు నాయకత్వం వహించిన గాంధీజీ పట్ల ఈ గౌరవ మర్యాదలేమిటి? గాంధీజీ ఓ పోరాట ఉద్యమానికి సాయుధంగా వ్యతిరేకించడం ఏమిటి?

వ్యక్తిపట్ల గౌరవము, యుద్ధాశయాలకై విధి నిర్వహణ, పెద్దల పట్ల గౌరవమర్యాదలు, విశ్లేషణ చేసుకొని తగు పాత్ర నిర్దేశించుకొనుటయే - బ్రిటీషు ప్రజాసామ్య వ్యవస్థలోని గొప్పదనం.

ఇదే నిజాం కాలేజి నాటికి, నేటికి గర్వించేది. రాజన్ బాబుకు స్వాగతం చెప్పి యిప్పుడే వస్తానని టర్నరుగారి వద్దకు వచ్చాను. వారిని బాపుజీ వద్దకు రమ్మని ఆహ్వానించాను.

## గాంధీజీ గొప్పవాడు :

టర్నరు నవ్వుతూ, *"I cannot take that grass food, excuse me. Gandhiji is great. Once again pay my respects"* ("నేను ఆ గడ్డి కూరలు తినలేను. క్షమించు. ఆయన మహాత్ముడు. మరొకసారి ఆయనకు నా నమస్కారములు చెప్పు") అన్నారు.

ఈ ఘట్ట మందలి సత్యము, ప్రేమ, అనుభూతి ఎంత గొప్పదో చెప్పడం కష్టం. యుద్ధము, శాంతిలో కూడా ఉపాధ్యాయ, విద్యార్థుల సంబంధాన్ని శాశ్వత శిలాస్థాపాలపై చెక్కిన సందేశాల లాగా నా హృదయాన్ని హత్తుకుపోయిన సన్నివేశం. ఈ శిక్షణయే సామాజిక ఇబ్బందుల్లోని సత్యాన్ని గుర్తించి ప్రజల సేవ చేయడానికి అవకాశం కలిపించింది. ఇదే నా అదృష్టం.



"మా పోరాటం బ్రిటీషు ప్రజలతో కాదు. వారి సామ్రాజ్యవాదంతో మేం పోరాడతాం. బ్రిటీషురాజ్యం ఉపసంహరించుకోవాలనే మా ప్రతిపాదన మా కోపంలో నుంచి పుట్టింది కాదు. ప్రస్తుత క్లిష్ట పరిస్థితుల్లో తన న్యాయమైన పాత్రను సమర్థనీయంగా నిర్వహించటానికి వీలుగా ఈ పోరాటం వచ్చింది.

- బాపూ.

# బ్రిటీష ట్రస్టీలు

"శ్రీ పెన్నింగ్‌టన్ వ్రాసిన ఉత్తరాన్ని ప్రకటించటం సంతోషంగా ఉంది. శ్రీ పెన్నింగ్‌టన్ ఈతరం మనిషి కాకపోయినా అతని ఆత్మవిశ్వాసం, అతని మాతృదేశ భక్తి ఎంతో నవనవంగా ఉన్నాయి. మనకు కూడా మనపైనా, మనం సవినయంగా ప్రాతినిధ్యం వహించే దేశంపైనా అదే రకం విశ్వాసం ఉంటుందని ఆశిద్దాం. శ్రీ పెన్నింగ్‌టన్ లేఖలో 'తరువాతి కలం' వాక్యం వ్యక్తిగతం అని వ్రాశాడు. కాని, దానికంత వ్యక్తిగత రహస్య హోదా ఉండవలసిన అవసరం లేదు. నేను దాన్ని యధాతథంగా ముద్రిస్తున్నాను. అది ఆయనకు కీర్తినే కలిగిస్తుంది. అతనికి ఈ బుల్లి భూగోళంలో అనేక సంవత్సరాల ఆయుర్దాయం ఉండాలని కోరే నాతో పఠిత కూడా ఏకీభవిస్తాడు.

నాకు ఉత్తరం వ్రాసిన వారి అసలు విషయానికి వస్తే – ఆయన ఉత్తరం నన్ను ఏమాత్రం అంగీకరింపచేయలేదు. వారుగాని, ఇంగ్లీషు పరిపాలకులుగా నిజంగా వారు ట్రస్టీలయి ఉన్నట్లయితే తగాదా ఉండేది కాదు. శ్రీ పెన్నింగ్‌టన్ నిజాయతీ అనుమానానికి అతీతమైనది. కాని, ఆయన నిస్సంశయంగా ఆత్మవంచన చేసుకుంటూ కృషిచేస్తున్నాడు. బ్రిటీష మంత్రివర్గంలో ఉన్నతులు కొంతమంది ఈ నమ్మకసూత్రాన్ని తిరస్కరించారు. 'ఖడ్గ' సిద్ధాంతాన్ని (బలం గలవారిదే రాజ్యం అనే సిద్ధాంతాన్ని) మనకూ, ప్రపంచానికీ స్పష్టమయ్యేటట్లు నిస్సందేహంగా వివరించారు. '(బలంతోనే) ఖడ్గంతోనే మనం ఇండియాను ఆక్రమించాం. ఖడ్గంతోనే దాన్ని నిలుపుకోవా'లని ప్రతిపాదిస్తున్నాం. ఇక్కడ ఖడ్గమంటే తుపాకీమందనే అర్థం వస్తుంది. అంతేకాక, దాని వెంటవచ్చే రాజనీతి కుతంత్రాలన్నీ స్ఫురిస్తాయి. కాబట్టి ఖడ్గ సిద్ధాంతం వివరించినప్పుడే అందులోని నగ్నసత్యం లోకానికి బట్టబయలయింది.

శ్రీ పెన్నింగ్‌టన్, ఆయన బాగా ఆలోచించేవారూ ఒక్క విషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. ట్రస్ట్ అంటే ఒక బరువు, ఒక బాధ్యత. కాని, బ్రిటిషు ప్రజలు భారత దేశాక్రమణాన్ని ప్రధానంగా, ప్రత్యేకంగా కాకపోయినా, వారి లాభం

కోసమే వాడుకొన్నారు. వారి మాటల్లోనే చెప్పాలంటే - దేశాన్ని, దేశ ప్రజల్ని వారు కొల్లగొట్టారు. నిజంగా, ఎప్పుడైనా ఒక ట్రస్టీ తన ట్రస్ట్ బాధ్యతలు నిర్వహిస్తే, అతని రక్షణలో మంచిఫలితాన్ని పొంది రక్షితుడు అభివృద్ధి చెందుతాడు. కాని, భారత రాజనీతివేత్తలు గోఖలే మొదలు అనేకమంది మా అభివృద్ధి స్తంభించిపోయిందనే అన్నారు.

'ఫాక్స్ బ్రిటానికా' అవసరానికి మించి పనిచేసి అలిసిపోయిన గుర్రం. దానివలన ఇప్పుడు మనం పొందేది ఏమీ లేదు. దానివలన మోసపోయేవారు ఎవరూ లేరు. మేం కోరేదల్లా 'ఫాక్స్ ఇండికా'. దాన్ని మేము చేరుకొనే ముందు రక్త సముద్రాలను ఈదవలసివస్తే, అది ఎంత తొందరగా చేయగలిగితే అంత మంచిది. మమ్మల్ని ఉక్కిరిబిక్కిరి చేసే దుష్టమైన శాంతిని మా మీద రుద్దటానికి మేం అంగీకరించం. మాకు ఆరోగ్యాన్ని, బలాన్ని చేకూర్చే ప్రాణవాయువువంటి శాంతిని మేం కోరుతున్నాం.

దోచుకోవడానికి వీలుగా అన్యాయంగా ఆక్రమించుకోటానికి తేలికగా పలికే ధోరణిలో చేసే శాసనాలను తలపింపచేస్తున్నాడు శ్రీ పెన్నింగ్‌టన్. శాసించబడిన దేశాలను అడగమనండి అతనిని, ఆ దేశాలు ఆ శాసనాలను ఎంతవరకు మెచ్చుకుంటాయో! ఆధునిక కాలానికి గల అనేక శాపాలలో వంచన, కపటం అనేవి ముఖ్యమైనవి. కాని, తియ్యని మాటలు ఏ తీపి ఫలాలకు రుచిని కలిగించలేవు. ఆ మాటలు ప్రజలను మోసగించే శక్తిని పూర్తిగా కోల్పోయాయి. సత్సంకల్పాలు గల జనులను గతించిన నమ్మకాలతో, అనరాని మాటలతో ఇంకా మోసగించబడవచ్చుననుకోవడం నిజంగా విచారింపదగిన విషయం. శ్రీ పెన్నింగ్‌టన్‌వంటి పెద్దమనిషులతో పనిచేసే వారి సేవలు వారిపై వారి దురదృష్టకర ఆత్మవంచనచేత ఉపయోగం లేకుండా పరిమితమై పోతున్నాయి.

(యంగ్ ఇండియా 1-8-1929)

[1] *Which read : "You are quite at liberty to publish this, if you like. I can hardly hope to write again having been born in 1839."*

# దొంగతనము

చిన్నతనంలో దొంగతనం సర్వసాధారణమైనది. ఈదశలో ఏ పల్లీలో, పుట్నాలో కొనుక్కుంటాం అనే చిన్న కోర్కెలు తల్లిదండ్రులు తీర్చనందువలన దొంగతనం చేస్తారు. అది క్రమేణా అలవాటుగా మారుతుంది.

సంస్కారం, విద్యాలోపం వల్ల దొంగతనం దోపిడీదశకు పెరిగి పోలీసులను ఎదిరించే దశకు పెరుగుతుంది. ఈస్థాయిలో ధైర్యస్థైర్యాలటుంచి, గజదొంగ అనిపించుకోవడం కూడా గొప్పతనంగా భావించడం జరుగుతుంది. ఈ అలవాటుతో వారు క్రమేణా పెరిగి జాతీయ, అంతర్జాతీయ స్మగ్లర్లుగా తయారవుతారు. శాంతిభద్రతలకు భంగం కలుగుతుంది.

విద్యాధికులలో కూడా ఫోర్జెరీ చేసి, ఇతరులను మోసగించడం, బాగా చదువుకొన్న వారు కూడా పెద్ద పెద్ద ఉద్యోగస్థుల సంతకాలు ఫోర్జరీ చేసి అంతర్జాతీయంగా మోసాలకు దిగుతారు. వారిని ఈ విధంగా ఎందుకు చేసారంటే, 'సరదా' గా చేసామని చెప్పిన సందర్భాలు వున్నాయి.

నేను వరంగల్లు జైలులో వున్నప్పుడు ఒక గజదొంగను నీవు జైలులో వున్నావు, దొంగతనం ఎలా చేసావు అంటూ ఒకరిని ప్రశ్నించాను. జైలరుగారింట్లో నుంచి గిన్నె తెమ్మని సాటి ఖైదీలు ఛాలెంజ్ చేస్తే, 'చేసి చూపిస్తా' నని, దొంగతనంచేసి తెల్లవారే సరికల్లా గిన్నె తెచ్చానని చెప్పాడు. అది సూపరింటెండెంటు ఎదుట వుంచాడు. ఛాలెంజ్‌ల వల్ల, పోటీపడి చిన్న దొంగతనాల నుండి నుండి పెద్ద పెద్ద దొంగతనాలకు దిగడం జరుగుతుంది.

ఒక్కొక్కప్పుడు గత్యంతరం లేక ఏదో ఒక విషవలయంలో చిక్కుకున్నప్పుడు తప్పనిసరి అవుతుంది.

ఈ విధంగా బాల్యంలో అజ్ఞానంతో చిన్న చిన్న అవసరాలు తీర్చుకొనేందుకు, పెద్దవయసు వచ్చాక తిండికి, తప్పుడు గౌరవానికి, పోలీసుల కళ్ళలో మన్ను కొట్టాడనే ఖ్యాతి సంపాదించుకోవడానికి, సినిమాలలో చూస్తూ వున్న దొంగతనాలకు సంబంధించిన పరిశోధనకు, ప్రయోగాలకో దారితీస్తున్నవి. ఇవిగాక గౌరవంగా వ్యాపారనీతి అనే పేరుతో చేసే మోసాలు కూడా లేకపోలేదు.

ఇవన్నీ బాపు దృష్టిలో దొంగతనమే. ఈ చెడు అలవాటును వాతావరణ పరిస్థితులలో మార్పులు చేస్తే పరిష్కారమవుతుందనే భావన నేడు ప్రబలుతున్నది. జైళ్ళలో ఆ ఉద్దేశ్యంతోనే సంస్కరణల పేరిట అనేక వసతులు కల్పించబడుతున్నవి. దొంగ మనస్తత్వం మార్చ ప్రయత్నాలు జరుగుతున్నవి. ఇదిలా వుండగా, దండం దశ గుణం భవేత్ అనే పాత సామెతలో నమ్మకమున్న వారు కూడా లేకపోలేదు.

ఏదైనా దొంగతనం పోవాలి, అది ఆచరణ యోగ్యం కాదు. పక్షి వలె ఏరోజా ఆహారం ఆరోజా శ్రమించి సంపాదించుకొని జీవించడం గౌరవప్రదమైనదని దొంగలకు నేర్పాలి. అందుకే జైళ్ళలో సంస్కరణలు తలపెట్టబడుతున్నాయి.



# అస్తేయము

(దొంగతనము చేయకుండుట)

దొంగతనం లేకపోవడం సత్యంలోని అంశం. సత్యం నుండి ప్రేమ ఉద్భవిస్తుంది లేక సత్యం, ప్రేమ తోడుగా జీవిస్తాయి. నిత్య సత్యం ఒక్కటై నిలుస్తుంది. ప్రేమ మార్గంలో సత్యం గమ్యం. ప్రేమా హింసలు మనకు తెలిసినవి. అనుసరణలో కష్టాలున్నాయి. అందు మనకు తెలిసినది ఒక్క అంశ మాత్రమే. పూర్ణజ్ఞానం సత్యానిది. పూర్ణానుసరణ అహింసది – ఇది దుస్సాధ్యం.

ఒకే ఒరలో చౌర్యం, సత్యాహింసలూ ఇమడవు. తెలిసీ, తెలియక మనమంతా ఎంతో కొంత వరకు చోరులమే. చౌర్యమంటే ఇతరుల వస్తువు సంగ్రహించడమే కాదు. పిల్లలకు తెలియనీయక తండ్రి దాచిపెట్టి ఉంచడం కూడా దొంగతనమే. ఆశ్రమపాకశాలలో ఒక్క పటిక బెల్లం ముక్క తీసినా చౌర్యమే. ఇతరులది, ఒప్పుదలలేకుండా, వారి ఎదుట తీసినా అది దొంగతనమే అవుతుంది. ఎవరిదో తెలియని వస్తువు తీసినా, అది చౌర్యమే. రోడ్డుమీద ఉన్నది ప్రభుత్వానికి, ఆశ్రమంలో దొరికిన దానిని కార్యదర్శికి అందజేయాలి.

ఇదంతా బాగానే ఉంది. అస్తేయత నిర్వచనం ఇంకా లోతైనది. ఇతరుల ఆస్తిని వారి అనుజ్ఞతో తీసుకొనుట, దేనినైనా తగు అవసరం లేకుండా సంగ్రహించుట దొంగతనమే. తెలియక చేసినా ఇది తప్పే. సరిగా ఆలోచిస్తే మనకు కావలసినది ఎంత? అంతకు మించి ఉంచడం తప్పే కదా? నిజమైన బుద్ధితో, గట్టిగా, దొంగతనాన్ని పరిహరించడం, ఆవశ్యకతలను తగ్గిస్తుంది. లోకంలో గల దుఃఖకర దారిద్ర్యం అంతమవుతుంది.

బాహ్య, భౌతిక చౌర్యాన్ని మించింది మానసికంగా తనదికాని దానిని ఆశించడం, దానిని చూసి లొట్టలు వేయడం. ఆహారం వర్జిస్తే ''ఉపవాసం'' కదా! కాని ఉపవసించే వ్యక్తి తింటున్నవారిని చూసి మనసులో తిండి కోరికను

పెంచుకున్నపుడు కూడా చౌర్యం చేసినట్లే. వ్రతభంగం అయినట్లే. ఉపవాస సమయంలో తిండిని గురించి ఆలోచన తప్పు.

అస్తేయదీక్షావంతుడు భవిష్యత్తులో వలయు వాటిని సంగ్రహించడు. ''రేపేమవుతుంది'' అనే చింత, చౌర్యానికి మూలం. ఈరోజు దేన్నైనా కోరుకుంటాం. రేపు అదే అలవాటు వలన, ఋజుమార్గాన్నో, వక్రమార్గాన్నో అవలంబించడం ఆరంభిస్తాం.

ఇదే విధంగా బుద్ధి, జ్ఞాన తస్కరణ కూడా ఉంటుంది. ''దీన్ని నేను కనిపెట్టాను'' అనే ప్రబుద్ధుడి బీరాలు నమ్మవద్దు. ఆ విషయం ఎక్కడ నుంచి సంగ్రహించిందో తెలుసుకోండి. మహాపండితులు ఇట్టి తస్కరులు అని ప్రపంచ చరిత్ర తెలియజేస్తుంది. నేను ఒకవేళ ఆంధ్రలో చూసిన చరఖావంటిది ఆశ్రమంలో తయారుచేసి, దానిని నా ''స్వయంభు'' అంటే అది తప్పు అని. కనుక ''తస్కరించను'' అని దీక్ష పూనిన వారు, వినయశీలురు, ఆలోచనాపరులు, క్రియాశీలురు, సాదా అలవాట్లు కలవారు అయి ఉండాలి.



# నేటికీ బాపూ గుడిసె - గుడిసెయే

సాయంత్రమయింది. బాపూ ప్రార్థన సమావేశం యథావిధిగా జరిగింది. ప్రార్థనానంతరం, బాపూ ఒక్కొక్కప్పుడు తనంతట తానే వివిధ అంశాలపై, అనేక విషయాలపై తన అభిప్రాయాలను వెలిబుచ్చేవారు. మరొకప్పుడు, ఇతరుల ప్రశ్నలకు సమాధానం చెప్పేవారు. కొన్ని సందర్భాలలో ఆశ్రమ పెద్దల అభిప్రాయం తీసుకొనేవారు.

ఒక రోజు సేవాగ్రాం ట్రస్టు సభ్యులు, ఆశ్రమంలో వున్న గుడిసెలపై రికరింగ్ ఎక్స్‌పెండిచర్, రిపైర్లకై అధికమగుతున్నది కావున వాటిని పక్కా ఇళ్ళుగా మార్చాలని తలపెట్టారు. అదే విషయం ఒక ప్రార్థన సమావేశానంతరం ప్రస్తావించబడింది. బాపూ అందరి అభిప్రాయాలు వరుస క్రమంలో అడుగుతూ వచ్చారు. నా వంతు వచ్చింది. నేను, అదే జరిగితే 'మిమ్మలను, మీ ఆశయాలను మరచిపోతారేమో' అన్నాను. బాపూ నన్ను తేరిపార చూసారు. నేను బాపూకు కోపం వచ్చిందేమో అనుకున్నాను. 'ఇంకా ఆలోచిద్దాం' అంటూ ప్రార్థనా సమావేశం ముగించి బాపూ తన బసకు వెళ్ళారు.

మరుసటి రోజు ట్రస్టు సభ్యులు బాపూతో గుడిసెలకు మారుగా పక్కా ఇళ్ళు నిర్మించే విషయంపై ఏకాభిప్రాయాన్ని సమిష్టిగా వెలిబుచ్చారు. నేను బాపూ ఏం సమాధానం చెపుతారా అని వూపిరి బిగబట్టి, ఆసక్తితో ఎదురు చూస్తున్నాను.

అప్పుడు బాపూ, 'మీరంతా అలా అభిప్రాయపడితే మీ ఇష్టానుసారంగా అలాగే చేయండి. కాని, నన్ను, నాగుడిసెను మాత్రం వదలి వేయండి' అన్నారు. అప్పటికి నా వయస్సు ఇరువై రెండు సంవత్సరాలు. బాపూ అభిప్రాయం విన్నాక, నా ఆలోచన సరియైనదని తృప్తి పడ్డాను.

బాపూ గుడిసె నేటికి అలాగే వుంది. అచటి నుండే బాపూ ఆలోచనలు నేటికి యావత్ ప్రపంచాన్ని ఆకర్షిస్తున్నాయి.

నా అభిప్రాయం గుర్తింపు పొందినందుకు, నాకెంతో తృప్తి, ఆనందం కలిగించింది. అలాగే పలువురికి ఆశ్చర్యం కూడా కలిగించింది. మంచి ఎక్కడున్నా, చిన్నాపెద్దా తేడా లేకుండా ఎవరు చెప్పినా ఓపికతో విని, నిర్ణయిం తీసుకునే ప్రవృత్తి బాపూని మహామనిషిని చేసింది. ఒక్కమాటలో చెప్పాలంటే అపరిగ్రహ సిద్ధాంతానికి ఆదర్శం కష్టజీవనమే.



# పెద్దలతో ఫోటో

## గాంధీజీతో నా ఫోటో :

గాంధీజీ హిందీ ప్రచారానికై ధనసేకరణ ప్రారంభించారు. ఆయనతోపాటు నేను రైలులో విజయవాడ నుండి బలార్షా వరకు ఆశ్రమవాసిగా ఆయన వెంట ప్రయాణం చేశాను. వసూలయిన డబ్బు నా గొంగళిలో పోసి బజాజ్‌కి యిచ్చాను. ఖమ్మం, వరంగల్ జిల్లాలలో ఆయనకు స్వాగతము యిచ్చేందుకై పెద్దపెట్టున ఏర్పాట్లు చేశాము. వరంగల్‌లో మావాళ్ళే ఘనంగా ఆహ్వానించారు. విరాళాలిచ్చారు. ఇంత అవకాశమున్నా నేను గాంధీజీతో ఫోటో దిగలేదు.

## ఆ రోజులలో అది చిన్నతనం :

ఆ ధ్యాస రాలేదు. ఆ రోజులలో అది చిన్నతనంగా ఉండేది. సరియైన పద్ధతి కాదనుకునేవారము. బాపూజీ దేశనాయకుడు, గొప్పవాడు, అంతర్జాతీయ ఖ్యాతి చెందినవాడు. అందుకని వారితోపాటు ఫోటో తీసుకోవాలన్న వాంఛ వుండడం సహజము. బాపూజీ మామూలుగా ఒకరోజు భోజనానికి తన కుటీరం నుండి బయలుదేరారు. ఎదురుగా వున్న భోజనశాలపై కనూగాంధీ తన కెమెరాతో ఫోటో తీయుటకు రడీగా ఉన్నాడు. బాపూ వెంట ఫకీరు అనే అతను దూసుకొని రాసాగాడు. అతనిని, అతని నడవడిని చూస్తే ఏదో ధనవంతుడిలాగా కనిపించాడు. పేరు గొప్పకై తాపత్రయపడుతున్నాడనే భావన అతని పోకడవల్ల, అతని ప్రవర్తనవల్ల తేటతెల్లమయింది.

## ఆడంబరానికి భిన్నంగా :

ఇది పసికట్టి తీరా ఫోటో తీసే వేళకు తన భుజంమీద ఉన్న ఉత్తరీయంతో బాపు ముఖాన్ని కప్పేసుకున్నాడు. ఈ విధముగా గాంధీజీ తన చర్యలతో ఇతరుల ప్రవృత్తిని, ఆడంబరాన్ని అడ్డుకునే యత్నం చేస్తూనే ఉండేవారు. అందువల్ల ఆనాడు ఆశ్రమంలో ఉండేవారు ఎంత చనువు వున్నా పెద్దవారయినా బాపూతో ఫోటో దిగాలనే యత్నము చేయలేదు. పైగా ఆయన దాన్ని గర్హిస్తాడని తెలియటంవల్ల ప్రతివారు దీనినుంచి దూరం అయినారు. ఈనాడు నీవు గాంధీజీతో కలిసి దిగిన ఫోటో లేదేమని ఎవరైనా అడిగితే వారికి తృప్తికరమైన సమాధానం చెప్పడం నాకు కష్టమవుతుంది.



అపరిగ్రహము

# స్వత్వరాహిత్యం లేక దారిద్య్రం

''నాది'' అనుకొనక పోవడం. స్వత్వరాహిత్యంతో ముడిపడి ఉన్నది. ఆవశ్యకత లేనప్పుడు దేనినైనా స్వంతం చేసుకుంటే ఆ ఆస్థిని తస్కరించబడినదని అనాలి. రేపటికి ప్రోగు చేయడం తప్పు. సత్యాన్వేషి, ప్రేమ శాసన అనుయాయి రేపటికి ఇది కావాలని సంగ్రహించడు. దైవం కూడా ఆవిధంగా చేయడు. అవసరం లేని దానిని సృష్టించడు. భగవంతుని నమ్మితే, మనకు ఏలోటు లేకుండా చేసాడతడు. సన్యాసులు, భక్తులు ఆవిధంగా తరించారు. దైవశాసనమిది. ఇది గ్రహించక, అసమానత కొనితెచ్చుకుంటున్నారు. ధనవంతుల వద్ద వారి కవసరం లేని ఎన్నో చేరుకొని, ఉపయోగంలోకి రాక వ్యర్థమవుతాయి. కోట్లాది జనం మలమల మాడుతున్నారు. కనుక ఆ బాధను నివర్తించడం, కావలసిన దానికంటె ఎక్కువ ఏదీ సంగ్రహించక పోవడం వలన సాధ్యం. అందరూ ధనవంతులవుతారు. కలవారు అందరి తృప్తి కోసం పంచిపెట్టడం అలవాటు చేసుకోవాలి. ''స్వత్వ'' రాహిత్య భావం కలిగేందుకు, పక్షులవలె కొంపా, గోడూ, తిండీ, బట్టా లేని మనస్తత్వాన్ని అలవరచుకోవాలి. రోజూ తిండి కావాలి. ఆ విషయాన్ని దేవుడే చూస్తాడు. ఈ ఆదర్శాన్ని అందుకోవడం బహుకష్టం. దీని ఆలోచనతో బెదిరి పోకూడదు. కావలసిన వస్తు జాలము అట్టే పెట్టుకొని, తదితరాలను త్యాగం చేయాలి. దీని వలన సంతోషం, తృప్తి నిజంగా పెరుగుతాయి. సేవాభావం మెరుగవుతుంది. ఈ కొలబద్ధతో పరీక్షచేస్తే, ఆశ్రమంలో అక్కరలేని వస్తువులెన్నో కనబడతాయి. తస్కరణకు అనువైనవివే.



# ఆమరణదీక్ష - పవిత్ర ఆశయాలు

**నన్ను కవ్వించవద్దు :**

ప్రభాకర్‌జీ గాంధీజీకి మసాజ్ చేసేవారు. అతని మిత్రుడు ఒకరు, నేను ప్రభాకర్‌జీని పెండ్లి చేసుకోమని చాలా సార్లు చెప్పడం జరిగింది. అతనిని కవ్వించే మాటలు కూడా విసిరేవాడిని. నీవు ఇలా వుంటే ఏ అమ్మాయో నిన్ను బలవంతంగా ఎత్తుకెళ్ళుతుంది.మేము నీకై వెతుకవలసి వస్తుందని అనే వాడిని. అతను చిరునవ్వుతో ఉత్తరీయం సవరించుకుంటూ 'రాజ్, నీవు ఈ కొంటె వేషాలు మానవు, నావెంట ఎందుకు పడతావు' అనే వాడు. 'పెండ్లి అయింది కాబట్టే' అనే వాడిని. తుదకు అతను అస్ఖలిత బ్రహ్మచారిగానే స్వర్గస్థుడైనాడు. ఆదర్శనీయ బ్రహ్మచారిగా నిలిచాడు.

**ప్రకృతి లీలలు :**

ప్రకృతికి ఒక్కొక్కరిని ఒక్కొక్క విధంగా ఆడించే అలవాటు వుంది. ఎప్పుడు ఏ విధంగా ప్రేరేపింపబడతామో, మన కళ్ళకు అంధకారమాయ కమ్ముతుందో చెప్పలేము.

**అమ్మాయిలతో :**

ప్రభాకర్‌జీ మిత్రుడొకడు నీరా తయారు చేసేవాడు. ఆ దైనందిన కార్యక్రమంలో తనకు సాయపడే అమ్మాయి వలలో అతను పడినాడో లేక ఇతనే అమ్మాయిని వలలో వేసుకున్నాడో తెలుపటం కష్టం.

**బ్రహ్మచర్య భంగం :**

ఏదైనా అతని బ్రహ్మచర్యానికి భంగం కలిగింది. ఆ అమ్మాయి గర్భిణి అయ్యింది. విషయం బాపు దాకా వచ్చింది. అతను తప్పు చేశానని పశ్చాత్తాపపడుతున్నాడని బాపుకు చెప్పాడు.

పశ్చాత్తాపం :

పైగా తప్పుకు పశ్చాత్తాపంగా అమరణ దీక్ష చేయడానికి నిశ్చయించుకున్నాడని బాపుకు తెలిపాడు. బాపుమరి ఆ అమ్మాయి సంగతో అన్నాడు. ఉపవాసం చేయవద్దని కాని, చేయమని కాని బాపు చెప్పలేదు.

ఆ తరువాయి ఆ మిత్రుడు కన్నీళ్ళతో బాపూజీ కాళ్ళపై పడ్డాడు. బాపూజీ అతనిని లెమ్మని తలపై నిమిరి 'నీవు చేయగలిగింది ఏమిటి? పశ్చాత్తాపడుట కన్న' అని అతనిని ఓదార్చారు.

**దీక్ష పవిత్ర ఆశయం కావాలి :**

అమరణదీక్ష కేవలం పశ్చాత్తాపానికై వుండరాదు. అది సత్యమును గుర్తించిన ప్రాయశ్చిత్తముగా వుండాలి.

అమరణ దీక్ష పవిత్ర ఆశయంతో ఉండాలి. పవిత్ర ఫలితాలు యివ్వాలి' అన్నారు. మాయాజాలంలో పడ్డ వీరిరువురు వేరువేరు కులాలకు చెందిన వారైనా సమాజాన్ని, సంప్రదాయాన్ని ఎదిరించి వివాహం చేసుకున్నారు.

ఇది విధి లిఖితము. భగవన్నిర్ణయాన్ని ఎవరూ మార్చలేరు. పరిస్థితి, పరిసరాలు ఎల్లప్పుడు బలీయము. అందుకే బాపూజీ పరిసరాలను మరిచి వ్యవహరించ వద్దని హెచ్చరించేవాడు.

కాని మానవుడు స్వతహాగా తన బలహీనతలకు లోనై మత్తుపదార్థాలు సేవించి బ్రహ్మచర్యమునకు భంగము కల్పించు పరిస్థితి తానై తాను తెచ్చుకోకూడదు. ఆ తరువాత పశ్చాత్తాపమో, ప్రాయశ్చిత్తమునకో ఎంత యత్నించిన పెడదారి పట్టినందువలన తనపై బడిన బాధ్యతలు, కర్తవ్యమును తప్పించుకొనజాలడు.



# బ్రహ్మచర్యం లేక పవిత్రత

బ్రహ్మచర్యపాలన దుస్సాధ్యమనే భావన ఉంది. ఇది తప్పు. బ్రహ్మచర్యం అంటే పాశవిక వాసనను తరిమికొట్టడం మాత్రమే కాదు. ఇది అన్ని ఇంద్రియాలను అరికట్టడం అన్నమాట. శృంగార దృశ్యాలు చూడడం, అట్టి వర్ణనలు వినడం వాసనను పెంచే తిండి తినడం, ఉద్రేక పరిచే స్పర్శలు, నిప్పులో చెయ్యి పెట్టి ''కాలదు'' అనుకోవడం వంటివి. అన్నిటి నియంత్రణ అత్యవసరం. అన్ని పద్ధతులలో ''బ్రహ్మచర్య'' మార్గాన్ని అనుసరిస్తే, అది విజయసిద్ధి కలిగినది అవుతుంది. నాలుక కూడ దోషియే. ఆశ్రమవాసులకు ''నోరుకట్టుకోవడం'' గురించి తెలుసుకదా.

''బ్రహ్మచర్యం'' అనే మాటకు వ్యుత్పత్తి. ''చర్య'' అంటే పనిచేయుట. బ్రహ్మను లేక సత్యాన్ని వెదకుటకు బ్రహ్మచర్యం అవసరం. వ్యుత్పత్త్యర్థం నుంచి ఇంద్రియ నిగ్రహయ్యే అనే అర్థం స్ఫురిస్తుంది. జననాంగాలకు పరిమితం చేసే అసంపూర్ణ నిర్వచనం వదలి, సంపూర్ణ నిర్వచనంపై మనసు నిలపాలి.



# మత్తు పదార్థాలు

భారతదేశంలో మద్యం, బంగు, నల్లమందు, పొగాకు, మత్తుపదార్థాలుగా పరిగణించబడుతున్నాయి. ఈ దేశంలో తయారయ్యే తాటికల్లు, ఈతకల్లు మద్యం క్రిందికి వస్తాయి. విదేశాల నుంచి దిగుమతి అయ్యే మద్యం రకరకాలు. వానికి లెక్క లేదు. యివి అన్నీ త్యజించవలసినవే. తాగుడుకు అలవాటు పడ్డవాడు తన తెలివిపోగొట్టుకుంటాడు. పనికిమాలినవాడు అయిపోతాడు. తాగుడు అలవాటు అయితే వాడు నాశనం కావడమేగాక, తన కుటుంబాన్ని కూడా నాశనం చేస్తాడు. గౌరవమర్యాదలన్నిటని ఉల్లంఘిస్తాడు..

కొందరు నిశ్చిత పరిమాణంలో మద్యం తాగవలెనని, లాభం కలుగుతుందని అంటారు. నాకు ఈ వాదనలో పస కనబడలేదు. ఈ వాదనను అంగీకరించినా, మర్యాదల్ని మరిచిపోయి హద్దుల్ని దాటవేసే వాళ్ల సంఖ్యయే ఎక్కువగా వుండటం వల్ల అట్టి వాదనను తిరస్కరించవలసిందే.

పారసీసోదరులు కల్లును సమర్థిస్తున్నారు. కల్లు మత్తు కలిగించినా అది ఒక ఆహారపదార్థం యితర ఆహార పదార్థాల్ని జీర్ణం చేస్తుంది. కనుక కల్లును బహిష్కరించవద్దని కొందరి వాదన. ఈ వాదనపై నేను బాగా ఆలోచించాను. బాగా చదివాను కూడా. కల్లు తాగే చాలామంది పేదల దుస్థితిని కండ్లారా నేను చూశాను. కల్లును ఆహారంగా పరిగణించకూడదనే నిర్ణయానికి వచ్చాను. కల్లునందు ఏఏ విశేషాలు వున్నాయని అంటున్నారో అవన్నీ యితర ఆహారపదార్థాల్లో కూడా ఉన్నాయి. కల్లు ఈత రసంతో తయారవుతుంది. ఈత రసంలో మత్తు అసలు వుండదు. దాన్ని నీరా అని అంటారు. తాజాగా వుండే నీరాను వున్నదున్నట్లు తాగితే చాలా మందికి విరోచనం సాఫీగా అవుతుంది. నేను నీరా స్వయంగా తాగి చూశాను. నామీద దాని చెడ్డ ప్రభావమేమీ పడలేదు. అది ఆహారం వలె పనిచేస్తుంది. ఉదయం టీ తాగకుండా నీరా తాగితే యిక ఏమీ తాగవలసిన అవసరం వుండదు. చెరకు రసం వలె నీరాను తీసి కాగబెడితే మంచి బెల్లం తయారవుతుంది. ఈత కూడా తాడిచెట్ల రకమే. మన దేశంలో రకరకాల తాడిచెట్లు ప్రకృతిలో పెరుగుతున్నాయి. వాటన్నిటి నుంచి నీరా లభిస్తుంది. తీయగానే తాగవలసిన పదార్థం. నీరాను నిల్వ వుంచితే అందు మత్తు వస్తుంది. అందువల్ల వెంటనే తాగివేయ

# పర్యావరణం - పరిశుభ్రత



ఆత్మోన్నతికై ప్రార్థన ఎంత అవసరమో, ఆరోగ్యమునకై శారీరక శ్రమ అంతే అవసరము. ఈ శ్రమ పొలము పని కావచ్చు, భంగీ సఫాయి పని కావచ్చు లేక మరే ఇతరమైన శారీకర శ్రమనైనా కావచ్చు. ఈ భూమికలో తాము గొప్పవాళ్ళమని గర్వాంధకారములో ఉన్నవారిని మామూలు మనిషిగా చేయడానికి సఫాయి యొక ఆయుధము.

ఆ పని అతి నీచమని, ఆ పని చేయువారు అతినీచులని, కేవలం చిన్న లేక తక్కువ స్థాయిలో ఉన్నవారే అది చేయాలని, వారిని ముట్టుకుంటే సచేల స్నానం చేయాలని భావించే మన సమాజాన్ని మార్చడానికి బాపూ సర్వ విధాల గట్టిగా ప్రయత్నించాడు.

అందుకనే ఎంత పెద్దవారైనా, సేవాగ్రాం ఆశ్రమంలో అడుగుపెట్టగానే అతడు తప్పకుండా సఫాయి (మలమూత్ర) విసర్జన శుభ్రతా కార్యక్రమంలో నియమించబడేవారు.

**సఫాయి నిర్వచనం.:**

సఫాయి అంటే కేవలం ఊడ్వడం, అంట్లు తోమడం, కూరలు కడగడం వంటి కార్యక్రమాలే కాదు. ఈ పని సాధారణంగా అందరు చేసేదే. ప్రతి తల్లి తను కన్న పిల్లల మలమూత్రాదులు ఎత్తి వేయడం తన కర్తవ్యంగా ఎలా భావిస్తుందో, అదే విధంగా ప్రతి పౌరుడు, పాకీ పనిని సక్రమంగా అసహ్యించుకోకుండా నిర్వర్తించడం, తన కర్తవ్యంగాను, గౌరవంగాను భావించునట్లు చేయుట బాపు ఉద్దేశ్యము. ఆయన దృష్టిలో పాకీ పని అతి పవిత్రమైనది, గౌరవప్రదమైనది.

ప్రతి తల్లి తన పసిపాపని పసిప్రాయం నుంచి తన స్వసుఖం మరచి, ఎన్నో కష్టాలు పడి కంటికి రెప్పలా ప్రేమానురాగాలతో పెంచి పెద్ద చేస్తుంది. ఆ పసిపిల్ల తనంతట తాను తన పనులు చేసుకొనే వరకు ఏ మాత్రం అసహ్యించుకోకుండా, విసుక్కోకుండా పె పెచ్చు ఎంతో సంతోషంతో తన పిల్లను, పరిసరాలను అత్యంత పరి శుభ్రంగా ఉంచుతుంది.

**పరిశుభ్రతయే తల్లి కోరిక :**

తల్లి యీ విధంగా చేయటానికి ముఖ్యకారణం తన రక్తం పంచుకొని పుట్టిన బిడ్డ తన కడుపుపంట, అనురాగాల మూట అనే ఎల్లలు లేని మాతృ హృదయం కావచ్చు, కర్తవ్యం కావచ్చు, విధి కావచ్చు.

# గ్రామ పారిశుద్ధ్యం

మేధావులకూ, కార్మికులకూ మధ్య ఏర్పడిన సమన్వయ రాహిత్యం వలన పల్లెటూళ్ళ బాగోగులను పట్టించుకొనటం దారుణంగా విఫలమైపోయింది. దానితో, అందమైన పల్లెపట్టులు అంతర్ధాన మౌతున్నాయి. పెంటకుప్పలు అవతరిస్తున్నాయి. గ్రామాల్లోకి ప్రవేశించడం ఇప్పుడంత ఆరోగ్యకరమైన అనుభవంగా లేదు. అశుభ్రమైన పరిసరాలను చూచి కళ్ళు మూసుకుంటాం. దుర్భర దుర్గంధానికి ముక్కులు మూసుకుంటాం. పల్లె పట్టుల నుండి ఎక్కువమంది కాంగ్రెస్ కార్యకర్తలను చేర్చుకుంటే, అలా చేర్చుకోవాలి కూడా - వారు గ్రామాలను శుభ్రంగా ఉంచి ఆదర్శప్రాయంగా తయారు చేసి గ్రామ పారిశుద్ధ్యం అనే మాటకు సార్థకాన్ని కలిగిస్తారు. కాని, వారు తమ దైనందిన జీవితాల్లో తామూ గ్రామీణులమే అనే భావసమైక్యాన్ని సాధించుకొని గ్రామ పారిశుద్ధ్యం తమ బాధ్యత అని గుర్తించలేక పోతున్నారు. దేశాన్ని, సమాజంలో పరిసరాలను శుభ్రంగా ఉంచుకోవాలనే జాతీయస్పృహగల సుగుణం మనలో లేదు. మనం మన కిష్టం వచ్చినట్లు స్నానం చేస్తాం. బావి దగ్గరగాని, చెరువులోగాని, నదిలోకాని, కానీ బావి పరిసరాలనుగాని, చెరువునీటిని గాని, నదీనీటిని గాని పరిశుద్ధంగా ఉంచాలని జాగ్రత్తపడం. పైపెచ్చు వాటి చుట్టూ, వాటిలో మలమూత్రాలను విసర్జిస్తూ ఉంటాం. నేను ఈ దుర్గుణాన్ని మహాదోషంగా పరిగణిస్తాను. ఇది మన గ్రామాలకు అవమానకరం. మన పవిత్ర జలాలకు, పుణ్యనదీ తటాలకు మలినకరం. ఆ అశుభ్రత వలన ఎన్నో రోగాలు పుట్టుకొస్తాయి.

- (నిర్మాణాత్మక కార్యక్రమాలు - ఎం.కె.గాంధీ)

మన దేశంలో పల్లెసీమలే అధికంగా వున్నాయి అన్న విషయం అందరికీ తెలిసిందే. గాంధీగారు ఎన్నో గ్రామాలలో పర్యటించారు. స్వయంగా చూసి ఎన్నో విషయాలు తెల్సుకున్నారు. అందుకనే ఆయన ఇలా అన్నారు.

## సాంఘిక భద్రత - ఆవశ్యకత :

"వ్యక్తి శుభ్రత కన్నా కూడా సాంఘిక శుభ్రత ముఖ్యం. ఎవరి సౌకర్యం వారే చూసుకుంటూ ఇతరులకు ఇబ్బంది కలిగించడం చాలా తప్పు. చెడుగాలి, మురికినీరు, కుళ్ళిన ఆహారపదార్థాలు, ఎన్నో అంటువ్యాధులకు, జనుల అనారోగ్యానికీ కారణం అవుతాయి. కనుక సాంఘిక సంక్షేమం విషయంలో జనులంతా జాగ్రత్త వహించాలి. గ్రామ ఆరోగ్యము నీటివసతి వగైరాలలో ప్రభుత్వము మీదే ఆధారపడటం కన్నా గ్రామస్తులు ఐకమత్యముతో మెలుగుతూ పరస్పర సహకారంతో పరిశుభ్రము చేసుకోవచ్చును. స్వగ్రామము స్వగృహము వంటిదే అనుకొని ఒకరు ముందుకు వస్తే మరో పదిమంది అతనికి సహాయంగా నిలబడతారు. వారు చేసిన గ్రామ సేవాపరోపకారము ఊరికే పోదు. వారిని చూసి మరింత మంది గ్రామ క్షేమం కోసం పాటుపడతారు. ఆ విధంగా గ్రామాలలో కక్షలు తగ్గి ఐకమత్యము బలపడుతుంది. పల్లెసీమలు బాగుపడతాయి" అన్నారు గాంధీజీ. గాంధీగారు ఆ మాటలు అరవై, డెభ్బై సంవత్సరాల క్రిందట అన్నా, ఈ నాటికి మన గ్రామాలలో అధికశాతం ఆనాటి పరిస్థితిలోనే వున్నాయి. నిజానికి గ్రామాలలో పట్టణ వాసులకు దుర్లభమైన స్వచ్ఛమైన గాలి, ప్రశాంత వాతావరణం అక్కడి వారికి దొరుకుతాయి. కాని ప్రజల అజ్ఞానం వల్ల అలసత్వం వల్ల గ్రామాలు ఎంతో అపరిశుభ్రంగా వుండి కలుషిత వాతావరణం పేరుకుపోతుంది.

## గ్రామాలలో మరుగుదొడ్లు

గ్రామాలలో మరుగుదొడ్ల సౌకర్యం గురించి చాలామంచి ఆలోచించరు. ఏ తోటలో, పుంతలో ఉపయోగించేస్తారు. ఇక పిల్లలయితే ఇంటి ముందరే మలమూత్ర విసర్జన చేస్తుంటారు. ఇల్లు శుభ్రం చేసుకున్న చెత్తా-చెదారం, మిగిలిపోయిన ఆహార పదార్థాల వంటివి అన్ని ఇంటి ముందరే పోగు పెట్టేస్తుంటారు. దీనివల్ల ఎంతో దుర్గంధం వ్యాపిస్తుంటుంది. ఇక స్నానాలు ఎవరి ఇంటి ముందర వారు చేసెయ్యటమో లేక ఊరిబావి పళ్లెం మీద చెయ్యటమో చేస్తుంటారు. దానివల్ల పరిసర ప్రదేశాలన్నీ బురద బురదగా తయారవుతాయి.

భరించలేనంత దుర్గంధం వస్తూ వుంటుంది. ఇలాంటి కాలుష్యం వల్ల రకరకాల అంటు వ్యాధులు ప్రబలిపోతూ వుంటాయి. ఆ నీళ్లలో కాసిన్ని ఎక్కడైనా నిలబడిపోయాయంటే ఇహ దోమలకి పండగే అన్నమాట. దోమలు తెచ్చే రోగాలు అన్నీ , ఇన్నీ కావు.

**చెరువులు – అపరిశుభ్రం – రోగాలు**

గ్రామాలలో చెరువుల సంగతి చూద్దాం. చెరువులో ఒక ప్రక్క పశువులని కడుగుతూ వుంటారు. ఇంకో ప్రక్క బట్టలు ఉతుకుతూ వుంటారు. మరో ప్రక్క స్నానం చేస్తూ వుంటారు. చెరువులో ఇంకో ప్రక్కనుండి త్రాగటానికి నీరు ముంచుకు వెళ్తుంటారు. అలాంటి నీటిలో ఎంత కాలుష్యం వుంటుందో, దానివల్ల ఎన్ని భయంకరమైన రోగాలు వస్తాయో వేరే చెప్పనవసరం లేదు.

గ్రామాలే అని కాదు. మహానగరాలలో కూడా మారుమూల ప్రదేశాలలో మురికివాడలలో ఇంతటి అపరిశుభ్రతా, పారిశుద్ధ్యము లేకపోవడం మనకు కనిపిస్తూ వుంటుంది.



## ఆలోచనా సరళి – క్రమశిక్షణ

మనమంతా ఒకే విధంగా ఆలోచించము. సత్యాన్ని పరికించే దృష్టికోణాలు కూడా ఖండఖండాలుగా ఉంటాయి. కనుక పరస్పర అభిప్రాయాలను, సహిష్ణుతతో గౌరవించడం సరియైన పద్ధతి. అందరి ఆత్మశక్తి కూడా ఒకే విధంగా ఉండదు. కనుక ఒక వ్యక్తికి పనికి వచ్చునది అందరూ అనుసరించాలి అనడం వారి ఆత్మస్వాతంత్ర్యానికి భంగకరం.

అభిప్రాయభేదాలంటే శత్రుత్వము కాదు. అది నిజమయితే, నేనూ నా భార్యా బద్ధశత్రువులం అయి ఉండాలి. ప్రపంచంలో, అభిప్రాయ భేదం లేని ఏ ఇద్దరినీ, నేను ఎరుగను. నేను గీతానుయాయిని గనుక నన్ను ఖండించిన వారిని కూడా నా సన్నిహితులకు వలె అభిమానిస్తాను.

# నేను భంగినే

## ప్రకృతి – మనం :

''దైవదత్తమైన ప్రకృతికి మనం సహకరిస్తే ప్రకృతి మనకు సహకరిస్తుంది.'' అందుకని కాలుష్యం ఏ రూపంలో వున్నా, ఎక్కడ వున్నా దాని నివారణ మన కర్తవ్యము.

## కాలుష్య నివారణకు మార్గదర్శి :

1933లో తన హరిజన యాత్రలో మద్రాసులో ఒక మహిళా సభ నుద్దేశించి మాటలాడుతూ ''నేను భంగినే'' అన్నాడు.[1]

మున్సిపాలిటీ, పురపాలక సంఘాల వారిని ప్రజలకు, ఆరోగ్య విధులు, పారిశుద్ధ్య నియమాలు నేర్పమన్నాడు.[2]

ఈ విధంగా సర్వవిధ కాలుష్య నివారణలకు మార్గదర్శి అయ్యాడు.

**హరిజన యాత్రకు వేరే జెండా**

గాంధీగారు ఒరిస్సాలో కాలినడకన పర్యటన గావిస్తున్నారు. ఒకరోజున పై మజిలీకి బయలు దేరబోతూ, అందరూ తమతమ సామానులు సర్దుకొని సిద్ధంగా ఉండగా, ఒక కార్యకర్త కాంగ్రెసు జెండా తీసుకొని ముందుకు వచ్చాడు. గాంధీగారు అతనిని ఆపి, ''ఇది హరిజన యాత్ర. కనుక ఈ సందర్భంలో మనకు జెండా వేరే వుండాలి'' అని అన్నారు. ఈమాట అని వారు ఎన్.ఆర్.మల్కానీ మరియు వియోగహరి వంక చూశారు. వారు ఏమి జవాబు చెప్పకముందే, గాంధీగారు కమాండరు (సేనాపతి) వలె ఆజ్ఞాపించారు : ''మీరు ఇద్దరు చెరొక చీపురు చేత పట్టండి. అది మన పరిశుద్ధతకు చిహ్నమవుతుంది. ఈ మన ఉద్యమమంతా లోపలా బయటా వున్న కుళ్ళును పోగొట్టటానికి చేసేదే కదా!''

1. గాంధీ కథ – కే.ఎస్. ఆచార్యులు – పే. 192
2. గాంధీ కథ – కే.ఎస్. ఆచార్యులు – పే. 202

# సురేంద్రనాథ్

( "Habit is second nature" )

**లక్నో కుట్ర కేసులో భాగస్వామి :**

సురేంద్రనాథ్ లక్నో కుట్ర కేసులో భాగస్వామి. ఆ కేసులో అతనికి అండమాను శిక్ష విధించారు. బాపూకి, గవర్నర్ జనరల్‌కి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలవల్ల ఆశ్రమంలోనే వుండే షరతుపై విడుదల అయ్యారు.

అతను ధృఢకాయుడు. అతని కండ్లలో ఒక రకమైన కాంతి వుండేది. మామూలు మాటలలోనే అతను ఎదుటి మనిషిని ఆకర్షింపచేయగల సమర్థత కలవాడు.

**అండమాన్ జీవనఖైదీ :**

అతని అండమాను జీవనమంతా బ్రిటిషువారి ఇనుప సంకెళ్లను వరించింది. సెల్లు జీవనం అతనికి ఆనంద భవనమయింది. గొంతువరకు నీటిలో కొన్ని గంటలవరకు వుంచితే, అది గంగాస్నానమయింది. ఈలోగా మలమూత్రాదులు, భోజనం సెల్లులో జరిగేవి. అతని సెల్లు జీవనమే తల్లిఒడి అయ్యింది.

ఏదయినా చూసేవాడికి కంటనీరు తప్ప ఏమి మిగిలేది కాదు.

అంతటి కష్టజీవి, త్యాగి సాంగత్యంలో రోజూ కొన్ని గంటలయినా కలిసిమెలసి కబుర్లు చెప్పుకొని సహజీవనం చేసే ఘడియలు నేను ఎలా మరువగలను ?

**లైబ్రరీ పర్యవేక్షణ :**

నాకున్న కార్యక్రమాలలో కొంతకాలం సేవాగ్రాం లైబ్రరీ పర్యవేక్షణ ఒకటిగా నుండేది.

ప్రతిరోజూ ఉదయం పుస్తకాలు, పత్రికలు అన్ని నేను యొక క్రమపద్ధతిలో పెట్టేవాడిని.

**Habit is second nature** :

సురేందర్ ప్రతిరాత్రి పుస్తకాలు చిందరవందర చేసి వాటిపై పడుకొని నిద్రపోయేవాడు. సురేందర్ నాకు నీవు రోజూ పని పెడుతున్నావు అంటే, ఇండ్లు భవనాల సుఖాలు మరచి 20 ఏండ్లు అయింది. యేదయినా అండమాన్‌లో చిందరవందరగా వున్న రాళ్ళపై నిద్రించిన అలవాటు వలన చాప వద్దనే వాడు. చిందరవందరగా వున్న కాగితాలపై పడుకొనే వాడు. అందువల్ల చాపపై అతను పడుకున్నా నిద్ర పట్టేది కాదు. మరొక మాటలో చెప్పాలంటే సుఖము, ఆనందము నిచ్చే చాప అతనికి రుచించేది కాదు. నన్ను యిలా వుండనీ అని, నా గడ్డంపై చేయివేసి అన్నీ సర్దుకోమని బుజ్జగించేవారు. అతనికి మరో అలవాటు ప్రతిరోజూ ఆశ్రమంలో 30 – 40 బకెట్లనీరు చెమట వచ్చేదాకా తోడి అందరికీ స్నానం చేయించడంలో అతనికి సరదాగా వుండేది. అదేమిటంటే కష్టించకుండా ఫలితం ఎలా దక్కుతుంది అనేవాడు. శ్రమకు విలువ కట్టడం కష్టం.



# బాపూ - వేపాకు ప్రసాదము

బాపుజీ ఆహారం సమతుల ఆహారం. అయితే అందులో ఉప్పు, కారం మాత్రం వుండేది కాదు. అదీగాక, ఆయన తీసుకునే ఆహారం సాత్వికాహారంగా ఉండేది.

వేపాకు ప్రాముఖ్యత గుర్తించి సాయి మహారాజా వేపాకు ఉన్న స్థలంలో యాత్రీకుల భవన స్థలం నిర్దేశించాడు. చల్లని నీడ, గాలికి వేపచెట్టు ప్రసిద్ధి.

ప్రభాకర్‌జీ బాపూ వద్ద నుండి వేపాకు ప్రసాదం తీసుకునేవాడు. బాపూజీ పట్ల వున్న గురుత్వాన్ని బట్టి అతను అలా చేస్తున్నాడని నేను భావించాను.

వేపాకు బ్లడ్ ప్రెషర్ (రక్తపోటు) కు, క్రిమి నిర్మూలానికి మంచిదని, పాము కరచినా, విషము వంటికి పాకదనే నమ్మకాలు ప్రజలలో ఉన్నాయి. వైద్యులు కూడా ఈ అభిప్రాయాలను స్థిరపరిచారు.

నేను కూడా బాపూజీ దృష్టిలో పడడానికి యిదొక మార్గమనిపించింది. కాని వేపాకు ప్రసాదం తీసుకున్నంత మాత్రాన నేను ఆయన దృష్టిలో పడగల్గుతానా? అలా అయితే వేపాకు ప్రసాదం తీసుకొనని వారందరూ వారి దృష్టిలో లేనివారేనా? అనే ప్రశ్న పరంపరలు, అనుమానాలు నాలో రేకెత్తినవి. పైగా ఒకసారి తీసుకొని తరువాత మానివేస్తే, ఎవరేమన్నా అనుకుంటారేమో ! బాపూజీ కూడా నేను వేపాకు ప్రసాదం కొంత కాలం తీసుకొని మానివేస్తే తప్పుగా అర్థం చేసుకొంటారేమోనన్న భయం వేసింది.

**గురువు – తీర్థ ప్రసాదాలు :**

అయితే హిందూ సాంప్రదాయంలో గురువు శిష్యులకు తీర్థప్రసాదాలు ఇచ్చే ఆచారం ఉంది.

ప్రభాకర్‌జీ బాపూజీని గురువుగా భావించిన మాట సత్యం. నేను బాపూజీని గురువుగా భావించలేదు. గాంధీ ఆశ్రమంలో వుండి, హింస-అహింస అంశంపై సరియైన అవగాహన చేసుకొని, నా భవిష్యత్తు కార్యక్రమాలు నిర్ణయించుకోవాలనేదే ఆనాటి నా ఉద్దేశ్యం. ఆ దృష్టితోనే గాంధీజీ సిద్ధాంతాన్ని అర్థం చేసుకోవాలనే నా అభిలాష.

**మానసిక సంఘర్షణ :**

ఈ మానసిక సంఘర్షణ జరుగుతున్న రోజులలో, ఒకరోజు ప్రభాకర్‌జీ, ''రాజన్నా, ప్లేటు తీసుకో, నాతో రా'' అన్నారు. అలాగే చేసాను. బాపూ ఒక వుండ వేపాకు ప్రసాదం ఆయన పళ్ళెంలో ఉంచారు. వారితో వెళ్ళి, నా పళ్లెం కూడా బాపూజీ ముందు అప్రయత్నంగా వుంచాను. బాపూజీ వేపాకు ముద్ద నా పళ్లెంలో పెట్టారు. బాపూతో చూపులు కలిసాయి. బాపూజీ దృష్టి నాపై ప్రసరించింది. అది నా అదృష్టం.

**కాలం పరిష్కరించింది :**

మనసు తేల్చుకోలేని సమస్యలను కాలమే పరిష్కరిస్తుందనే పెద్దల మాట నిత్య సత్యము. ఈ ఘట్టంలో ప్రభాకర్‌జీ, ''రా, రాజన్నా, ప్రసాదం తీసుకొందాం'' అన్న మాటయే ప్రసాదం తీసుకోవాలా, వద్దా అనే సమస్యను పరిష్కరించింది. తీర్థం విశ్వాసం కాదు. ఆనాటి నుంచి ప్రతిరోజు ప్రసాదానికి పోయేవాడిని. ఈ విధంగా సాన్నిహిత్యం, ఆప్యాయత పెరిగింది. బాపూజీ కూడా నాపేరుతో సంబోధించే దశ ఏర్పడింది. వారి పట్ల గురుత్వం ఏర్పడింది. వేపాకు ప్రసాదం ఫలితమిది.



# మసాలాదినుసులు

ఆహారాన్ని గురించి వివరిస్తున్నప్పుడు నేను మసాలాలను గురించి ఏమీ ప్రస్తావించలేదు. ఉప్పు మసాలాదినుసులకు రాజా అని చెప్పవచ్చు. ఉప్పులేకుండా మనిషి ఏ పదార్థమూ తినలేకపోవడమే అందుకు కారణం. కనుకనే ఉప్పును సర్వరసం అని కూడా అంటారు. శరీరానికి పలుక్షారపదార్థాలు అవసరం. వాటిలో ఉప్పు కూడా ఒకటి. క్షార పదార్థాలన్నీ మనం తీసుకునే ఆహారంలో వుంటాయి. అయితే ఈ పదార్థాల్ని అశాస్త్రీయ పద్ధతిలో వండటంవల్ల క్షారగుణాల పరిమాణాలు తగ్గిపోతున్నాయి. అందువల్ల వాటిని అదనంగా తీసుకోవలసి వస్తున్నది. ఉప్పు అత్యవసరమైన క్షార పదార్థం. అందువల్ల దాన్ని కొద్ది పరిమాణంలో విడిగా పుచ్చుకోమని చెప్పాను. ఇంకా చాలా మసాలాదినుసులు అవసరం లేకపోయినా రుచి కోసమో, జీర్ణశక్తి కోసమో తీసుకుంటున్నాము. ఉదాహరణకు, ఆకుపచ్చని లేక ఎర్రని ఎండు మిరపకాయలు, మిరియాలు, పసుపు, ధనియాలు, జీలకర్ర, ఆవాలు, మెంతులు, ఇంగువ మొదలగునవి 50 సంవత్సరములు వాడాను. వీటి ప్రయోగాలవల్ల అనుభవం గడించి చెబుతున్నాను. శరీరాన్ని వ్యాధిగ్రస్తం కాకుండా వుంచుటకు పైన తెలిపిన వాటిలో ఒక్క దాని అవసరం కూడా లేదు. శక్తి తక్కువగా వున్నవాళ్లు ఔషధరూపంలో, నిశ్చిత పరిమాణంలో మసాలాదినుసులు వాడవలసివస్తే వాడవచ్చు. కాని రుచికోసం అయితే మాత్రం వీటి ప్రయోగాన్ని పట్టుదలతో నిషేధించవలసిందే. మసాలా దినుసులు, (ఉప్పుతో సహా అన్నీ) ధాన్యానికి, కూరగాయలకు సహజంగా గల శక్తికి నష్టం కలిగిస్తాయి. చవిచెడని నాలుకగల మనిషి సామాన్య పదార్థాల రసాన్ని ఆస్వాదిస్తాడు. మసాలాదినుసులుగాని, ఉప్పుగాని వేసినప్పుడు అట్టి రుచిని ఆస్వాదించలేడు. కనుక నేను అవసరమైతే ఉప్పును విడిగా వాడమని సూచించాను.........

ఆరోగ్య దీపిక - పే. 335.

# నాలుకపై నియంత్రణ

బ్రహ్మచర్యపాలనకు జిహ్వ, రసనల రుచి గ్రహణ విషయం గురించి అదుపు అవసరం. దానితో కామవాసనారాహిత్యం సుకరమవుతుంది. దీన్ని గురించి ఆనాటి మహర్షులు కూడ చెప్పలేదు. కాని ఆశ్రమనియమాలలో దీని విషయమై శ్రద్ధ చూపడం జరిగింది.

''రుచి''ని తృప్తి పరిచేందుకు కాకుండా, ఔషధంలాగ శరీరావసరాలు తీర్చడానికి, రుచితో పనిలేకుండా, ఆహారం తినాలి. ఔషధంలాగానే, తగిన మోతాదు మరచి, తక్కువగా లేక ఎక్కువగా ఆహారాన్ని తీసుకుంటే, తిప్పలు తప్పవు. ప్రియమైనది ఎక్కువగా తినడం, రుచికోసం ఉప్పువేయడం మున్నగునవి నియమ భంగమే. ఆరోగ్యదృష్ట్యా కనీసపు జోడింపులు, తగ్గింపులు పరవాలేదు. అనుమిషతో రుచులకు బానిస కావడం డంబాచారం.

పౌష్టికత్వానికి అవసరం కాని అనేక తినుబండారాలను వదిలి వేయాలి. అప్పుడు స్వచ్ఛందంగా- ఆత్మబలం పెరిగి సరియైన ఆహారసేవనకు దారిదొరుకుతుంది. తల్లిదండ్రులు వెర్రి ఆపేక్షతో పిల్లలకు ఏవేవో తినిపించి, వారికి అసహజమైన రుచుల ఎడ ప్రీతి కలిగిస్తారు. ఒళ్ళు పాడయి, జీవితమంతా అసహజ పరిణామాలు వచ్చి, వైద్యుని చేతిలో పడి ఇల్లూ, వళ్లూ గుల్ల చేసుకుంటారు. దీన్ని గురించి ఎక్కువగా ఎవరూ దృష్టిసారించడం లేదు.

మనలో చాలామంది భోగలాలసతతో ఇంద్రియాలకు బానిసలం అవుతాము. అందువల్లనే ''ఆరోగ్యవంతుడు'' ఒక్కడూ కనుపించడు. ఎక్కువ తిండి వలన కలిగే అసౌకర్యం 'ఉపవాసం' తో కొంత సర్దుకుంటుంది.



# బుద్ధిజీవుని ఆహారం

బుద్ధిజీవుడైన మనిషికి 24 గంటల కాలానికి అవసరమైన క్రింద తెలిపిన ఆహారాన్ని ప్రామాణికంగా మనం భావించి అంగీకరించవచ్చు.

1. ఆవుపాలు – 2 పౌండ్లు.
2. ధాన్యం – 6 ఔన్సులు, అనగా 15 తులాలు బియ్యం, గోధుమలు, సజ్జలు మొదలగునవి కలిపి.
3. కూరలు – ఆకు కూరలు 3 ఔన్సులు తదితర కూరలు 5 ఔన్సులు.
4. పచ్చికూరలు – ఒక ఔన్సు.
5. నెయ్యి – 3 తులాలు లేక వెన్న – 4 తులాలు.
6. బెల్లం లేక చక్కెర – మూడు తులాలు.
7. తాజాపండ్లు (దొరికితే) రుచిని బట్టి, ఆర్థిక శక్తినిబట్టి.

ప్రతిరోజూ రెండు నిమ్మకాయలు తీసుకుంటే మంచిది. నిమ్మకాయరసం పిండి, కూరలో కలిపిగాని లేక నీటితో గాని కలిపి తీసుకోవాలి. అలా చేసినందువల్ల పులుపు ప్రభావం పళ్ల మీద పడదు.

ఉప్పు ఏ పరిమాణంలో వాడాలో యిక్కడ పేర్కొనలేదు. రుచిని బట్టి దాన్ని అవసరమైనంత వాడవచ్చు.

మనం రోజుకు ఎన్నిసార్లు తినాలి? చాలామంది జనం రోజూ రెండుసార్లు భోజనం చేస్తూ వుంటారు. సామాన్యంగా మూడుసార్లు కూడా తినడం చూస్తున్నాం.

ఉదయం పని ప్రారంభించే పూర్వం ఒకసారి, మధ్యాహ్నమప్పుడు రెండోసారి, సాయంత్రం లేక రాత్రిపూట మూడోసారి. యింతకంటే మించి తినవలసిన అవసరం లేదు. పట్టణాల్లో వుండేవాళ్లు అప్పుడప్పుడు ఏదో ఒకటి తింటూ వుంటారు. దీనివల్ల నష్టం కలుగుతుంది. ఆమ్లాశయానికి అవసరమైన విశ్రాంతి యిచ్చితీరాలి.

(యంగ్ ఇండియా, 10-3-1920. పుట – 5)

# సమతుల ఆహారం

**పెట్టుబడి ఎలా ? :**

బాపూ 'యంగ్ ఇండియా' లో తను రోజూ తిను ఆహారాన్ని గురించి ఈ క్రింది విధంగా పొందుపరచారు.

1. నానపెట్టిన గోధుమలు 8 తు.
2. Paunded Almonds 4 తు.
3. Whole Almonds 1 తు.
4. ఆకుకూరలు e.g. Marram, (dudhi) 1 తు.
   or Cucmber or Kalija (grated)
5. Raisins (Fresh Fruits) 20 తు.
6. నిమ్మకాయలు 2
7. తేనె 4 తు.

వీటి quantity, variety నిర్ణీతంగా లేదు. వీలయితే గోధుమ ఆల్మండ్ వదలివేస్తాను. మొలకలు వచ్చిన శనగలు, తురిమిన కొబ్బరి, గోధుమ ఆల్మండ్‌కు బదులు తీసుకొంటాను. చదువరులు తేనె బదులు బెల్లం తీసుకోవచ్చును. కొద్ది పరిమితిలో పంచదార బదులుగా వాడవచ్చును. మొదటి రోజులలో పొట్ట అంతా ఖాళీ వున్నట్లు అనిపిస్తుంది. దీనిని అలవాటు అయ్యేటంతవరకు తెచ్చుకోవాలి. ఎక్కువలో ఎక్కువ ఈ ఆహారం తీసుకోవచ్చు.

1. మొలకలు వచ్చిన గోధుమలు 20 తు.
2. మొలకలు వచ్చిన శనగలు 8 తు.
3. కూరగాయలు 1 అ.తు.
4. కొబ్బరి 8 తు.
5. కిస్‌మిస్ 4 తు.
6. నిమ్మకాయ 1
7. పాలు 1/2 పౌండు
8. పండ్లు లేదా నెయ్యి 2 తు.

పాలు, నేయి తక్కువగా వాడవలెను. కావలసిన వారు ఎక్కువ తీసుకోవచ్చు. ఉప్పు నేను ఒక నెల వరకు మానివేశాను. దానివల్ల నేను బలహీనపడుతున్నానని డాక్టర్లు చెప్పారు. నేను ఆల్మోరాలోని ఉప్పు తీసుకోసాగాను. తేనెను 3 సార్లు వేడినీళ్లతో తీసుకునేవాడిని.

---

1) యంగ్ ఇండియా 18.7.29.

# సమతుల ఆహారం

పూజీ పంక్తిలోని ఆహారం రొట్టెతో పాటు - పండ్లు, తాటి బెల్లం, వెన్న, కాయకూరలు, ఆహారంలోని భాగాలుగా వుండేవి. భోజనంపై ఖర్చు ండింది. సాధారణ మనిషికి అందుబాటులో వుండింది కాదు. అందుకని ుత్రులు బాపూజీతో భోజనం చేసేవారిని "హౌస్ ఆఫ్ లార్డ్స్" సభ్యులనే

ు సింగుతో వున్నవారు జొన్నరొట్టె, వెల్లిపాయ కారం, పచ్చి ఉల్లిపాయలు కం ఆహార పదార్థాలతో వుండేది. కావున తమతో భోజనం చేయు.వారంతా ామన్స్ (House of Commons)" సభ్యులని తరచూ అనే వారు.



# సేవాగ్రాంలో House of Lords

ఆశ్రమంలో బాపూ ఆహారాన్ని గూర్చి ప్రాంతీయ ఆహారాన్ని గూర్చి తమాషాగా అనేక చర్చలు జరిగేవి.

సర్దార్ పృధ్వీసింగ్ అండమాన్ ఖైదీ. అలాగే లక్నో కుట్రకేసులోని సురేంద్రనాథ్. వారిద్దరూ నవ్వుకుంటూ, ''తూ రోటీ హై, మై చావల్ హూఁ' అని అనుకునేవారు. నేను వారితో తరచూ కాలాన్ని గడిపేవాడిని. ఆంధ్ర, బెంగాలీ వర్గం, చావల్ ముఠా అని పేరుబడ్డది. నన్ను సురేంద్రనాథ్ బెనర్జీ ''అరే చావల్'' అని పిలవడం జరిగేది. పొరపాటున ఎప్పుడైనా నేను గాంధీజీతోపాటు భోజనానికి వెడితే ''హౌస్ ఆఫ్ లార్డ్సు''కు పోయావా? అని అడిగేవారు. శ్రీ పృధ్వీసింగ్ జొన్నరొట్టె, గోధుమ రొట్టెతో మామూలు భోజనం చేసేవాడు. అతనితోపాటు వున్న వర్గమంతా 'హౌస్ ఆఫ్ కామన్స్' అని పిలువబడేవారు. వారి దృష్టిలో గాంధీగారు తినే వెన్న, కూరగాయలు, వీటి విలువ, లేక ఖరీదు ఎక్కువని, అవి ధనవంతుల భోజనమని వారి నమ్మకము. అందుకని వారు గాంధీజీతో భోజనం చేసే వారందర్నీ 'హౌస్ ఆఫ్ లార్డ్సు' సభ్యులుగా భావించేవారు. నేను మొదటి రోజులలో కొంచెం అటూ యిటూ వుండేవాడిని. తరువాత శ్రీ ప్రభాకర్‌జీ, నేను గాంధీజీతోనే సహపంక్తిని భోజనం చేసే ఆశ్రమవాసినయ్యా. అందుకని మమ్ములను కూడా "House of Lord Members" అని అనేవారు. శ్రీ పృధ్వీసింగ్ రోజు రెండు మైళ్ళైనా పరుగెత్తాలని, అది విప్లవ ఉద్యమంలో చాలా అవసరమని అంటూ ఉండేవాడు.

తీరిక సమయాల్లో మేము ముగ్గురమూ కలిసినపుడు మీ వెన్న రొట్టెకి, మేము అండమాన్ జైల్లో తిన్న పచ్చికూరలు, పచ్చిగడ్డి, వానపాములకు గల తేడా మాకు తెలిసినట్లు మీకేం తెలుసని అనేవాడు. మా నాలుక ఆకులు, గడ్డి, వానపాములతో నిండిన ఆహారానికి అలవాటు పడ్డది. నాలుక దేనికైనా అలవాటు పడుతుంది. అది పరిస్థితి, అవకాశాల మీద ఆధారపడి వుంటుంది. నీవు పోయి బాపూజీతో భోజనం చెయ్యి అనేవాడు.



# కస్తూరిబా - పాము

'శివుడి ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు' అనేది ఆర్యోక్తి.

**కుండలో పాము :**



ఆశ్రమంలో ఒకరోజు కస్తూరిబా వంట గదిలో రొట్టెలు చేస్తున్నది. ఆ సమయంలో ఒక పాము ఆగదిలోనికి వచ్చినది. ఒక మూల నున్న కుండనానుకొని పాము వున్నది. బా పామును చూసింది. ఏమి చేయాలో తోచలేదు. ఈలోగా ఆకుండ లోకి పాము దూరింది. బా నిర్భయంగా కుండపైన ఒక మూతపెట్టి, దానిపై ఒక బరువు పెట్టింది. బా బయటకు వచ్చి, 'పాము, పాము'ని కేకలు వేస్తే మేమందరమూ వెళ్ళాము.

**పామును చంపండి :**

ఆశ్రమంలో బలవంత్ సింగ్ వ్యవసాయ నిర్వాహకులు. అతను పరిస్థితి చూసి, ధైర్యము వహించి పామున్న కుండను మూతతో సహా భోజనశాల ముందు పెట్టారు. సురేందర్ చూస్తారేమిటి ? లాఠీతో కుండను బద్దలుకొట్టి, పామును చంపమని కేకలు వేసాడు.

**గాంధీ ఆశ్రమంలో అలా చేయవచ్చా ?**

ఆ పామును బంధించింది సేవాగ్రాంలో. అదీ గాంధీగారి ఆశ్రమంలో పామును చంపడం ఎలా? అది హింసగదా అని అందరూ వెనుక ముందు కాసాగారు.

**గాంధీజీనే అడుగుదాము :**

చివరకు అందరమూ బాపూజీకి ఈ విషయం చెప్పిన మీదట తగు చర్య తీసుకొందామని నిర్ణయించాము. ఈలోగా బాపూజీ చూసేటట్లుగా బలవంత్ సింగ్‌జీ ఉపాయంగా ఆపామును పందికొక్కు బోనులోకి పోయేటట్లు చేసి మూతబిగించారు. తరువాయి ఆ బోనుని బాపూజీ చూసేటట్లుగా భోజనశాలకు పోయే దారిలో పెట్టాడు. బాపూజీ భోజనానికి వస్తున్నప్పుడు ప్రభాకర్‌జీ ప్రక్కప్రక్కన నడుస్తూ బాపూ చూడండి అంటూ పాము వున్న బోనుని చూపాడు.

బాపూ స్పందన :

బాపూజీ దానిని చూచి 'సాంప్, బహుత్ సుందర్ హై' (పాము చాలా సుందరంగా వున్నది) అంటూ భోజనానికి వెళ్ళారు.

సమస్య మరింత జటిలమైనది. పామును చంపడమే తప్పుకదా అనేది మొదటి సమస్య . బాపూజీ అది 'సుందరమైన పాము' అన్న మీదట, చంపడం ఎలా? అని ఆశ్రమవాసులందరూ చర్చించుకోసాగారు.

పాముకు పాలుపోసి పెంచుట :

ప్రతిరోజూ బాపూజీ మాత్రం ఆ పామును పలుకరించునట్లుగా చూసి, పరిశీలించి భోజనానికి పోతుండేవారు. ఆశ్రమవాసులు దానికి పాలుపోసి పెంచసాగారు.

బలవంత్‌సింగ్ కలిసినప్పుడల్లా ఆశ్రమవాసులను మీపాము ఎలావుంది? అని అడుగసాగారు.

పాము కూడా ఆశ్రమవాసియే

రోజూ ఆ పాముపట్ల బాపూజీ విచారణవల్ల అందరూ పామును పోషించడం తప్ప వేరే గత్యంతరం లేదనుకొన్నారు. అందరూ తమలోతాము నవ్వుకుంటూ 'యహ్‌భీ ఆశ్రమ్ కా ఏక్ మెహమాన్ హై' (ఇది కూడా ఆశ్రమానికి అతిథే) అనుకుంటూ పాముకు పాలుపోసి పెంచసాగారు.

బలవంత్ సింగ్‌కు ఈ బాధ్యత మేనేజర్ చిమన్‌లాల్జీ అప్పజెప్పారు. బలవంత్ సింగ్‌జీ పాముకు రోజూ పరిచర్య చేయలేని దశ వచ్చింది. విసుగు పుట్టింది. ఆ విసుగులో పామును పొలాల్లో వదలి వేసారు.

ఆ మధ్యాహ్నం బాపూజీ 'పాము ఏమైందని' అడిగారు. ప్రభాకర్‌జీ పామును పొలాలలో వదిలామని చెప్పారు.

పాముకు స్వేచ్ఛ :

అయితే దానికి మీనుండి విముక్తి, ఫ్రీడమ్ (స్వేచ్ఛ) దొరికింది కదా ! అనుకుంటూ బాపూజీ భోజనానికి వెళ్ళారు.

రాముని ఆజ్ఞ లేనిదే బాపూ కూడా పామును చంపమని ఎలా చెపుతారు !



# భయరాహిత్యం

''గీత'' పదహారవ అధ్యాయంలో భయరాహిత్యం దైవ గుణాలకు తలమానికమని ఉన్నది. ''ఛందోపూర్తి దీనికి కారణమా? ఇది నిజమా? ''

బాహ్యమైన అనారోగ్యం శరీరబాధ, మరణం. ''తనది ఎవరైన బలిమిని తీసుకుంటారనే'' అభద్రతాభావం, ప్రియతమ బంధువులను పోగొట్టుకోవడం, పేరుపోతుందని – ఎవరినైనా అసంతుష్టికి గురి చేస్తామని భయాందోళనలు – వీటన్నిటి నుంచి ముక్తి అభయ భావం. మృత్యువుకు భయపడని వాడు, తదితర భయాల కతీతుడనుకోడం తప్పు. మనలో కొందరికి చావంటే భయం లేదు. కాని అనారోగ్యమంటే భయం. తాము చావగలరు. కాని తమ ప్రియతముల చావును భరించలేరు. లోభికి తన ఆస్థి ముఖ్యం. ఇంకొందరు మిథ్యాప్రసక్తి కోసం ఎన్ని నికృష్టకార్యాలనైనా చేస్తారు. మరి కొందరు చెడ్డపేరు వస్తుందని భయంతో దారి తప్పుతారు. సత్యాన్వేషి హరిశ్చంద్రుడి వలెనే వీటన్నిటినీ అధిగమించాలి. ఈ దశలో ఎవరి అనుభూతి వారిది. అన్నీ చరిత్రలో ప్రసిద్ధి చెందినవే.

దైవాంశను గ్రహించిన వారే పూర్ణ అభయాన్ని పొంది, కుహనాభావాలను త్యజిస్తారు. సాధన, ఏకాగ్రత, ఆత్మ విశ్వాసం ప్రతి వ్యక్తిని గమ్యం వైపు తీసుకుపోతాయి.

బాహ్యమైన భయాలను విడనాడాలి. మరి అంతరంగిక భయాలు వాసన, క్రోధం, కామం – వీటి నుంచి రక్షణ కల్పించుకోవాలి.

★★★

సెయింట్ పాల్ నిర్వచించినట్లు మాత్రమే కాక అంతకుమించినది ప్రేమ. ''అహింస''లో ''మానవులు'' మాత్రమే కాదు. జీవకోటి అంతా ఉంది. ఇంగ్లీషు మాట ''లవ్'' అంటే వాసనాది అర్థాలు కూడా స్ఫురిస్తాయి. కనుక హింసకు వ్యతిరేకమైన అహింస అనే నిషేధాభివాదాన్ని ఉపయోగించాను. అయితే ఇందులో వ్యతిరేకమైన శక్తి లేదు. అన్ని శక్తుల కతీతమైన యోగశక్తి యిది.

(హరిజన్ 14 – 3 – 36. పుట 39)

# గాంధీజీ - జిన్నా భేటి

తెలతెలవారుతున్న వేళ ఒక పెద్దమనిషి వణుకుతూ సేవాగ్రాం ఆశ్రమంలో బాపూ ప్రార్థనాస్థలంలో నిలుచొని వున్నాడు. అతను ఎందుకో బాపూజీ కుటీరము వైపు తీక్షణముగా చూస్తున్నాడు.

మీరెవరని అడిగా ?

నేను అతని వద్దకు వెళ్లి, 'మీ రెవరు ? ఏం కావాలి ? ఎవరి కోసం చూస్తున్నారు?' అని అడిగాను. నా ప్రశ్నలకు జవాబుగా నేను హిందూ మహాసభకు చెందిన వాడిని. నాపేరు 'ధత్తే' అని (చెప్పినట్లు నాకు జ్ఞాపకం) చెప్పాడు. బాపూజీ హిందువు. జిన్నావద్దకు వెళ్లకూడదు. జిన్నానే బాపూ వద్దకు వచ్చి సంభాషణలు జరపాలని చెప్పడానికి యిచటకు వచ్చానని తెలిపాడు.

బాపూ మీకై గోయి తీశారు :



ఇంతలో బాపూజీ వ్యాహ్యాలికి బయలుదేరారు. మేము యిరువురము బాపూజీ వద్దకు చేరగానే నేను 'బాపూ' అన్నాను. బాపూ మావైపు చూశారు. వారి చూపు మాపై పడగానే, ధత్తే ఆవేశంతో, 'బాపూ మీరు హిందువులు. జిన్నా, మీకై 'ఖడ్డా' (గోయి) తీసి వుంచాడు. మీరు సంభాషణకై వారివద్దకు పోవద్దు. వారు తవ్విన గోయిలో మీరు పడకూడదు. మీరు హిందువులు. మీకూ, మాకూ అగౌరవం. నా మాట నమ్మండి' అన్నాడు.

తాను తీసిన గోయిలో తానే పడతాడు :

బాపూ శాంతంగా ఈమాటలు విని, 'హిందువులలో తాను తీసిన గోయిలో తానే పడును అనే సామెత వున్నది. ఈ సామెతను నేను నమ్ముతాను. నాకు భయము లేదు.

నీవు హిందువగుటచే నీవును భయపడవద్దు అంటూ తన రోజువారీ నడక సాగించారు. వారి వెంట నేను, ప్రభాకర్‌జీ వాహ్యాళిలో పాల్గొన్నాము.



## ద్విజాతీయ సిద్ధాంతము

*1944లో లార్డ్ ఎవెల్ ముఖ్యమైన గ్రూప్‌లో మైనారిటీలు ఒక ఒడంబడికకు వస్తే జాతీయ తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచవచ్చు అను అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఇందుకు నాందిగా హిందువులు ద్విజాతీయ సిద్ధాంతాన్ని అంగీకరించాలని జిన్నా కోరారు. గాంధీజీ అది భారతదేశానికి ముప్పని, దేశాన్ని తునకలు తునకలు చేయగలదని భావించి, అందుకు అంగీకరించలేదు.*

ఎమ్.ఎమ్.జిన్నాగారికి సెప్టెంబర్ 24, 1944.

ప్రియమైన ఖాయిదే ఆజమ్‌గారికి,

ఇండియా రెండు లేక మూడు జాతుల సమ్మేళనం కాదనే భావంతో ముందుకు సాగుతున్నాను. ఇది వివిధ సభ్యులు కలిగిన ఒక కుటుంబం వంటిది. వాయవ్యంగా - బెలూచిస్థాన్, సింధ్, ఉత్తర సరిహద్దు ప్రాంతాలలో, కొంత పంజాబులో ముస్లిమ్‌లు బహుళ సంఖ్యలో ఉన్నారు. బెంగాలు అస్సాములలో వారు బహు సంఖ్యాకులుగా ఉన్నారు. వారు భారతదేశం నుండి వేరుపడ వలెనని కోరుతున్నారు. ఇది సమస్య.

మూల సిద్ధాంత విషయంలో మీతో విభేదిస్తూ లాహోరు ముస్లిం లీగ్ తీర్మానాన్ని అనుసరించి ముస్లిం బహుళ ప్రాంతాలలో విభజనను అంగీకరిస్తూ కాంగ్రెసుకు ఈ క్రింది షరతుల మీద అంగీకరించమని సలహా చెప్పగలను.

కాంగ్రెసు ముస్లిం లీగ్ అంగీకరించిన కమీషన్ (సమితి) క్షేత్రాలను విభజించే సలహా ఇవ్వగలదు. ఆ విభజించిన ప్రదేశాలలో వయోజన వోటింగు ననుసరించిగానీ, ఇంకొక విధంగాగానీ ప్రజల అభిప్రాయాన్ని తెలుసుకొనవలెను.

వోట్లు విభజనకు అనుకూలంగా ఉంటే వాటిని విభజించి ప్రత్యేక ప్రాంతాలుగా గుర్తించవలెను. విదేశీ శక్తుల నుండి బయటపడిన వెంటనే వీలైనంత తొందరలో రెండు స్టేట్లుగా ఏర్పాటు చేయబడవలెను.

విదేశీ వ్యవహారాలు, దేశరక్షణ, ప్రచార సాధనాలు, సుంకములు, వ్యాపారము వంటి విషయాలను దృష్టిలో పెట్టుకొని ఒప్పందం జరుగవలెను. అవి రెండు దేశాలకూ సమానంగా వుండగలవు.

రెండు స్టేట్లలో అల్ప సంఖ్యాకుల రక్షణకు, హక్కులకు సంబంధించి హామీలుండవలెను.

కాంగ్రెస్సు, లీగూ ఈ ఒప్పందాన్ని అంగీకరించిన తరువాత సంపూర్ణ స్వరాజ్య సాధనకై కలిసి పని చేయగలవు.

లీగ్ ప్రత్యక్ష చర్యకు దూరంగా ఉంటుంది. కాంగ్రెస్సు ఆ చర్యకు పూనుకుంటుంది.

ఇవి మీకు అంగీకారం కాకపోతే లాహోరు తీర్మానాన్ని దృష్టిలో పెట్టుకొని, మీ షరతులను తెలియజేయండి. అది మీరు చేస్తే ఎన్ని అభిప్రాయభేధాలున్నా వాటిని కాంగ్రెసుకు సిఫారసు చేసి పంపుతాను. మీ 23 సెప్టెంబరు ఉత్తరంలో

లాహోరు తీర్మానంలోని మౌలిక హక్కులను గురించి ఉటంకించి ఉన్నారు. వాటిని అంగీకరించమన్నారు. అది అవసరం లేదు.

మీ

ఎమ్. కె. గాంధీ

ప్రియమైన ఖాయిదే ఆజమ్,

నిన్నటి మీ వుత్తరం కలచి వేసింది. మన మిద్దరం ఎదురుఎదురుగా కలుసుకొనేదాకా జవాబు వ్రాయకూడదనుకొన్నాను. మన కలయిక వలన పెద్దగా ప్రయోజనం కలుగకపోయినా మీ భావాలను స్పష్టంగా అర్థం చేసుకొనగలిగాను. రెండు జాతుల( ద్విజాతి) సిద్ధాంతాన్ని గురించి ఆలోచించిన కొద్దీ అది చాలా ప్రమాదకరమేమో ననిపిస్తుంది. దానిలో అర్ధ సత్యాలున్నవి. దానిలోని ముగింపు నిర్ణయాలు అవసరం లేనివి. ఇండియాలోని యితర జాతులకంటే ముస్లింలు ప్రత్యేక జాతి అనడాన్ని నేను అంగీకరించలేను. గట్టిగా వాదించడం రుజావు కాదు. అది సోదరుల మధ్య పంపకంలాగా వుండాలి.

జనాభిప్రాయ సేకరణకు మీరు వ్యతిరేకంగా వున్నారు. లీగ్‌కు గల ప్రాధాన్యాన్ని గుర్తించినా ప్రజలు విభజన కోరుతున్నారో లేదో తెలుసుకోవాలి గదా ! వారు ఈవిషయమై తమ అభిప్రాయాన్ని స్పష్టం చేస్తారు. వయోజన వోటింగు మంచి పద్ధతి. మీరింకేదైనా పద్ధతి సూచిస్తే నేను అంగీకరిస్తాను.

రెండు చేతుల మధ్య వున్న సమాన బాధ్యతలను గూడా మీరు అంగీకరించడం లేదు. సైన్యము-విదేశనీతి వంటి సమాన విషయాలలో రక్షణ కల్పించకుండా నేను దేశ విభజనకు అంగీకరించలేను.

మీ ఉత్తరాన్ని బట్టి మన భావాలు ఒకదాని కొకటి వ్యతిరేకంగా వున్నట్లు తెలుతున్నది. 1942లో చేసిన తీర్మానాన్ని మీరు ఉల్లంఘిస్తున్నారు. దానికి పెద్ద ఆధారాలు కనబడడం లేదు. మనం ఒక సుడిగుండంలో వున్నామనిపిస్తున్నది. నేనొక సూచన చేస్తాను. విభజన అంగీకరించటం తప్పకపోతే మధ్యవర్తుల మీద ఆధారపడదాము. వారు మనకు మార్గదర్శకత్వం వహిస్తారు. మన మధ్య అంగీకారం కుదురుస్తారు.

---

మహాత్మాగాంధీ రచనలు - సం. 4, పే.142

ఈ విధంగా గాంధీజీని హిందువుగా జిన్నా చిత్రించాడు. గాంధీజీ హిందువు, కావున జిన్నా వద్దకు తానేపోయి మాట్లాడడం హిందువుల ప్రతిష్ఠకు భంగమని మరికొందరు భావించారు.

# విగ్రహారాధన - తీర్థ ప్రసాదాలు

1941 లో నేను సేవాగ్రాం ఆశ్రమంలో వున్నాను. ప్రభాకర్‌జీ కూడా ఆకాలంలో అచట వున్నారు. మా యిరువురికి మైత్రి పెరిగింది. ప్రభాకర్‌జీ నన్ను రాజన్నా అని పిలిచేవారు.

ప్రభాకర్‌జీ హరిజనుడు. నేను శ్రౌతశైవ ఆరాధ్య బ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడిని. ప్రభాకర్‌జీ విగ్రహారాధకుడు కాదు. నేను మాత్రం ఆచార సాంప్రదాయాన్ని బట్టి స్ఫటికలింగంపై నీరు పోసి, అభిషేకము చేసి, దానిని తీర్థంగా తీసుకొనేవాడిని. మా ఆరాధ్య సాంప్రదాయంలో దానిని మజ్జనం అంటారు. ఈ విధంగా నేను విగ్రహారాధకుడను. అయినా, మా కలయిక, నడవడి, ప్రేమ, అభిమానాలు, ఆప్యాయతలు ఒక కుటుంబంలోని అన్నదమ్ముల వలె వుండేవి.

ఆశ్రమంలో వివిధ ప్రాంతీయులు, విభిన్న మత, కుల, వర్గ, జాతులకు చెందిన వారనేకులు వుండేవారు. వారిలో ప్రతి ఒక్కరు ఆశ్రమ నియమబద్ధులై వ్యవహరించేవారు. ఎవరి మత సాంప్రదాయాలను వారు పాటించేవారు.

**విగ్రహారాధన :**

బాపూకు ప్రత్యేకంగా విగ్రహారాధన అనేది వుండేది కాదు. బాపూ ఆరాధన అంతా ఈశ్వర అల్లా తేరేనాం, సబ్‌కో సమ్మతి దే భగవాన్ అనే ప్రార్థనలోను, రామ నామ సంకీర్తనలోను వుండేది. అట్లని ఏ విగ్రహాన్ని ఆయన ఆశ్రమంలో పూజించలేదు. ఒక విధంగా ఆయన భక్తిజ్ఞాన ప్రభోధకుడుగా వుండేవారు.

ఈ స్థితిలో వారిని ఎవరి పద్ధతిలో వారు అర్థం చేసుకొన్నారు. అందులో కొందరు గాంధీజీ విగ్రహారాధన వ్యతిరేకి అని వాదించినవారు కూడా లేక పోలేదు. ఇట్టి భావన కలిగిన వారు నేను చేయు లింగపూజ చూసి గాంధీజీ సిద్ధాంతాలకు వ్యతిరేకినని వాదించసాగారు. కాని, బాపూను ఈ విషయం అడిగి తెలుసుకొనేందుకు వారికి ధైర్యం చాలలేదు.

## కాంగ్రెసు ఆశయాలే ముఖ్యం :

కాని, ప్రభాకర్‌జీ ఈ విషయాన్ని నా చెవిలో వేసారు. దానికి జవాబుగా నేను, 'ప్రభాకర్‌జీ! నేను బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాను. మా ఆచార సాంప్రదాయాలు వేరు. ఏదైనా నా రాజకీయ జీవితానికి అడ్డం వచ్చే ఏ ఆచార సాంప్రదాయాన్నైనా నేను త్యజించ నిశ్చయించుకొన్నాను. నా ఈ రాజకీయ జీవనంలో నాకు కాంగ్రెస్ ఆశయాలు ముఖ్యం. నా శివలింగపూజ, నా జంజ్యము, తీర్థ ప్రసాదాలు ఎవ్వరికీ అడ్డురావడం లేదు. అందుకే నేను వాటిని త్యజించవలసిన అవసరం లేదు' అని అన్నాను.



ఒకరోజు నేను, ప్రభాకర్‌జీ ఒకచోట నిలుచొని వుండగా, బాపూ ప్రభాకర్‌జీని పిలిచి, విజయనగరం మహారాణి వస్తున్నారు కదా ! పూజకు తగు ఏర్పాట్లు చేసారా ? అని ప్రశ్నించారు. 'ఇంకా చేయలేదు. చేస్తాము' అన్నాడు ప్రభాకర్‌జీ.

విజయనగరం మహారాణి ఎచటకు వెళ్లినా ఒక శివలింగాన్ని వెంట తెచ్చుకొని పూజ చేసేది. ఈ విషయంలో బాపూ, ప్రభాకర్‌జీల మధ్య జరిగిన సంభాషణ మీద యింతవరకూ నన్ను, నా పూజను, తీర్థ ప్రసాదాలను ప్రశ్నించిన వారంతా చల్లబడ్డారు. విగ్రహారాధన, తీర్థ ప్రసాదాల సమస్య సమసిపోయింది.

★★★

# విగ్రహారాధన - తీర్థ ప్రసాదాలు

విగ్రహారాధన పట్ల బాపూ అభిప్రాయాలు తెలుసుకోవాలని ఒక పెద్ద మనిషి వారి వద్దకు వచ్చాడు. ఈ విషయంలో వారిరువురికి జరిగిన సంభాషణ ఈ క్రింది విధంగా వుంది.

ప్ర. మీరు ఏ రకమైన విగ్రహారాధనను ప్రోత్సహిస్తారు. కేవలం విగ్రహాన్ని దర్శించడం సరిపోతుందా లేక ఏదో రకమైన నైవేద్యము అంటే అన్నం వగైరా పెట్టమని చెబుతారా ? అన్నం నైవేద్యం పెట్టడం ఎంతవరకు ఉచితమైంది.

జ. విగ్రహాలను పూజించే విషయంలో నాకు ఒక ప్రత్యేక ఆరాధనా పద్ధతి లేదు. ప్రతి వ్యక్తి సమాజము తన యిష్టము వచ్చిన ఆరాధన (రిచ్యుయల్)ను కోరుకోవచ్చు. ఇదే సాధారణంగా జరుగుతుంది. ఈ ఆరాధన వ్యక్తి లేక సమాజము అతనూహించుకున్న మంచి చిత్రాన్ని సూచిస్తుంది. ఇది సాధారణంగా వారిలో అనాదిగా వస్తున్న ఆచారము కన్వెన్షన్ (convention) పై ఆధారపడియుంది. ఆరాధకుడు తన దైవాన్ని తన ఎదుట చిత్రీకరించుకుంటాడు. అదొక ఊహ మాత్రమే. ఎంతవరకు ఈ ఊహ తన ఎదుట వుండునో, ఆ చిత్ర స్వరూపం అతనిని ఎంతవరకు ప్రభావితం చేస్తుందో అది మాత్రమే సత్యము.

## పూజా విధానము - దాని పట్ల గౌరవము

ప్ర. ఎంత గొప్ప వ్యక్తి అయినా, అతనిలో కొన్ని లోపాలు యుండక తప్పవు. అట్టివారిని ఆరాధించడంలో, పూజింపబడువారిలోని లోపాలు కూడా పూజించేవారిపై ప్రభావం పడును కదా ! అట్టి అపుడు పూజించబడువారి మంచి చెడు పూజింపువారికి సంక్రమించే వీలున్నది కదా ! ఈ ఇట్టి పూజావిధానాన్ని మీరెంతవరకు అంగీకరిస్తారు.

**బా. జ.** పూజ, ఆరాధన వరకు ప్రతివారు తన యిష్టము వచ్చిన ఆదర్శాన్ని, ఐడియల్ (Ideal) లేక ఊహాచిత్రాన్ని లేక చారిత్రక పురుషుని కోరుకోవచ్చు. నా వరకు నేను ఆదర్శానికే ప్రాముఖ్యత యిస్తాను. కృష్ణుడు - సంపూర్ణ అవతారాన్ని తన ఎదుట కాంకర్ చేసాడు. అనగా ప్లానరీ ఇంకార్నేషన్ అవుతుంది. విశ్వరూపము అనేది ఒక ఆదర్శము. చరిత్ర కృష్ణునిలో లోపాలు చూపవచ్చు. కావున పూజింపబడే వీరిలోని మంచిచెడు పూజించే వారిలో ప్రతిబింబింప బడవచ్చు. ట్రాన్సిట్ కావచ్చు.

1. హిందీ నవజీవన్- 29.8.1929

భగవంతుడు ఉన్నాడో? లేడో? సరిగా చెప్పాలంటే లేడు. మోక్షాన్ని పొందిన ఆత్మయే భగవంతుడు. అందువల్ల అతడు సర్వవ్యాప్తుడు. భక్తికి నిజమైన అర్థం ఆత్మశోధన. ఆత్మ తనను తాను తెలుసుకున్నప్పుడు భక్తి జ్ఞానంగా మార్పు చెందుతుంది. నరసింహ మెహతా (గుజరాతీ కవి, ఋషి), మరి కొంతమంది ఆత్మశోధనకి తమను అర్పితం చేసుకున్నారు. రాముడు, కృష్ణుడు మిగతా వారందరూ అవతార పురుషులు. భగవంతుని అన్వేషణలో మనం కూడా వారివలె వుండవచ్చు. అతడి అపరిమిత దయా పుణ్య సంపద లభించినప్పుడు మోక్షాన్ని పొందబోయే ఆత్మలన్నీ దైవావతారాలు అవుతాయి. మనం వారి పరిపూర్ణత్వాన్ని గ్రహించలేము.

(మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12 పుట - 126.
2-7-1913)

రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తులలో ఎవరు గొప్పవారో చెప్పుట కష్టమైన విషయం. వారి వారి ఘనకార్యాలు వేరువేరుగా ఉన్నాయి. వారు వివిధ కాలాలకు చెందినవారు. వివిధ పరిస్థితుల్లో వున్నవారు. మిగతా వారికన్నా గుణాలలో బుద్ధుడు గొప్పవాడని ఎవరు చెప్పగలరు? భక్తులు తమ భావాలనుబట్టి వర్ణించారు. వైష్ణవులు కృష్ణునకు సంపూర్ణత్వాన్ని ఆపాదించారు. ఎవరైనా ఆవిధంగానే చెప్పవలసివుంటుంది. లేకపోతే అంకిత భక్తి సాధ్యం కాదు. క్రైస్తవులూ అదే విధంగా చేస్తారు. భారతదేశంలో కృష్ణావతారం చివరికి రావడం వల్ల ఆయనకు ప్రత్యేకమైన గొప్పతనం ఆపాదించబడింది.

(మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12 పుట - 126.
2-7-1913)

అత్యంత చెడు ఈ ప్రపంచంలో ఏదీ లేదు. అయినప్పటికీ నేను మతాన్ని, హిందుత్వాన్ని విడలేను. హిందుత్వం ఓడిపోయినట్లయితే నా జీవితమే నాకు భారమైపోతుంది. నేను క్రైస్తవ మతాన్ని, మహమ్మదీయ మతాన్ని అనేక ఇతర విశ్వాసాలను హిందూధర్మం ద్వారా ప్రేమిస్తాను. నా కోసం ఏమీ ఉండకుండా అన్నీ తీసుకుపోయినా నేను భరించగలను గాని అంటరానితనాన్ని భరించలేను. అదృష్టవశాత్తు హిందూధర్మంలో ఆ చెడుకు సర్వోత్కృష్టమైన విరుగుడు ఉన్నది. నేను అదే చేసాను.

(లేఖల గుచ్ఛము - పుట 113. 2-5-1933.)

# మందిరాలు (దేవాలయాలు) - మసీదులు

"నేను విగ్రహారాధకుణ్ణి, విగ్రహారాధన వ్యతిరేకిని కూడా. నేను ఆ పదాలకు ఉన్న నిజమైన తాత్పర్యాన్ని భావిస్తాను. విగ్రహారాధనలో ఇమిడిఉన్న తత్వాన్ని నేను గౌరవిస్తాను". మానవజాతిని సముద్ధరించటంలో అది చాలా ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తుంది. మన భూమిని పవిత్రం చేస్తున్న వేలాది పుణ్య దేవాలయాలను నా జీవితంలో సమర్థించగల సామర్థ్యం నాకు కలగాలని నే నెప్పుడూ ఆశిస్తుంటాను. నేను ముసల్మానులతో స్నేహానుబంధాలను కలిగి ఉంటున్నానంటే వారు కూడా నాకున్న దేవాలయ, విగ్రహారాధన ప్రేమును సహిస్తున్నారనే అర్థం. నేను విగ్రహారధన వ్యతిరేకిని అని కూడా అన్నాను. అంటే, దాని అర్థం ఇది. ఎవరైనా ఒక మూర్తిని గాఢంగా ఆరాధిస్తూ, మరొక మూర్తి ఆరాధనను అంగీకరించక తీవ్ర ద్వేషాన్ని పాటిస్తూ అందులో ఉన్న మంచిని గ్రహించలేకపోతే, వారి ప్రవృత్తిని నేను ద్వేషిస్తాను. మూర్తి వెనుక ఉన్న నిర్గుణ తత్వాన్ని గ్రహిస్తాను. ఒక మనిషి తనకు తాను ఉద్ధరించుకోడాన్ని పోషిస్తాను. దేవుడు ఒక శిలా విగ్రహంలోనో, బంగారు ప్రతిమలోనో ఉంటాడని భావించి పూజించే సంకుచిత విశ్వాసం కంటే మరొక రూపాన్ని కాదనే విగ్రహారాధనం అందంగా ఉన్నా, తప్పించుకోటానికి వీలుగా ఉన్నా చాలా ప్రమాదకరమైంది.

- యంగ్ ఇండియా, 2-3-1924.

అయితే ఎందుకోసం మనమీ తగాదాలు పడటం? హిందువులమైన మేము, విగ్రహారాధకులం కావచ్చు. మేం పొరపడే ఉండవచ్చు. కాని, భగవంతుడు ప్రతిమనిషికీ తప్పులు చేసే హక్కు ఇచ్చాడు కదా! మేము విగ్రహారాధకులమైనందుకు దేవుడు ఎలాగూ మమ్మల్ని శిక్షిస్తాడు కదా! మరి ముసల్మానులు కూడా మనలను ఎందుకు శిక్షించకూడదు?

- యంగ్ ఇండియా, 17-1-1927.

విగ్రహాన్ని విగ్రహంగా మాత్రమే చూడడం చాలా తప్పు. దానికంటె విగ్రహారాధనం నయం, ఎందుకంటే విగ్రహాన్ని విగ్రహంగా పూజించేవాడు అంతకంటె మరే తత్వాన్నీ దర్శించలేడు. విగ్రహారాధకుడు శిలలో శివుణ్ణి చూస్తాడు. భగవంతుడిలో లీనం కావటానికి విగ్రహాన్ని ఒక సాధనంగా గ్రహిస్తాడు. హిందువులలో ప్రతి బాలుడికీ కాశీ దేవాలయంలో ఉన్న లింగం కాశీ విశ్వనాథుడు కాడని తెలుసు. కాని, విశ్వాన్ని పాలించే అనంతరూపుడు ఆ మూర్తిలో వసిస్తున్నాడనీ నమ్ముతాడు. ఇటువంటి భావనా విన్యాసం అనుమతింపదగింది, ఆరోగ్యకరమైంది కూడా.

# గోరాజీ - గాంధీజీ

గోరాజీ సాదాతనం (simplicity), చిత్తశుద్ధి నన్ను ఎంతైనా ఆకర్షించింది. వార తరచూ మా యింటికి వచ్చేవారు. మా యింట్లో జరిగే సంభాషణలు నన్ను నాస్తికకేంద్రం దాకా నడిపించినవి. ఆ కారణంగా విద్య, లవణం, హేమలత, విజయం, సమరం అందరూ నాకు సన్నిహితులయ్యారు.

గోరాగారి సతీమణి శ్రీమతి సరస్వతీదేవి ప్రేమ, ఆప్యత నన్ను ఆ కుటుంబానికి మరింత సన్నిహితునిగా చేర్చినవి.



గోరాగారు ఆస్తికత్వాన్ని, నాస్తికత్వాన్ని గూర్చి బాపూతో మాటలాడేందుకు వచ్చారు. నేను ప్రభాకర్జీ అప్పుడు గాంధీ ఆశ్రమంలో వున్నాము. నేను, ప్రభాకర్జీ వారితో కొంతకాలం గడిపాం.

గోరాజీ బాపూజీకి నాస్తికత్వ సిద్ధాంతాన్ని గూర్చి నచ్చచెప్పకుండా యింటికి పోను అని శపథం పట్టారు. ఇది సాధ్యమా? అవునో, కాదో వేరే విషయం. కాని, ఒక్క మాట మాత్రము స్పష్టము.

అతను బాపూకు నాస్తికత్వాన్ని గూర్చి నచ్చచెప్పగలను అనే వారి ఆత్మ విశ్వాసం మాత్రం అందరిని ఆకర్షించింది.

బాపూజీ,గోరాజీ ఆస్తిక, నాస్తిక సిద్ధాంతాలపై చర్చలు జరిపారు. చివరకు, " the Atheism of Gora is nothing Theism but of mine" అని బాపు అన్నారు. గోరా తలపెట్టిన వివిధ సంస్కరణలు, మతసమానతను పెంపొందించేవిగా వుండేవి. నిశ్చల మానవ కళ్యాణం వీరిరువురి గమ్యస్థానం కదా.

> If as Kishorelal says, " Atheism is also a creed among many others. There is all logic in saying so. Wouldn't Gandhiji as well have said that he was an atheist as well provided it meant a life of goodness and devoted service to the whole of God or no God's Creation".

# సహిష్ణుత - మతాల సమానత్వం

''సహిష్ణుత'' అనే మాట నాకు నచ్చదు. ఇంతకంటె మంచి మాట దొరకలేదు. ''సహిష్ణుత'' అంటే తక్కువ స్థాయిగల ఇతర మతాలను ఓర్పుతో సహించడం అని అర్థం వస్తుంది. ''అహింస'' ఆచరణలో ఇతర మతాలకు, మన మతానికిచ్చే ఆదరణ స్ఫురించి, మన మతంలోని లోపాలను ఒప్పుకోవడం జరుగుతుంది. సత్యాన్వేషి విధి ఇదే. సత్యమంటే పూర్తి అవగాహన ఉంటే, దైవత్వసిద్ధి కలుగుతుంది. సత్యమే దైవం కనుక. కాని అన్వేషకుడిలో లోపాలుంటాయి. ప్రతిపాదించిన మతంలో అసమగ్రతలుంటాయి. ప్రతి నిత్యమూ, మన మతానికి పరిణతి, సమగ్రతా సాధన ప్రయాస ఉంటాయి. సత్యప్రాప్తికి అన్ని మతాల దారి ఇదే. తరతమ భేదాలు లేవు. అన్నిటిలో పొరపాట్లు ఉంటాయి. అన్య మతాలను గౌరవించడం అంటే, వాటిలో లోపాలను గురించి ఆలోచింపకపోవడం కాదు. మన మతం లోపాలను గుర్తించాలి. వాటిని సవరించుకోవాలి. కాని ఆ మతాన్ని త్యజించడం సరికాదు. అన్ని మతాలలోని మంచి విషయాలను గ్రహించి మన మతంలో లీనం చేసుకోవడం మన విద్యుక్త ధర్మం.

మరి ఇన్ని మతాలు అవసరమా? ఆత్మ ఒక్కటే. శరీరాలు వేరు. అవి ఉంటాయి. ''ఆత్మ'' ఐక్యతా గుణం గుర్తించాలి. పెద్ద చెట్టుకు కొమ్మలూ, రెమ్మలూ, ఆకులూ అనేకం ఉంటాయి కాని మొదలు ఒక్కటే. మతధర్మం ఒక్కటే, వివిధ మానవుల మనసులలో వేర్వేరు విధాలుగా పెరుగుతుంది. వీటిలో సరియైనది ఏది? అందరిదీ ఒప్పే. అందరిదీ తప్పే. సహిష్ణుత ఉండాలి. తన మతమంటే అశ్రద్ధ లేదు. నిజమైన అభిమానం ఉంది. సహిష్ణుత వలన అంతర్దృష్టి ఏర్పడి, మతమౌఢ్యం తొలగిపోతుంది. సహిష్ణుత, మౌఢ్యం ఉత్తర దక్షిణ ధృవాలు. మతమంటే సరియైన అవగాహన వాటి మధ్య అడ్డుగోడను కూల్చి అంతం చేస్తుంది. పరమత సహిష్ణుత మన మతాన్ని సరిగా బోధపరుస్తుంది.

# స్త్రీ ప్రాముఖ్యత

స్త్రీ మాతృదేవత, ఆదిశక్తి, సత్యస స్వరూపిణి అని పెద్దలు భావిస్తారు. భార్యాభర్త కలయికే సృష్టికి కారణభూతమైంది. వారి సంబంధాలే ఇంటా బయటా శాంతిప్రదాయకం. లూయీ ఫిషరు ఈ సందర్భంలో గాంధీజీ తన సంసార జీవనాన్ని గూర్చి చెప్పిన మాటలు ఈవిధంగా ఉన్నాయి. ''నాకు, నా భార్యకు పచ్చిగడ్డి వేస్తే భగ్గుమంటుండేది. కాఫీ, టీ వద్దని గాంధీ అనేవారు. టీ అలవాటు పడ్డ కస్తూరిబా ఈ అలవాటు వదలలేకపోయింది. ఈ అభిప్రాయబేధం ఘర్షణకు దారితీయక తప్పలేదు. కానీ, గాంధీజీ ఒకసారి తను చెప్పే మాటను సత్యము, ప్రేమ అనే గీటురాయిపై తఅచి చూచాడు. తదుపరి తనే ఆవిడకు కాఫీ, టీ చేసి ఇచ్చాను. సమస్య సమసిపోయింది. అన్యోన్య ప్రేమ ఉన్నతస్థాయికి వచ్చింది. తుదకు ఆగాఖాన్ భవనంలో బా చనిపోయినపుడు బాపు కూడా కన్నీరు పెట్టక తప్పలేదు. స్త్రీల సమస్యలన్నింటిని బాపు ఒక పద్ధతిపైనే సత్యము, ప్రేమ అనే గీటురాయిపై పెట్టి చూస్తే భార్యభర్తల సంబంధాలు ఆదర్శంగా వుండిపోతాయి. భార్యాభర్తల్లో చిక్కులు దిద్దువలసి వచ్చినప్పుడు ఎవరు గెలిచారు ? ఎవరు ఓడారు? అనే ప్రశ్న రాదు. ప్రివిలేజెస్ అనే సమస్య ప్రేమ అనే గీటురాయి (touch stone) పై పరీక్షిస్తే పరిష్కారం అదే దొరుకుతుంది. సృష్టికి మూలం స్త్రీ. అదే ఆదిశక్తి.

ఇదే సందర్భంలో గాంధీగారు సైతం ఆశ్రమంలో వున్న చిక్కులను గూర్చి మీరు భయపడకండి. ప్రతి చిన్న విషయానికి ఒక విస్తృత అభిప్రాయము లేక సంకుచిత అభిప్రాయము వుంటుంది. విస్తృత అభిప్రాయాన్ని గూర్చి భయపడకండి. చిన్న అభిప్రాయాలతో ప్రారంభించండి. దేశ పరిరక్షణకై ప్రాణాలివ్వాలంటే భయపడవచ్చు. ఇది చాలా పెద్ద విషయం. కానీ కొంత కష్టము, నష్టం ఓర్చుకొని నీవు పెద్దవాడవు కావున మీ తమ్ముడికి చదువు చెప్పించు అనేది చిన్న విషయం. ఇది అలవాటు అయితే దేశానికై అతను ప్రాణం అర్పించే దశకు వస్తాడు. "The hand that rules the Cradle rules the World". ''ఊయల ఊపిన చేయి రాజ్యం చేస్తుంది''

తల్లి కడుపులో పెరుగుతున్న బిడ్డ కదలికల కారణంగా కలుగు బాధను భరిస్తూ కూడా కన్నబిడ్డను ప్రేమతో చూడకుండా వుండడం సాధ్యమవుతుందా? కాదు కదా! ఈ తల్లి ప్రేమ సత్యమే కదా ! సృష్టిలోని ఈ ప్రేమ బ్రహ్మ పదార్థమే కదా ! మాతృత్వానికి కులమత బేధాలు లేవు. అందుకే స్త్రీ మాతృమూర్తి, సత్య – అహింసల ప్రతీక.

# స్త్రీల పాత్ర - స్త్రీల హోదా

**స్త్రీల పాత్ర - స్త్రీల హోదా :**

మౌలికముగా స్త్రీలు, పురుషులూ మానవులే. కాని ఎందుకనో, కాలగతిలో స్త్రీ హీనతా భావాన్ని సంతరించుకొని, వెనుకబడింది. పురుషులలో ద్రష్టలూ – మునులూ మాత్రం స్త్రీకి, పురుషునితో సమాన హోదానే ఇచ్చారు.

స్త్రీ, పురుషుడు స్వాభావికంగా సామ్యతగల వారు గనుక వారి సమస్య, వారి ఆత్మశక్తి ఒక్కటే అని నా అభిప్రాయము. వారి జీవితాలు, భావాలు ఒక్కటే. ఒకరికొకరు పూరకాలు. ఒకరి సహచర్యం లేక ఇంకొకరు బ్రతకరు.. అనాది నుంచి పురుషునిది పైచేయి అయింది. పురుషుని స్వార్థపూరిత ఉపదేశాన్ని (స్త్రీకి తనతో సమానత లేదు) నమ్మింది. కాని ఎక్కడో ఒకచోట విభజన తప్పలేదు. రూపసామ్యం ఉన్నా ప్రధానమైన భిన్నత్వం ఉంది. మాతృవిధికి వలసిన గుణాలు పురుషునికి లేవు. చాలమంది స్త్రీలు ఆ విధిని స్వీకరిస్తారు. ఆమెలో జడత్వం, ఆమెలో చైతన్యం, ఆమె గృహస్వామిని కావడం, ఇల్లు తీర్చిదిద్దడం, మానవజాతి శిశువుల పాలన (ఆమె ప్రత్యేక గుణము, హక్కు) ఇవి నైజంగా వున్నవే. ఆమె లేనిదే జాతి లేదు.

తొమ్మిది నెలలు మోసి, తినిపించి, ఆ బాధలో సుఖాన్ని చూస్తుంది. శిశుజననంలో నొప్పులను మించిన బాధ వేరే ఏముంది? కాని వాటినన్నిటినీ సృష్టి ప్రక్రియలో కల్గిన సంతోషంలో మరచి పోతుంది. రోజుకి రోజు శిశువును పెంచి పెద్ద చేసే విధానంలోని పాట్లు చాలా ఉన్నవి. తన ప్రేమను మానవాళిపై కురిపించి పురుషుని కామానికి బలియైన లేక బలి కాగల వస్తువునని మరచిపోవాలి స్త్రీ. పురుషుని ప్రక్క, తల్లిగా, తీర్చిదిద్దిన సృష్టికర్తగా మౌన నాయకురాలై నిలుస్తుంది.

(హరిజన్ 24-2-40. పుటలు 13-16)

# పరచూరు శాస్త్రి - కుష్టువ్యాధి

**బాపూ వెంట పోయూవు :**

తెల్లవారింది. నేను డైరీ ఫారములో యధావిధిగా పాలు అమ్ముతున్నాను. ఇంతలో ప్రభాకర్‌జీ వేగంగా వచ్చారు. పాలు అమ్మడం ఆపివేసి నీవు నాతోరా అన్నారు. నాకు ఎందుకు రమ్మంటున్నాడో అర్థం కాలేదు. అయినా పిలిచింది ప్రభాకర్‌జీ కాబట్టి ఆత్మారాంకు పని అప్పగించి వెంటనే బయలుదేరాను.

ఈలోగా బాపూజీ మా ముందు నుండి మూడు నాలుగు అడుగలు ముందుకు నడిచారు. ప్రభాకర్‌జీ నాతో 'బాపూజీ శాస్త్రీజీ వద్దకు పోతున్నారు'. బాపూజీ అతనితో ఏమి మాట్లాడతారో కలసి చూద్దాం రా, అని అనగానే ఇద్దరం కలిసి బాపూ వెంట నడిచాము.

**కుష్ఠరోగిని బాపూ పరామర్శ :** బాపూజీ శాస్త్రీజీని అతని ఆరోగ్యం విషయం పరామర్శించారు.



**బాపూ! నేబ్రతికి ఏమిలాభం :**

శాస్త్రీజీ కుష్ఠరోగంతో బాధపడుతున్నాడు. బాపూజీని చూడగానే, 'బాపూ, నేను భూమిపై ఉండి లాభమేమిటి? భూమికి భారంగా వుండడం తప్ప' అని విచారం వెలిబుచ్చారు.

ఈ భావాన్ని వ్యక్తం చేసే ఒక శ్లోకం శాస్త్రీజీ చదివారు. బాపూ ఆ శ్లోకాన్ని శ్రద్ధతో తన కఱ్ఱపై గడ్డం ఆనించి శాంతంగా విన్నారు. అటు పిమ్మట వస్తానంటూ ముందుకు అడుగువేశారు.

మరల రెండవరోజు శాస్త్రీజీ వద్దకు బాపూ వచ్చారు. "శాస్త్రీజీ! నిన్న చదివిన సంస్కృత శ్లోకం మరొకమారు చదివి వినిపించు" అన్నారు. శాస్త్రీజీ అలాగే చదవి వినిపించడం జరిగింది. ఈసారి ఆ శ్లోకం అర్థాన్ని పూర్తిగా వివరించమన్నారు. శాస్త్రీజీ ఉదాహరణ సహితంగా దీర్ఘంగా విపులీకరించి అర్థం చెప్పారు.

బాపూ అంతా విని "ఈ శ్లోకంలో ఎంత నిగూఢమైన అర్థముంది?" అంటూ ముందుకు సాగారు.

భూమికి భారం – ఆమరణదీక్షయే పరిష్కారమార్గం :

కొద్ది రోజులు గడిచాయి. శాస్త్రీజీకి, "తాను భూమికి భారం" అనే భావన అధికం కాసాగింది. అట్టి దశలో బాపూజీ, శాస్త్రీజీ దగ్గరకు వచ్చారు. బాపూను చూడగానే నమస్కరిస్తూ, "నేను భూమికి భారం వున్నాను కాబట్టి ఆమరణదీక్షకు పూనుకుందామని నిశ్చయించుకొన్నానని" అన్నారు.

బాపూజీ వెంటనే సమాధానం చెప్పలేదు. ఇరువురు మౌనంగా కొన్ని సెకండ్లు ఒకరిని ఒకరు చూచుకుంటూ వుండిపోయారు.

ఆత్మ ప్రేరణయేనా అయితే :

తదనంతరం," శాస్త్రీజీ! ఈ నిర్ణయం నీ ఆత్మప్రేరణ అయితే రాముని ఆజ్ఞగా పాటించు" అన్నారు బాపూజీ. అట్లని బాపూజీ శాస్త్రీజీని ఆమరణ దీక్షకు ఆజ్ఞాపించినట్లు కాదు. కాని శాస్త్రీజీ–బాపూల మధ్య జరిగిన సంభాషణలు శాస్త్రీజీ ఆమరణ దీక్షకు దారితీసాయి.

శాస్త్రీజీ ఉపవాసం ప్రారంభించిన తర్వాత బాపూ కొద్దిరోజులు అటువైపుకు కూడా రాలేదు. ఆ తరువాత బాపూజీ తనంతట తానే శాస్త్రీజీ వద్దకు వచ్చి, ఆయనకు మాలీషు చేయడం మొదలు పెట్టారు. శాస్త్రీజీ తన కాళ్ళు ముట్టుకోవద్దని బాపూజీని వారించారు. కాని, బాపూజీ ఆతని మాటలు వినిపించుకోకుండా, " నేను నీ రోగాన్ని

ముట్టుకుంటున్నాను. నిన్ను కాదు'' అంటూ తాను మాలిష్ చేయడంలో మునిగిపోయారు. అక్కడే బాపూజీ వెంటవున్న నేను, ప్రభాకర్‌జీ కూడా వెంటనే మాలిష్ చేయడంలో బాపూజీకి అన్ని విధాల తోడ్పడసాగాము.

**మాలిష్ విధానం :**

ప్రభాకర్‌జీ మాలిషు చేస్తున్న విధానం బాపూజీ క్రీగంట చూశారు. 'ప్రభాకర్ ! మాలిషు అరచేయితో చేయాలి. అరచేయిపై భాగానికి ఏమీ అంటకూడదు. అది తొందరగా ప్రభావితం (ఖోఖుం) అవుతుంది. భగవంతుడు ఆలోచించే అరచేయి దళసరిగా వుండేటట్లు చేశాడు అన్నారు బాపూజీ.

శాస్త్రీజీ స్థితి క్షీణిస్తున్న కొలది, బాపూజీ ఉదయం సాయంత్రం తన వాహ్యాళిలో రాసాగారు. శాస్త్రీజీ, బాపూజీకి నన్ను చూపించి, 'ఈ కుర్రవాడు రోజూ వస్తున్నాడు. అతని ఋణం తీర్చుకోలేనని' అన్నారు.

బాపూజీ సేవ ఋణం కాదు. అది భగవత్ స్వరూపం అన్నారు. ఆ తరువాత బాపూజీ, శాస్త్రీజీ ఆరోగ్యాన్ని గూర్చి గుచ్చి గుచ్చి అడుగసాగారు.

శాస్త్రీజీ, 'బాపూ నా ఆరోగ్యం కొంచెం మేలనిపిస్తున్నది. చేతివ్రేళ్ళు కొంచెం కదలించ గల్గుతున్నాను' అన్నారు.

**ఆమరణదీక్ష ఒక తపస్సు :**

బాపూజీ ఆమాటలు విన్న మీదట, 'శాస్త్రీజీ , ఆమరణదీక్ష ఒక తపస్సు. ఈ దీక్షలో మన భౌతికకాయం కృంగి కృశిస్తుంది. చివరకు పంచభూతాలలో కలసిపోతుంది. అట్లని ఏ మందోమాకో తిని, అఘాయిత్యం చేసుకొని మరణాన్ని తొందర చేయరాదు. మామూలుగా నీరు త్రాగాలి, గాలి పీల్చుతూనే వుండాలి. రాముడి ఆజ్ఞ అయినపుడు జీవుడు పరమాత్మలో చేరి పోతాడు. తొందరపడవద్దు' అని ఆదేశించారు. బాపూజీ మాటలు శాస్త్రీజీని స్వర్గలోకానికి తొందరగా పంపేటట్లు లేవని మేము భావించాము.

కాని యింతలో బాపూజీ ఆప్యాయంగా, శాస్త్రీజీ! మీ ఆమరణ దీక్ష ఆత్మ ప్రేరితము. రాముడి ఆజ్ఞ. మన చుట్టూ వున్న సమాజం ప్రేరేపించింది కాదు. కాబట్టి మీకు ఏదశలోనైనా సమాజానికి సేవ చేయగల శక్తివస్తే, అందుకు అభిలాష కలుగుతుంటే మీరు ఈ దీక్షను వదలివేసే ధైర్యం మీకు వుండాలి. ఎట్టి పరిస్థితులలో కూడా సమాజం ఏమనుకుంటుందో అని అనుకోకూడదు.

**దీక్ష విరమించుటకు సాహసం కావాలి :**

ఆమరణదీక్షకు పూనుకొనుటకు ఎంత సాహసం చేశారో, విరమించడానికి కూడా అంతే సాహసం చేయాలని చెప్పి తన కాలినడక సాగించారు.

బాపూ మరొకమారు కొద్దిగా వెనుకకు అడుగువేసి, ''శాస్త్రీజీ నేను చెప్పింది మరువవద్దు'' అని హెచ్చరిస్తూ వెళ్లిపోయారు.

ఆ తరువాత ప్రభాకర్‌జీ, బాపూజీతో సహా రోజులాగే వచ్చారు. శాస్త్రీజీ ఆరోగ్యాన్ని గూర్చి ప్రశ్నించారు.

**దీక్ష విరమింపు :**

వ్యాధి తగ్గుతున్నట్లు వుంది. కాళ్ళు, చేతులు స్వాధీనంలోకి వస్తున్నవి. యిదంతా మీ దయ బాపూ అంటూ శాస్త్రీజీ నమస్కరించారు.

దీక్ష వదలదలచుకుంటే చెప్పు అన్నారు. శాస్త్రీజీ మౌనం దాల్చారు. ప్రభాకర్‌జీ నిమ్మరసం తెచ్చారు. బాపూజీ చేతి మీదుగా శాస్త్రీజీ దాన్ని గ్రహించారు. ఆమరణ దీక్ష పూర్తయింది. రోగ నివారణ జరిగింది.

ఇరుగుపొరుగు సేవయే స్వదేశీ.



# ఉపవాస దీక్ష

మరలా ఇప్పుడు ఉపవాసాలు చేస్తూ ఉండటానికి కారణం పూర్తిగా ఆరోగ్య సంబంధమైనదే. ఉపవాసం ఆత్మ నిగ్రహానికి అవసరమని ఒక స్నేహితుడి నుంచి నేను నేర్చుకున్నాను.

నేను వైష్ణవ కుటుంబంలో, అన్ని రకాల నియమ నిష్ఠలను పాటించే తల్లికి పుట్టటంచేత, భారతదేశంలో ఉన్నప్పుడు, ఏకాదశినాడు ఉపవాసదీక్ష పాటించేవాడిని. అయితే ఆ ఉపవాసాన్ని మా అమ్మగారు ఎలా చేస్తే అలాగే నేనూ అనుసరించేవాణ్ణి. అందులో మా తల్లిదండ్రులను సంతోషపెట్టటమే నా ధ్యేయం.

అప్పట్లో ఉపవాసం వలన కలిగే ఫలితాలను గురించి నాకు తెలియదు. పైపెచ్చు నాకు అటువంటి వాటిమీద నమ్మకం కూడా ఉండేది కాదు. కాని, తరువాత నేను ఇదివరలో పేర్కొన్న స్నేహితుడు ఉపవసించి పొందిన లాభం తెలిసిన తరువాత, బ్రహ్మచర్య వ్రతానికి అది పోషకంగా ఉంటుందనే భావంతో నేను ఏకాదశి ఉపవాస వ్రతాన్ని తప్పకుండా పాటించటం ప్రారంభించాను. ఆచారం ప్రకారం హిందువులు ఉపవాసం రోజున పాలూ పండ్లూ తినటానికి అనుమతిస్తారు. కాని, అటువంటి ఉపవాసాన్ని నేను రోజూ చేస్తూనే ఉన్నాను. కాబట్టి, నేను నీరొక్కటి త్రాగుతూ కటిక ఉపవాస వ్రతాలనే ఇప్పుడు ప్రారంభించాను.

నేను ఈ ప్రయోగాన్ని ప్రారంభించినప్పుడు, హిందువులు శ్రావణమాసం, ఇస్లాము రంజాన్ పండుగ కలిసి రావటం జరిగింది. గాంధీ వంశస్థులు అటు వైష్ణవ మతానికీ, దేవాలయాలకూ, ఇటు శైవానికీ, శైవ దేవాలయాలకూ సంబంధించిన వ్రతాలను రెండింటినీ నిష్ఠతో పాటించే వారు. కొంతమంది కుటుంబ సభ్యులు శ్రావణమాసమంతా ప్రదోష కాలంవరకు ఉపవాసాన్ని పాటించేవారు. నేను కూడా అలాగే చేద్దామని నిశ్చయించుకున్నాను.

ఈ ముఖ్యమైన ప్రయోగాలను నేను శ్రీ కల్లెన్ బాచ్‌తోనూ, కొందరు యువకులతోనూ, పిల్లలతోనూ కలిసి టాల్‌స్టాయ్ ఫారంలో ఉన్నప్పుడు చేపట్టాం. వీరందరికీ ఒక పాఠశాల ఉండేది. వారిలో నలుగురైదుగురు ముసల్మానులు కూడా ఉండేవారు. వారు వారి మతానికి సంబంధించిన నియమవ్రతాలను పాటించటంలో నేను తోడ్పడేవాణ్ణి, ప్రోత్సహించేవాణ్ణి. వారు ప్రతిరోజూ చేసే నమాజులు తప్పకుండా చేసేటట్లు శ్రద్ధ తీసుకొనేవాణ్ణి. ఆ యువకులలో కొంతమంది క్రైస్తవులు, పార్సీలు కూడా ఉండేవారు. వారు వారివారి మతాలను అనుసరించేటట్టు ప్రోత్సహించటం నా ధర్మమని నేను భావించాను.

కాబట్టి, ఈ మాసంలో ముసల్మాను యువకులను రంజాన్ ఉపవాసవ్రతాన్ని పాటించేటట్లు అంగీకరింపచేశాను. నేను ప్రదోషకాలం వలకు ఉపవాసం చేయాలని నిశ్చయించుకున్నాను కదా ! నాతోపాటు హిందూ, పార్సీ, క్రైస్తవ యువకులను కూడా కలిసి ఉపవాసం చేయండని అడిగాను. ఇటువంటి విషయాల్లో తమంతట తాము కాదనుకొని మానుకొన్న దానికంటె నలుగురితో కలిసి పాల్గొనటం అన్ని విధాలా మంచిదని వారికి విడమరచి చెప్పాను. నా ప్రతిపాదనను మా ఫారంలో ఉన్న వారిలో చాలామంది ఆమోదించారు.

ఈ ప్రయోగాల ఫలితంగా అందరికి ఉపవాసవ్రతం వలన కలిగే విలువల పట్ల విశ్వాసం కుదిరింది. వారి మధ్య సంఘటిత ఉత్సాహం వెల్లివిరిసింది....

- ఎం.కె. గాంధీ - స్వీయ చరిత్ర - పు. 226.

# ఆత్మారాం

సేవాగ్రాం వాతావరణమే వేరు. అచటి ప్రేమ, వాత్సల్యం కృత్రిమంగా అనిపించవు. అలా ఉండే వీలు కూడా ఆశ్రమ వాతావరణంలో కనిపించదు. అది ఆ స్థల మహాత్యము.

**ఆత్మారాం - జొన్నరొట్టె :**

ఆత్మారాం హరిజనుడు. గోసేవా రంగంలో నాకు సహాయకునిగా పనిచేసేవాడు. రాజాభై, అంటూ నన్ను వీడకుండా నాతో తిరిగేవాడు.

ఇంటి నుంచి జొన్నరొట్టె అప్పుడప్పుడు తెచ్చేవాడు. వెన్న, మీగడ, కారం కలుపుకొని ఆ రొట్టె వెన్నెల కాంతులలో కూర్చొని ఆత్మారాం దంపతులు, నేను తింటూ వుంటే కలిగిన ఆనందం నేను ఆశ్రమం వదలిన తరువాత, తిరిగి ఎప్పుడూ పొందలేక పోయాను.

**గొంగళి - కౌగిలి :**

ఒకప్పుడు ఆవుల మంద మధ్యన, చలి ఎక్కువ అయినప్పుడు గొంగళి కప్పుకొని కలిసి పడుకునేవాళ్లం. ఆ గొంగళి కౌగిలిలో పొందే ఆనందపు ఘడియలు మనం అనుకున్నప్పుడు రావు.

ఒకే చోట కలిసి పనిచేసే సందర్భాలలోనే అలాంటి అవకాశం, సన్నివేశాలు లభిస్తాయి.

వాటికై కూడా నోచుకొని పుట్టాలి. అందరికీ అన్ని వేళలా సాధ్యం కాదుకదా !

ఆ ఆశ్రమ జీవనం యిట్టి అవకాశాన్ని, అనుభూతిని పొందే వీలు కల్పించింది. అందుకే యిలాంటి సందర్భాలలో ప్రభాకర్‌జీ తప్పక జ్ఞప్తికి వస్తారు. మానవుడు సరియగు నిజమైన మనిషిగా జీవించే ఘడియలివి.

**సహజీవనం :**

ఇట్టి జీవనానికి దారితీసేందుకై హరిజన సేవక సంఘం నాంది పలికింది. కాని మా కలయిక సహజీవనం, సంఘం యొక్క కృషి వల్ల వచ్చిందికాదు. గోశాలలో యిరువురము కలిసి పనిచేయడంలో పెరిగిన ఆప్యాయత, ప్రేమవల్ల వచ్చింది.

చట్టం వర్తింప చేసినందువల్ల తగు వాతావరణం కొంత ఏర్పడవచ్చు. కాని మనసులను దరిచేర్చగల్గింది పరస్పర ప్రేమ, అనురాగం మాత్రమే. చట్టాలు మాత్రం కాదు.

ఆత్మారాం అప్యాయతతో ఈలపాటలు గోవుల వెంట వెళ్ళేటప్పుడు, వచ్చేటప్పుడు పాడేవాడు. ఆ పాటలు వింటున్నప్పుడు, 'గతాన్ని గుర్తుంచుకో' అన్న ఈ క్రింది గేయం నాకు గుర్తుకు వచ్చేది.

## గతాన్ని గుర్తుంచుకో !

– మల్లాది శ్రీనివాస్

మనిషీ ! నేడు నీవు చెలించేందుకు వాహనాలు ఎన్నో కనిపెట్టావు
మరి ఏమీ లేనినాడో నిన్ను తేలిగ్గా నీ గమ్యస్థానం చేర్చేందుకు
ఉపయోగపడింది ఆ జంతువులే గదూ!
అలానే ఓ మనిషీ ! నేడు నీవు – నీ ''స్వ'' శక్తితో
ఎన్నో పోషక పదార్థాలు చేసుకోగల్గావు, మరి అలేనాడో.....
నీవు నీ బ్రతుకు – తెరువు గడుపుకోవడానికి ఆశ్రయించింది
ఆ జంతువుల్నే గదా...!
కాని......., మనిషీ
నేడు నీ మేధాశక్తితో అంతరిక్షంలో రాకెట్లను నడుపుతున్నావ్,
భువిలో యంత్రపు – మనుష్యుల (రాబోట్ల)ను సైతం ఆడిస్తున్నావ్
నీవెంత ''గొప్ప'' వాడివైనప్పటికీ...
''తీరం చేరేదాక ఓడమల్లయ్య,
తీరందాటాక బోడిమల్లయ్య'' –
అనే కుయుక్తిని ప్రదర్శించవద్దు.
వెనుకటి వలె క్షీర దారలను గౌరవించు,
మహా మహులు చెప్పిన సూక్తులను ఆచరించు.

ఈ గేయ సారాంశమే భారత సంస్కృతి – భారత భవిష్యత్ అనుకొనే వాడిని.



# హరిజనోద్ధరణ

**సాంఘిక దురాచారాలు తొలగాలి :**

ఇట్టి హక్కులు చట్టబద్ధము చేయుటకానిచో ప్రప్రథమ అవకాశం స్వాతంత్ర్యానంతరం వచ్చు స్వరాజ్య పార్లమెంట్ ప్రప్రథమంగా చట్టబద్ధంగా చేయబడు చట్టాలలో ఉండగలదని తీర్మానించబడింది. ఆ తరువాత ఇందులకు అనుగుణంగా పార్లమెంట్‌లో ఈ అంశం గుర్తించబడింది. అంతేగాక, హిందువులకు నాయకులుగా ఉన్న ప్రతివారు న్యాయమైన హక్కులను శాంతియుతంగా సాధించుటకు ప్రస్తుతం అమలులో ఉన్న సాంఘిక దురాచారాలను తొలగించుటకు కూడా తీర్మానించబడింది.''

**పండిత్ మదన్‌మోహన్ మాలవ్య :**

హరిజనోద్ధరణకై 25 సెప్టెంబరు 1932 పండిత్ మదన్‌మోహన్ మాలవ్య అధ్యక్షతన హిందువులకు ప్రాతినిధ్యం వహించు పెద్దలతో హరిజన సేవక్ సంఘం ఏర్పడింది. ఆ సందర్భంలో అంగీకరించబడిన తీర్మాన పాఠమిది. ''హిందువులలో జన్మతః ఎవరూ అస్పృశ్యులని భావించరాదు. ఈ విధంగా బాగా గుర్తించబడిన వారందరికీ హిందువులు ఉపయోగించుకొను పబ్లిక్ స్కూల్, పబ్లిక్ బావులు తదితర పబ్లిక్ సంస్థలపై హక్కులు ఉండగలవు.

★★★

# నమ్రత

నమ్రత ఒక విధమైన మర్యాద. వ్యక్తికి, జాతికి తగు క్రమశిక్షణ నేర్పు ఆయుధం. అది రాజకీయంగా జాతీయ సమైక్యతకు, జాతీయ సమగ్రతకు పరస్పర అవగాహనకు దారితీయు ఆయుధం. నమ్రత విభిన్న అభిప్రాయములలోని అంతరార్థమును ఒక కొలికి కొసకు తెచ్చి, మానవ కల్యాణమునకు తోడ్పడు గొప్ప ఆయుధము. గాంధీజీ పరిసరములను విడనాడి ఆలోచించుట గాని, వ్యవహరించుటగాని సరియైన పద్ధతి కాదని ప్రబోధించిన ప్రముఖుడు. వారు ఎప్పుడూ పరిసరములను మరచి వ్యవహరించలేదు. అందువల్లనే తన శక్తిని, పర శక్తిని సరియగు అంచనా వేసి సామ్రాజ్యవాదులను సైతం ఎదిరించగలిగారు. స్వాతంత్ర్యానికి దారిచూపగలిగారు. సరియైన వ్యక్తిని సరియైన సమయంలో సరియైన విధంగా ఉపయోగించగల లేక నియుక్తించుటలో అతనికి అతనే సాటి. గాంధీజీ ఎంత గొప్పవాడైనా పిల్లల, పెద్దల సలహాను, అభిప్రాయములను తృణీకరించలేదు. పైగా, వాటన్నింటిని జీర్ణించుకొని లక్ష్యసాధన చేసిన మహావ్యక్తి.



వ్యక్తిగత సత్యాగ్రహ సందర్భంలో పండు ముదుసలులైన కొండా వెంకటప్పయ్యగారిని, కొవ్వూరు వాస్తవ్యులైన రెబ్బాప్రగడ నందీశ్వరశర్మగారిని సత్యాగ్రహుల లిస్టులో ఆంధ్ర ప్రదేశ్ సత్యాగ్రహ కాంగ్రెస్ కమిటీ చేర్చారు. వారు సైతం తమ అంగీకారం, ఉద్యుక్తతను చూపారు.

కాని, బాపు సత్యాగ్రహుల లిస్టు చూసిన పిదప మీరు నాకన్నా చాలా పెద్దవారు, మీ సత్యాగ్రహం కన్నా, మీ ఆశీర్వచన బలమే నాకు చాలా గొప్పది అంటూ వారిపై గౌరవం, విధేయత, కర్తవ్యములను వ్యక్తపరచారు. ఇది మనందరికీ ఆదర్శము.



# భన్సాలి కాకా అమృతహస్తం

**స్త్రీ మాతృకత :**

చీమూరు, అష్టి గ్రామాలలో స్త్రీలు మానభంగానికి గురి అయ్యారు. దానికి నిరసన తెలుపుతూ ఆమరణదీక్ష పూనిన మహావ్యక్తి భన్సాలి కాకా.

**బన్సాలి – సూర్యోదయం :**

ఆయన తెల్లవారు ఝామున లేచి సరిగ్గా 4 గంటలకు బాపూజీ వద్దకు వెళ్లి, తన లాంతరు వెల్తురులో వారి ముఖమును ప్రతిదినం సందర్శించుకునేవాడు. సూర్యుడు గతి తప్పవచ్చు, గడియారం అయినా దారి తప్పవచ్చు, టైము సరిగా చూపకపోవచ్చు. కాని భన్సాలి కాక లాంతరుతో బాపూజీ వద్ద చేరాడంటే సమయం నాల్గు అయిందన్న మాట. అందుకని బాపూజీ, 'పంక్చుయాలిటీ కాకాజీ వద్ద నేర్చుకోండి' అనేవారు.

**మౌనం :**

వారు నోరు కట్టుకొని కొన్ని సంవత్సరాలు మౌనం పాటించారు. అది సాధారణ వ్యక్తులకు సాధ్యం కాదు.

**రోగం మన మంచికే వచ్చింది :**

ఆయన బాపూజీతో పాటు రొట్టె, పచ్చి కూరలు తినేవారు. ఇదే ఆహారం నేను కూడా తినేవాడిని. కాని అది నాకు గిట్టలేదు. నేను అరిశమొలలతో బాధపడే వాడిని. ఒక్కొక్కప్పుడు నెత్తురు ప్రవాహమయ్యేది.

ఒక సందర్భంలో నేను, కాకాజీ సఫాయి చేయడానికి పోయాము. నా లుంగీపై నెత్తురు చూశారు. కారణం తెలుసుకొనవచ్చా అని అడిగారు. నేను నా పరిస్థితిని, ఆహార యిబ్బందిని చెప్పాను. మరుసటి రోజు నుంచి నాకు అన్నం వండిపెట్టి తినిపించసాగారు. అంతటి తపస్వి చేతితో నాకు అన్నం లభించింది. ఇలా ఎవరిని, ఎందుకు, ఏ కారణం వల్ల విధి దగ్గరకు తీస్తుందో చెప్పడం కష్టం. ఏదయినా ఆయన శ్రమ నాకు బాకీ వుండి నేను ఆయన చేతితో భోజనం చేసే అదృష్టం నా నొదుట వ్రాసి వుంది. ఏదయినా, భన్సాలి కాకా ఒక ఋషి. మహాతపస్వి, నా అనారోగ్యానికి పరిష్కారంగా ఆ మహనీయుని నుండి అందుకున్న ఆదరణ నిజంగా పూర్వజన్మ సుకృతంగా భావిస్తాను.

జీవన్మాత్రులకు సేవగావించుటకై మన సర్వస్వమూ అర్పించవలనను ఆశ పెట్టుకునుటయే నిజమైన నమ్రత అని భన్సాలీ, బాపు భావించేవారు.



# ఇల్లాలి రాక

ప్రభాకర్‌జీ తోడ్పాటువల్ల నాకు గాంధీజీతో పాటు ఆశ్రమంలో సహపంక్తి భోజనం చేసే అదృష్టం లభించింది.

ప్రతిరోజు తెల్లవారు ఝామున లేచి చల్లలో కవ్వం గొల్లభామలాగా ఆడించి, వెన్న తీయడం, పాలు, వెన్న, నేయి అమ్మడం, బాపుతో పాటు మధ్యాహ్నం, సాయంత్రం భోజనం చేయడం, ప్రార్థనా సమావేశంకు హాజరు కావడం రోజువారి కార్యక్రమం అయింది.

నా పనిని బట్టి, ఆశ్రమంలో నిక్కరు, సగం చొక్కా, తలకు ఒక దస్తీ కట్టుకోవడం అలవాటయింది.

ఈ మారిన వేషంలో, దుస్తులతో 4.7.1941న మధ్యాహ్నం భోజనానికి బయలుదేరగా, నా వెనుక తెలుగు సంభాషణతో ఎవరో రాసాగారు. అది మొదట నేను అంతగా పట్టించుకోలేదు కాని ఆ గొంతు, సంభాషణ ఏదో తెలిసిన వారిదిలాగా ఉండింది. వెనుకకు పరీక్షగా చూసేటప్పటికి, మా ఆవిడ 'బావా' అని కేక వేసింది. అలాగే నా బావమరిది నాగరాజం కూడా.

ఇదేమిటి అనుకోకుండా, చెప్పకుండా వచ్చారేమిటి అన్నా.

మహిళాశ్రమంలో అక్కయ్యను చేరుద్దాం అన్నారు కదా అందుకై అక్కయ్యను తీసుకొని వచ్చానన్నాడు. అప్పటికే వార్ధా మహిళాశ్రమం అడ్మిషన్ను తేదీ అయిపోయింది. ఈ విషయం నేను వ్రాశాను. కాని నా ఉత్తరం వరంగల్లులో వారికి చేరేటప్పటికి వారిరువురు భోజనానికై ఆశ్రమం చేరారు. దీనితో జీవనం ఒక క్రొత్త మలుపు తీసికొంది.

మిట్టమధ్యాహ్నం ఆశ్రమ నియమాల ప్రకారం ఉదయమే అతిధుల పేరు, ఎవరైనా ఆశ్రమవాసి వ్రాయించాలి. వ్యవధి లేదు. ఏం చేయాలో తోచలేదు.

★★★

# ఆశ్రమ నియమాలు
# బాపూతో వ్యాహ్యాళి

ఆ పరిస్థితుల్లో ఏమి చేయాలో తోచక పృథ్వీసింగ్ రసోయికి పోయాము. అతను నవ్వుతూ, 'హౌస్ ఆఫ్ కామన్స్‌కు ఎలా వచ్చావు' అన్నారు. ఈ 'బహెన్' ఎవరు? మా జొన్న రొట్టెలు తినిపించటానికి పిలుచుకు వచ్చావా అన్నారు. ఆవిడ నా భార్య. మీ యింటికి భోజనానికి వచ్చింది అని అన్నాను. 'రా రా బహెన్' అంటూ కూర్చోబెట్టారు. రొట్టెలు చేసారు. తినిపించారు. ఆ విధంగా వారిరువురికి యొక విప్లవకారుని చేతలో రొట్టె తినే అదృష్టం కలిగింది. ఈ భోజనం విలువ ఎంత? ఎంత అదృష్టం? మా భోజనానంతరము ముప్పురము కలిసాము. వారికి నేను వుండే గది, నేను వెన్న నుండి నెయ్యి తీయు గది; పాలు పెరుగు అమ్మకాలు, చివరకు నేను కవ్వంతో గొల్లభామలాగా చల్లలో వెన్న తీయు గది చూపాను. బావా, ఇన్ని గదులా? అన్నది. 'ఆ' అని తలవూపాను.

ఆశ్రమంలో అంతా చూడడం అయింది. సాయంత్రం అందరం కలిసి బాపుతోవ్యాహ్యాలికి వెళ్లాం.

చిమన్ లాల్జీకి మా చిట్టిని, బావమరిదిని పరిచయం చేయించాను. వారు రాత్రికి ఇక్కడ వుంటారు. వారికి ఆశ్రమంలో నిద్రించుటకు అవకాశం కల్పించవలసిందిగా కోరాను.

**ఆయన ఏ మూడ్ (mood) లో వున్నాడో, తెలియదు. ఆశ్రమ నియమాలు నీకు తెలుసుకదా? ఆవిడ యిక్కడ రాత్రి వుండడానికి వీలుకాదు. ఇది ఆశ్రమ నియమాలకు విరుద్ధం. ఈ జవాబు నేను అనుకున్నది కాదు. నాగరాజం, చిట్టి నిర్ఘాంతపోయారు. మా ఆవిడ పార్నీకరు ఇంటిలో వుంటుందన్నాను. అది కుదరదని అన్నారు. ఏమి చేయాలో తోచలేదు.**

అయితే మనం తిరిగి వార్ధా పోదాం. అచట ఏదో హోటల్‌లో గది తీసుకొందాం, రాత్రి గడుపుదాం అని మా బావ మరిది అన్నాడు. చిట్టి అదే అంది. గాంధీగారిని, పృథ్వీ సింగును, సురేందర్‌ను, ఆశ్రమ పరిసరాలను, నాకు కేటాయించబడిన గదుల సంఖ్య వసతులు చూచినవి అన్నీ మరచి పోయారు. ఇదేం ఆశ్రమం, మర్యాద లేదు అంటూ మా చిట్టి, నాగరాజం బాధపడ్డారు. ఆ రాత్రి ముప్పురం వార్ధా బయలుదేరాం.

# వ్యాపారి - వ్యాపారే

సేవాగ్రాం ఆశ్రమం వదలి అదే రోజు (4.7.1941) రాత్రి నడచుకుంటూ మేము ముగ్గురము వార్ధా చేరాము.

**ఫతేసింగ్ హోటల్ :**

వార్ధాలో గ్రామీణ విద్యాలయం అంటిపెట్టుకొని ఫతేసింగ్ హోటల్ వుంది. నేను గ్రామీణ విద్యాలయంలో చేరిన నాటి నుంచి అతను నాకు చాలా సన్నిహితుడయ్యాడు. ఆ హోటల్‌కే టిఫిన్‌కు వెళ్ళేవాడిని. వేరే తినదలచుకొన్న తోటి విద్యార్థులను ఫతేసింగ్ హోటల్‌కే పంపేవాడిని. ఆ హోటల్‌ను గూర్చి, ఫతేసింగ్ మంచితనాన్ని గూర్చి నేను చాలా ప్రచారం చేశాను. అతనికి నా ప్రచారం వల్ల చాలా లాభం వచ్చింది. విద్యాలయాన్ని వదలి నేను సేవాగ్రాం ఆశ్రమానికి పోయేటప్పుడు వీడ్కోలు విందు అచటనే జరిగింది.

ఇది జ్ఞప్తికి వచ్చి నేను, నా బావమరిది, చిట్టి వార్ధాలోని ఫతేసింగ్ హోటలుకు 4.7.41న వెళ్లాము. నన్ను చూసి ఫతేసింగు చాలా ఆశ్చర్యపోయాడు. ఇదేమిటి అంటూ ఆలింగనం చేసుకొన్నాడు. కుశల ప్రశ్నలు అడిగాడు. పాతరోజులు జ్ఞప్తికి వచ్చాయి. అతని ప్రేమ, ఆదరణ గతంలోకన్న అధికంగా పొందుతున్నట్లు అనిపించింది. అనేక విషయాలు మాట్లాడుకొన్నాం.

**మేమంతా సినిమాకు పోయాం :**

**తరువాత టిఫిన్, టీ తీసుకొని మేము సినిమాకు వెళ్లివస్తాము, మాకు పడుకునేందుకు ఒక గదిని ఏర్పాటు చేయమన్నాను. 'రాజా, నీకు లేదంటానా? ' అన్నాడు. సామానులు ఒక మూల పెట్టించాడు. సినిమా చూసి వచ్చాం. ఇప్పటికైనా నేను సన్యాసిని కాలేదని నమ్మకం కలిగిందా? అని మా చిట్టిని, బావమరిదిని అడిగాను. 'బావా ! నీవు ఎప్పుడు ఏంచేస్తావో తెలియదు', అని జవాబు ఇచ్చారు.**

**అన్నం పెట్టాడు :**

ఇలా సంభాషించుకుంటూ సెకండ్‌షో సినిమా చూసి, హోటలుకు వణుకుతూ వచ్చాం. ఫతేసింగును మా గది ఏది అని అడిగాను. ఒక గంట వుండండి, ఒక గది ఖాళీ అవుతుంది. ఈలోగా మీ కోసం మూడు 'తాలీలు' అన్నం ప్లేట్లు వుంచాను, భోజనం చేయండి అంటూ మా ముందు మూడు ప్లేట్లు అన్నం వుంచాడు.

భోజనం చేశాము. రెండు గంటలయి పోయింది. నిదుర వస్తున్నది. ఫతేసింగును మా గది ఏది ? అన్నాను. మౌనం వహించాడు. ఆగ్రహం వచ్చింది. అతని గురించి నేనంత గొప్పగా చెప్పానో, అది మా బావమరిదికి, చిట్టికి అబద్ధం అనిపించింది. ఏదయినా ''బిజినెస్ మెన్ బిజినెస్ మెనే'' ''వ్యాపారి వ్యాపారే''. అతనిని నమ్మటం తప్పు మనది కదా అంది మా చిట్టి.

**కట్టుకున్న గుడ్డలతో పడుకున్నా :**

నన్ను నేను సమర్థించుకుంటూ చిట్టీ ఇది కొంత నిజం కావచ్చు. అతని పరిస్థితులు ఏమిటో అన్నాను. చివరకు ఒక గది తలుపులు తీసాడు. వెంటనే రెండు మూడు ఎలుకలు బయటికి పరిగెత్తాయి. మంచం లేదు. కప్పుకునే దుప్పటి లేదు. నా బావమరిది నాగరాజం వరండాలో తన ధోవతి పరచి పడుకున్నాడు. మేము ఖిరుప్పురం కట్టుకున్న చీర, ధోవతి జోడించుకొని వార్డాలో ఆ రాత్రి గడిపాం. తెల్లవారింది కాలకృత్యాలు నెరవేర్చుకొని ఫతేసింగుకు ఒకమాటు చెప్పి పోదామనుకున్నాను. అతడు అగుపడలేదు. పెట్టె కదిలించే టప్పటికి బిల్లు ఎదురయింది.

**బిల్లు ఎదురయింది :**

బిల్లు తెచ్చిన అతనిని ఫతేసింగు యేడి? అని అడిగాను.

క్షమించాలి? ఇప్పుడే బయటకు వెళ్ళాడని అన్నాడు.

బిల్లు చెల్లించడం అయింది. మనం ఫతేసింగును కలువక పోయినా బిల్లు అడగడం యేమిటి? అన్నది మా చిట్టి.

మా బావమరిది అతను వ్యాపారి. వ్యాపారి వ్యాపారే. అది వ్యాపారి ధర్మం అన్నాడు.

**వ్యాపారి - వ్యాపార బుద్ధి :**

అది కూడా ఒక నీతి కదా అనుకుంటూ సేవాగ్రాం ఆశ్రమానికి బాపూను కలుసుకొనుడానికై ప్రయాణమై పోయాం.

'ఠోకరే ఖానేసే బన్‌తాహై ఇన్‌సాన్', 'దెబ్బలు తింటుంటేనే మనిషి అవుతాడు' అనే సామెత నిజమనిపించింది.



# వ్యాపార నీతి

వ్యాపారం మన సాంఘిక వ్యవస్థలో (సోషల్ ఆర్డర్)లో ఒక భాగం. అందుకనే వేదాలలో సైతము అందుగల సాధకబాధకములు గుర్తించి కొంతవరకు అబద్ధము ఆడవచ్చు అన్నారు. దీనికి విస్తృతరంగంలో ఆపద్ధర్మం అన్నారు. కానీ, అధికమైనచో సాంఘిక వ్యవస్థ దెబ్బతింటుంది. (Vedas say that Business to a certain extent needs untruth also.)

కానీ బాపూ ఈ విషయంలో రాజీపడలేక పోయారు. 'సత్యమేవ జయతు' అనే సిద్ధాంతాన్ని ఆయన విశ్వసించాడు. ఈ భూమికలో సమాజ వ్యవస్థలో శాంతి, సౌభాగ్యాలను నెలకొల్పడానికి ఈ క్రింది నియమాలు తప్పక త్యజించాలని ఆయన బోధించాడు.

1. నియమనిష్టలు లేని రాజకీయాలు.
2. మానవతలేని శాస్త్ర విజ్ఞానం.
3. అంతఃకరణ లేని ఆనందం.
4. త్యాగం లేని పూజ.
5. నీతిలేని వాణిజ్యం.
6. పనిలేని సంపద.
7. శీలం లేని విద్య.



## సికిందరాబాద్ తిరుగు ప్రయాణం

# దురదృష్టమో - అదృష్టమో

### అంతా బాపూకు తెల్సు :

ఫతేసింగు హోటలు వదలి 5.7.1941న సేవాగ్రాం చేరాము. వాహ్యాళిలో బాపూకు చిట్టి వచ్చిన తరువాత జరిగినదంతా సవివరంగా చెప్పాను. ఆయన దీర్ఘ ఆలోచనలో పడ్డట్టు అనిపించింది. నడుస్తూ నడుస్తూ వున్న వాడల్లా ఒక్క చూపు మాకేసి చూశారు. ఆయన ఒక నిమిషం నడక ఆపినట్లయింది.

### బాధాకరమైంది :

'ఊ' అంటూ అది ఎలా జరిగింది? అదీ, చిమన్ లాల్జీతోనా, అంటూ గబ గబ నడువసాగారు. మేము వారితో వెళ్ళాము.

### చిమన్ లాల్జీని దండించాలి :

నేను బాపూ నా కథంతా విన్న మీదట చిమన్ లాల్జీని ఆయన దండిస్తారనుకొన్నాను. నా మనసులో కఠోరంగా, నిర్దాక్షిణ్యంగా నాభార్య చిట్టిని ఆ రాత్రి అచట ఉండకూడదని అన్నందుకు చిమన్ లాల్జికి తగిన శాస్తి బాపూ చేయాలని ఉంది. బాపు మౌనం దాల్చినందుకు ఆయనపై నాకు కోపం కూడా వచ్చింది. కాని ఏం చేయాలి? ఏమీ చేయలేక పోయాను.

### నీ బాధ చిమన్‌లాల్జీకి చెప్పు - ఇదే శిక్ష :

కాని, బాపూ వాహ్యాళి చివరదశలో ''రాజా'' నీవు చిమన్ లాల్జి వద్దకు పోయి, నిన్న మాపట్ల జరిగిన దానికి తాను చాలా బాధపడ్డానని చెప్పమన్నాడు. ఈ మాటలు ఎందుకో నాకర్థం కాలేదు అయినా బాపూ చెప్పిన ప్రకారం చిమన్ లాల్జీ వద్దకు వెళ్లి నిన్న జరిగిన దానికి బాపూ చాలా బాధపడుతున్నారని చెప్పమన్నారని చెప్పాను.

చిమన్ లాల్‌జీ ఈ మాటలు వినగానే కంటివెంట నీరు కార్చసాగారు. నాకు ఆ కన్నీరెందుకో అర్థం కాలేదు. చిమన్ లాల్‌జీ కన్నీరు తుడుచుకుంటూ నా భుజంపై చేయి వేసి, బాపూ చాలా బాధపడ్డారా? అని పదే పదే అడుగసాగారు. అవును, అవునని నేను గట్టిగా సమాధానం ఇస్తూ పోయాను.

బాపూను నేను బాధపెట్టానా? అంటూ కన్నీరు :

అతను నా రెండు చేతులు పట్టుకొని ఏమీ అనుకోవద్దు. మీ దంపతులు యిరువురు ఆశ్రమంలోనే వుండండి. గది యిస్తాను. వంట సామాన్లు యిస్తాను. వంట సామగ్రి ఒక నెలకో, రెండు నెలలకో సరిపోయే అడ్వాన్సు యిస్తాను, అంటూ బాపూను నేనంతగా బాధ పెట్టానా అంటూ పదే పదే వాపోయాడు.

బాపూ మాటయే - సంపూర్ణ శిక్ష :

బాపూ మాటతోనే అతనికి సంపూర్ణ శిక్ష లభించినట్లయింది. ఇది బాపూకు, బాపూ అనుయాయులయిన ఆశ్రమవాసులకు వున్న సంబంధం.

ఈరోజుల్లో ఇలాంటి ఆత్మీయత, సంబంధం చూడగల్గుతామా? అనేది ప్రశ్న.

ఆదే సాయంత్రం చిమన్‌లాల్‌జీతో తను చెప్పిన విధంగా చెప్పానని, అతను కన్నీరు కార్చారని, మమ్మల్ని ఆశ్రమంలో వుండమన్నారని బాపూతో చెప్పాను.

బాపూ ఒకసారి తేరిపార చూసారు. బాపూ చిమన్‌లాల్జీ పశ్చాత్తాపంతో తృప్తిపడ్డట్టు నాకు అనిపించింది. వారి మనస్సుకు సమస్య పరిష్కారమయిందని కూడా భావించినట్లు నేను గుర్తించాను.

చిమన్ లాల్జీకి తాను చెప్పిన విషయం బాపూకు చెప్పానని అన్నాను. నా బాధ కూడా చెప్పావా ఆయనకు? అని పదే పదే అడిగారు. అవును, అన్నాను.

ఆ తరువాత నేను చిమన్‌లాల్జీతో ఈ ఘట్టం తరువాత నా మనసు యిచట లేదు. నేను ఆశ్రమం వదలి వెళ్లిపోతున్నాను. 'క్షమించండి' అన్నాను. చిమన్‌లాల్జీ చాలా సేపు బ్రతిమిలాడి ఆశ్రమం వదల వద్దన్నాడు. బుజ్జగించాడు. భవిష్యత్తు చెడగొట్టుకోవద్దని పదే పదే చెప్పాడు.

# రాజాజీ - బా మందలింపు

కాని, నా మనసు సమాధానపడలేదు. ఆ తరువాత కస్తూరిబా వద్దకుపోయాను. ఆవిడకు ఈ విషయం అప్పటికే తెలిసిపోయింది. మధ్యాహ్నం భోజనం గంట కొట్టారు. రమ్మని వెంట తీసుకొని పోయింది. మా ప్రక్కన ప్రభాకర్, బా, బాపూ, రాజగోపాలాచారిగారు వరుసగా కూర్చున్నారు. భోజనం మధ్య బా ప్రభాకర్‌జీని ఉద్దేశించి, ''రాజా ఆశ్రమం వదలి పోతున్నానంటున్నాడు. నీవైనా చెప్పు, పోవద్దని'' అంది. ప్రభాకర్‌జీ 'బా'తో ''బాపూ కూడా అదే చెప్పారు, కాని వినడం లేదు. ఏం చేయాలి?'' అన్నారు.



'బా' ప్రభాకర్‌జీ మాటలు విని, ప్రక్కనున్న రాజగోపాలాచారితో ''బాపూ వద్దన్నా, ఆశ్రమం వదలి పోతానంటున్నాడు ఈ రాజా'' అంది. నన్ను ఉద్దేశించి, 'ఇటీజ్ ఫూలిష్ (it is foolish)' అని రాజగోపాలాచారి బిగ్గరగా అన్నారు.

నేను తలవంచుకున్నాను. ఏమీ జవాబు ఇయ్యలేదు. ప్రభాకర్‌జీ ఆలోచించు రాజా, తొందరపడవద్దు. పెద్దలు చెపుతున్నారు విను, అన్నారు.

ప్రభాకర్‌జీ, మనసు లేని చోట పనిచేయగలమా? మీరే చెప్పండి? అని అతనిని తిరుగు ప్రశ్న వేసాను. అయినా రేపు చూద్దాం. బాపూను మరొకసారి వ్యాహ్యాలిలో కలుసుకుంటాం కదా, అన్నాను.

అనుకొన్న ప్రకారం మరుసటి రోజు 6.7.41న బాపుని వ్యాహ్యాలిలో కలసి వారికి పాదాభివందనం చేసి మేము దంపతులము, నా బావమరిది సేవాగ్రాం వదిలి వేసాము.

బాపూ మీ భవిష్యత్ కార్యక్రమం ఏమిటి? అన్నారు. నిర్మాణ కార్యక్రమం మాత్రం వదలనని అన్నాను. 'ఠీక్ హై' అంటూ ఆయన ముందుకు సాగారు. మేము తిరిగి వార్ధా చేరాము.

★★★

# నిర్మాణ కార్యక్రమం

## కస్తూరి బా - చిట్టి

7.7.41 ఉదయం అనుకున్నట్లు బాపూను మేము ముగ్గురము వ్యాహ్యాళిలో కలిసాం. బాపూ, 'క్యాహువా' ఏమయింది అని అడిగారు. 'చిమన్‌లాల్జీ తగు ఏర్పాటు చేస్తాను, దంపతులిద్దరూ వుండండని అన్నారని' చెప్పాను. 'తో ఠీక్ హై' - సరే నన్నారు.

నేను వెనుక ముందు ఆడుతూ, 'బాపు ఏమనకోకండి, మేరా దిల్ ఇదర్ నహీహై, నా మనసు యిచట లేదు. నేను ఆశ్రమం వదలి పోతున్నాను. సెలవు ఇయ్యండి' అని అన్నాను. ఒక సెకండు ఆగి, తేరిపార చూస్తూ, 'ఆశ్రమం వదలి ఏమి చేస్తావని' అడిగారు. 'నిర్మాణ కార్యక్రమం' అన్నాను.

భవన/వ్యవస్థ నిర్మాణము, అవి దుర్వినియోగమయితే దానిని మనమే తుద ముట్టించడం, పనివల్ల ద్వేషము పెరిగి అసూయతో గిట్టనివారు దానికి నిప్పు అంటిస్తే అది చూసి ఆనందించడం నిర్మాణ కార్యక్రమంలోని భాగాలని గుర్తించాలి అన్నారు.

దీనికి అనువగు శక్తి మనోధైర్యము సంపాదించాలి. అప్పుడే తగు ఫలితం వుంటుంది. ఇది బాపు నాకిచ్చిన తుది సందేశం. ఆ తరువాత 'బాపు, నాకు సెలవియ్యండని' పాదాభివందనం చేశాను. 'అచ్ఛా' అని....తల వూపారు.



ఆ తరువాత మేము ముగ్గురం కలిసి ప్రభాకర్‌జీకి కేటాయించబడిన పనులు చూసుకుంటూ కస్తూరిబా వున్న రసోయిశాల వద్దకు పోయాము. ఆవిడ మామూలు గృహిణిలాగా కూరలు కోస్తున్నది. మరి ఇద్దరు ఆవిడ పక్కన అదే పనిలో నిమగ్నమై వున్నారు.

ప్రభాకర్‌జీ తన మామూలు పద్ధతిలో ఉత్తరీయం సవరించుకుంటూ, ''కొంచెం తల పక్కకు వంచి, చేతితో చిట్టిని 'బా'కు చూపుతూ, 'ఈవిడ రాజా...' అని చూపించాడు. బా 'నిన్న చూసాను కదా' అంటూ, చిట్టిని కూర్చోమంది.

ఆప్యతితో దగ్గరకు తీసుకుంది. ''ఏక్ హాత్ బటావ్'', ''ఒక చెయ్యి వెయ్యి'' అంది. చిట్టి అప్రయత్నంగా బా వద్ద కూర్చుంది. ఆశ్రమవాసులు తినే కూరలను చిట్టి బాతో కలిసి కోసిపెట్టింది. బా చల్లని చేయి చిట్టిపై పడింది. చిట్టి బాను నాకు సెలవియ్యండని అడిగింది. 'మీవారు ఆశ్రమం వదలుతున్నారు కదా!' అంటూ, 'జీతే రహో భేటీ' అంటూ ఆశీర్వదించింది. నేను కూడా ఆవిడకు నమస్కరించాను. ఆరోజే మా సేవాగ్రాం ఆశ్రమజీవన తుది ఘడియలు.

---

ముస్తాబాదులో
# నిర్మాణ కార్యక్రమం

12 రోజులు నాగరాజా అనే మిత్రుని ఇంట్లో వార్ధాలో గడిపిన పిమ్మట జులై 19, 1941న నేను, నా భార్య, బావమరిది గాంధీ ఆశ్రమం వదలి సికింద్రాబాదు చేరి జమ్మలమడక సూర్యప్రకాశరావు గారింట్లో మకాం పెట్టాము.



అన్నం రాజారెడ్డి

ఆ తరువాత అన్నం రాజారెడ్డి సోదరుల ఆహ్వానంపై ముస్తాబాదు చేరాము. గ్రామస్థుల అతిథ్యం పొందాము. కొద్దిరోజులలోనే వారి ఆప్యత, ప్రేమ లభించే అదృష్టం నాకు కలిగింది. దీనిని ఆధారం చేసుకొని నిర్మాణ కార్యక్రమం, బాపుకు చెప్పిన ప్రకారం ముస్తాబాదులో ప్రారంభించాలని నిశ్చయించుకొని, గాంధీజీ ఆశీస్సులు పొందాలనుకొని వారికి లేఖ వ్రాసాము.

ఆ లేఖకు ప్రత్యుత్తరంగా ఆశ్రమం మేనేజరు చిమన్ లాల్జీ, తోటి మిత్రుడు ప్రభాకర్‌జీ వ్రాసిన రెండు ఉత్తరాలు ఇచట పొందుపరచటం అవసరం. ఈ లేఖలే వారి ఆశీర్వచనలుగా భావించి, ఖాదీ చరఖా ఉద్యమం ముస్తాబాదులో ప్రారంభించాము.

Dear Rajalingam,

I am glad to have a letter from you. I am also glad to see that you are filled with feelings or services. But as a friend I should give you a right guidance. You have not got enough practical knowledge of Khadi Sastra when you have a deep knowledge of the work you are going to do. You will not be successful and you will waste your money and people will lose faith on you. In this way you will be disillusioned. So, my adivce to you is to work for some years with some performanced men and then to begin work on your own possibly.

I have also consulted Bapu in this matter. He also wishes that his name can not be used in this way.

Yours sincerely,
Sd/-
Chamanlalji

ప్రియ రాజలింగంకి,

నీవు వ్రాసిన ఉత్తరం చేరినది. సంగతులు తెలిసినవి. నీ జాబు మా మనస్సులను కరిగించలేదు. తుదకు బాపు మనస్సును కూడా కరిగించలేక పోయెను. చెప్పవలసినదంతా సవిస్తరముగా బాపూజీతో మాట్లాడాము. నేను బాపూజీ చెప్పిన మాటను కిషన్‌లాల్‌జీ వ్రాసినందున నే రాయవలసిన అవసరం లేదు. అగ్నిగుండంలో దుమికే వానిని వలదని చెప్పాం. లేదు నేను తప్పక వెళ్ళితీరాలి అని పట్టుపడితే, అటువంటి వానికి ఆశీర్వచనములు ఎవరివ్వగలరు? సత్యమును, వున్నది వున్నట్టుగా చెప్పాము. నీ ఇష్టం, యిప్పటికైనా మాని మేము చెప్పినరీతిగా చేస్తామంటే తగు ప్రయత్నం చేస్తాము. నీ కార్యక్రమం ఇక్కడ ఎవరికీ యిష్టం లేదు. సోదరిని కూడా మాతో వెళ్లతానంటే తగు ప్రయత్నం చేస్తాము. 1-2 సంవత్సరములు తర్ఫీదు పొంది జ్ఞానము సంపాదించి, నీకు ఇష్టము వచ్చిన గ్రామము ప్రవేశింపవచ్చును. గాంధీ సేవా సంఘం మెంబరు అవడమేగాక సహాయం దొరుకులాగున ప్రయత్నం చేస్తాము. సోదరిని కూడా గ్రామంలో చేర్చవచ్చు. నీవు నాల్వాడిలో పనిచేయవచ్చు. అప్పుడప్పుడు బాపూజీతో సంప్రదించవచ్చు.

నీకు కావలసింది 200 రూ.లు కాదు, తపశ్చర్య. దానిని సంపాదించినచో రూపాయలు వాటంతట అవే పరుగిడును. గొప్పవారి పరిచయము - వారి ఆశీర్వచనములు దొరుకును. కాబట్టి, నీ వాగ్దానంలో బలం లేదు. ఆ రెడ్డితో మాట్లాడి వాగ్దాన భంగం గాకుండా చేసుకొనవచ్చును. చెప్పవలసిన విషయములన్ని చెప్పితిని. ఇంకను నీ వాగ్దానమునే అనుసరించి పోయిన యెడల నేనేమి చేయగలను. అనుభవం వలన నీకు బోధపడును. నిన్ను దేవుడు మంచి మార్గమునకు త్రిప్పుగాక.

ప్రేమతో,

ప్రభాకర్‌జీ.

ఈ లేఖలు నాకంత రుచించలేదు. ఇది ఇలా వుండగా అఖిల భారత ఖాదీ గ్రామోద్యోగసంఘ కార్యదర్శి జె.సి.కుమారప్పగారు ఈ క్రింది ఆశీర్వచనలేఖ పంపారు.

*19 September, 1941.*

*Dear Rajalingam,*

*From yours of the 16th addressed to Bharatanji, who is on leave I am glad to know your starting work and wish you every success.*

*We do not supply any books free or on credit, so on receipt of the amount for the book you want they will be despatched. A survey questionaire is being sent for book-post.*

*Yours Sincerely,*
*Sd/-*
*(J.C.Kumarappa)*
*Organisor & Secretary*
*A.I.V.I.A.*

ఈ సందర్భంలో నాకు ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే, నన్ను "He is a fire to th Institution" ఇతను సంస్థకు నిప్పులాంటి వాడు అని గాంధీ ఆశ్రమంలో డైరీ ఫారమ్ మేనేజర్ పార్నీకర్‌జీకి చెప్పిన జె.సి.కుమారప్పగారు మనఃపూర్వక ఆశీర్వచనాలు పంపారు. నా కార్యక్రమాన్ని చూస్తూ సేవాగ్రాంలో అసిస్టెంట్ డైరీ ఫారమ్ మేనేజర్ స్థాయికి ఎదుగుట, అఖిల భారత గోసేవా సంఘంవారు నేను వెన్నపై చేసిన పరిశోధనకు గాను నెలకు ఇరవై రూపాయలు స్కాలర్‌షిప్ ఇచ్చుట తెలిసి తన చేతితో వేపాకు ప్రసాదం అందించిన బాపు నాకు ఆశీస్సులు నేను ఊహించిన విధంగా ఇవ్వకపోవడం నాకు బాధ కలిగించింది. అయినా, పెద్దల ప్రతి కార్యక్రమంలో ఏదో ఒక అంతర్వాణి మన శ్రేయస్సుకై ఉంటుందని నా నమ్మకం. గాంధీజీ ఆశీర్వచనములు ఇవ్వక పోయినా పర్యవసానంగా "జో సేవా కర్‌నా చాహ్‌తా హై, వహ్ ఖుద్ మిట్ జాతా హై" అన్న సూక్తి ఆశీర్వచనము పొందినా, పొందకపోయినా ఒకటే పరమావధికి దారితీస్తుంది అనే భావన నా ఆత్మశక్తిని పెంచింది. ఏకలవ్యుని చరిత్ర నా ముందు ఉండింది. చిత్తశుద్ధి, సత్ సంకల్పము, దీక్ష, పట్టుదల ఆశీర్వచనముల కన్నా మించినవని నేను భావించి ముస్తాబాదు కార్యక్రమం పట్టుదలతో కొనసాగించాను.

ముస్తాబాదులో ఖాదీ చరఖా ఉద్యమం ప్రారంభించాము. ప్యూడల్సు యింట్లలోని దొరసానులు నా చరఖాను స్వీకరించారు. నా కార్యక్రమం నిరాటంకంగా ముందంజ వేసింది. ఖాదీ చరఖా సంఘం ఏర్పాటయింది.

27.1.1942న ఈ క్రింది ప్రకటన దక్కన్ క్రానికల్ లో వెలువడింది.

## KHADI CHARKHA SANGH, MUSTABAD

*The organisors of Charkha Sangh, Mustabad, Sirsilla Taluq manufactured a few Charkhas of the Kisan type with slight modification and bringing down the price to O.S.(Osmania Sikka) Rs.1-12. The original Kisan Charkha manufactured at Vardha B.G. Rs.2-12.*

*The above reduction has been made though with a higher loss to enable every villager to possess a Charkha . Upto now 130 charkhas have been sold totally. Rapid arrangements are being made to produce Khadi on a large scale and increase the number of spinning hands in telengana. It may be noted that this is the first Sangh in the State to manufacture charkhas.*

ఖాదీ గ్రామోద్యోగ కార్యక్రమం ద్వారా నాతోటి కార్యకర్తల సంఖ్య పెరిగింది. అది పెరుగుతూ పోయింది. ఖాదీ కార్యక్రమాలు అచట సామాన్య ప్రజలపై, పెద్ద కుటుంబాలపై చాలా ప్రభావం చూపసాగాయి. ఈ పరిస్థితుల్లో గాంధీ ఆశ్రమం నుంచి ప్రభాకర్ గాంధీజీ మాటగా వారి సంతకముతో ఈ క్రింది లేఖను పంపారు. పర్యవసానంగా నేను ఓరుగల్లు చేరి క్విట్ ఇండియా ఉద్యమం నిర్వహించడం జరిగింది. జీవనంలో ఎన్ని ఒడుదుడుకులున్నా గాంధీజీ, కుమారప్ప, తోడి పెద్దల సేవ స్వాతంత్రోద్యమంలో భాగస్వామ్యం నాకు లభించడం ఎంతో అదృష్టం.

బాపూ ఆదేశాన్ని పాటించడమా లేక నిర్మాణ కార్యక్రమం సాగించడమా నిర్ణయించుకొనేలోపు ప్రభాకర్‌జీ నుంచి లేఖ నాకు వచ్చింది. అది :

మిత్రుడు రాజలింగమునకు,

నీవు రాసిన జాబు చాలా రోజుల క్రితమే చేరినది. సంగతులు విశదముగా తెలిసినవి. బాపూజీ కడపటి సందేశము నీకందజేయుచున్నాను. ఈ జ్యోతిని ప్రతి గ్రామంలోను, యింటింట వెలిగించు రచనాత్మక కార్యక్రమములు చక్కపెట్టు. చెల్లెలు లలిత సిద్ధమయితే ఆవిడ కూడ ఈ జ్యోతిని ఎక్కడపడితే అక్కడ వెలిగించవచ్చు. మనవారు నిన్నటి రోజునే స్వరాజ్యము సంపాదించితిమి. అహింసాత్మకముగా ఎన్ని విధాలా చట్టాలను దిక్కరించాలో ధిక్కరించి సమ్మెలను ఏర్పాటు చేస్తూ సర్కారును స్థంభింపచేయాలి. ఇందులో ఆహుతి కావలసి వచ్చినా కానివ్వండి.

మర్‌నికనామా మత్‌లో – హైతే

మరనా సీఖ్‌లో దేశ పరతంత్ర – ఆజాద్‌కర్‌నా – హైలో ''

నా కర్తవ్యము నేను చేయుచున్నాను.

1. ఏ ప్రాణిని కూడా హింస చేయకూడదు. తిట్టను కూడదు.
2. వ్యక్తిగత సంపత్తిని వినాశనము చేయకూడదు.

ఇది ఇలా వుండగా ప్రభాకర్‌జీ బాపూ సందేశంగా మరొక లేఖ వ్రాశాడు. అది ఇలా వుంది.:

1. "Every man is free to go to fullest length in Ahimsa"
2. "Complete deadlock,Strikes and other possible non-violent means"
3. "Satyagrahis should Go to die, not to leace:
4. "It is only individuals who go out to seek and face death that the nation will survive. Do or Die."

''నీ శక్తికి మించిన కార్యక్రమం చేయవద్దు. ఎంతవరకు నీవు చేయగలవో అంతవరకే చేయి, కాని ఊరికే ఉండవద్దు.''

సబ్ సుఖ్ – దుఃఖ్‌కి భీకర్ హై, కోన్ ఇసే సంహాలే,

చెల్లెలికి ఆశీర్వచనములతో,

ప్రేమతో,
ప్రభాకర్.

# క్విట్ ఇండియా ఉద్యమం

బాపు సందేశం ప్రభాకర్‌జీ లేఖ ద్వారా అందగానే నే ననేకమంది మిత్రుల్ని ముఖ్యంగా నా జన్మ స్థలమైన ఓరుగల్లు (వరంగల్) వారితో సంప్రదింపులు ప్రారంభించాను. అచటి మిత్రులు ఉద్యమ నిర్వహణ విషయంలో సమావేశమై వారి అభిప్రాయాల్ని పోలా కృష్ణమూర్తి సంతకంతో ఈ క్రింది విధంగా రాసి పంపారు. ఇది కోడ్ భాషలో వుంది.



4.8.1942.

బ్రహ్మశ్రీ రాజలింగంగారికి,

పోలా కృష్ణమూర్తి వందన శతంబులు. తరువాతను మీరు వ్రాయించిన కార్డు చేరి సంగతులు విశదమై చాలా సంతోషమైనది. అప్లికేషన్లు పంపినట్లు వ్రాసినారు. శ్రీచంద్రమౌళిగారు 30వ తేదీ అప్లికేషన్ పంపినారు. ఆలస్యముగా చేరినప్పటికి, మీరు ఇదివరకే మీ అప్లికేషన్లు పంపినప్పటికీ అది కూడా పంపించి వారిని ఒప్పించే బాధ్యత మీది అని నా ప్రార్థన. సేవా సంఘము యొక్క నివేదిక ఇంత తొందరలో అయ్యేటట్లు కనపడదు. వీలుంటే మద్దాల అనంతయ్యగారిని విచారించి వ్రాయించగలను. పరీక్ష తేదీ నీకు తెలిసిన వెంటనే శ్రమ అనక తొందరగా తీర్చగలరు.

పి. కృష్ణమూర్తి.

సత్యాగ్రహ లిస్టు తయారయ్యిందని, ఇంకా కొంతమందికి నచ్చ చెప్పే అవసరమున్నదని, వారిని ఒప్పించే బాధ్యత నాదని, సత్యాగ్రహ తేదీ త్వరలో మద్దాల శ్రీ అనంతయ్యగారిని విచారించి వ్రాయగలనని ఈ లేఖ అంతరార్థం

ఆ తరువాత 2 అక్టోబరు 1942న ఓరుగల్లు (వరంగల్)లో సత్యాగ్రహం ప్రారంభమయ్యింది. ఇదే యావత్భారతంలో జరిగిన క్విట్ ఇండియా ఉద్యమాలలో యొక కొలకపూసగా వుండి ఓరుగల్లు త్యాగులకు శాశ్వత గుర్తుగా నిలిచిపోయింది. ఇది ఓరుగల్లు ప్రజల అదృష్టం.

★★★